ఏ కెరటం ఎటు కొడుతుందో తెలియదు, మహాసముద్రం వంటి జీవితంలో ఏది ఎవరి తప్పనీ చెప్పలేం!



రామ విజేతా ఫిలింస్

# రామాలయం

స్క్రీన్‌ప్లే - దర్శకత్వం
కె. బాబూరావు

నిర్మాత
కె. ఎ. ప్రభాకర్





ఆంధ్ర జ్యోతి
సీడెడ్ నవభారత
నైజాం ఉషా
మైసూరు విజయా




| | | | |
|---|---|---|---|
| ధనికొండ హనుమంతరావు | * | గుడ్డివాడు | 17 |
| వైదేహి | * | సుందరహర్మ్యం | 117 |
| సత్యవాడ ఇందిరాదేవి | * | వర్షించనిమేఘం | 125 |
| కొడవటిగంటి కుటుంబరావు | * | సినిమాతార | 130 |
| సి జయ | * | మరుగుపడ్డ మంచితనం | 150 |
| గోపీచంద్ | * | సంపెంగ పువ్వు | 157 |
| పరిమళా సోమేశ్వర్ | * | తప్పటడుగు (సీరియల్) | 170 |


ముఖచిత్రం రాగదీపిక

చిత్రకారుడు వడ్డాది పాపయ్య


యువ సాలుచందా రూ 18-00

దీపావళి సంచికతో రూ 23-00

యువ వడపళని మదరాసు-26

గంగాధర

మానవుడిగా తనవృత్తి నిర్వర్తించడంలో దేవుడిగా న్యాయా
సమకూర్చడానికి నిలబడిన ఓ న్యాయమూర్తి కథ

మోడరన్ థియేటర్స్ 110వ చిత్రం

# నేనూ మనిషినే!

దర్శకత్వం జి వి ఆర్ శేషగిరిరావు

రచన రాజశ్రీ

సంగీతం. వేదా

ఛాయ·సి ఎ.యస్. మణి



విశాలాంధ్ర
నవయుగ విడుదల
ఈస్టర్న్ & వెస్టర్న్ సర్క్యూట్
శ్రీ సీతా ఫిలింస్




"మీనా" సీరియల్ అయిపోయిందే — ఇంతా సాగుతూంటే బాగుండు ననిపిస్తోంది. మొదటినుంచీ మరలా చదవాలనిపిస్తోంది.

సినిమా ప్రొడ్యూసర్ల దృష్టికూడా "మీనా" మీద పడియే వుండవచ్చు నను కుంటాను. రచయిత్రిగారికీ, మీకూ నా ధన్యవాదాలు. —జి. శశికళ, ఝాన్సీ.

అక్టోబరు నెల ముఖచిత్రం "శరదిందు లీల" అత్యంత మనోహరంగా వుంది. ధారావాహికంగా ప్రచురించిన మీనా సీరియల్ ముగింపు చాలాచాలా బాగుంది. మీనా, కృష్ణ, కృష్ణవేణమ్మ పాత్రలు మరపురానివి. మిగతా కథంతా ఒక ఎత్తు, ముగింపు ఒక ఎత్తు. 'తొలగిన తెరలు' కథ ఈ సంచికకే హైలైట్, మరపురాని మధురమైన కథ. పరిమళా సోమేశ్వర్‌గారి సీరియల్ 'తప్పటడుగు' మమ్మల్ని మొదట్లోనే విశేషంగా ఆకర్షించింది. 'కొత్తదారి' చిన్న కథ తమాషాగా వుంది.

—దారా లక్ష్మి కామాక్షి, సాలూరు.

ఆక్టోబరు నెల 'యువ' చాలా ఆకర్ష ణీయంగా వుంది. ప్రత్యేకంగా 'మీనా' సీరియల్ ముగింపు చాలా బాగుంది. 'తొలగిన తెరలు', 'బూజు పట్టిన వ్యక్తిత్వం' కథలు బాగానే వున్నాయి. సంపాదకీయం పత్రికకే హైలైట్!

—కుమారి రాధావంశీ, కాకినాడ.

"మీనా" సీరియల్ చదువుతున్నంత సేపూ ఏవో చెప్పలేని ఆనందానుభూతుల్లో లీనమయ్యాను. మీనా సీరియల్ ఇక లేదనుకునేసరికి హృదయం విచారానందాల్లో ఓలలాడింది. సులోచనారాణిగారికి నా హృదయపూర్వక అభివందనాలు.

—జి. శాంతి, చిత్తూరు.

"మీనా" ఇంత తొందరగా ముగిసి పోతుందనుకోలేదు. కాని, ముగింపు చాలా బాగుంది. నేను వూహించినట్టుగానే అయింది. పరిమళా సోమేశ్వర్‌గారి "తప్పటడుగు" చాలా ఇంటరెస్టింగ్‌గా వుంది.

"తులసమ్మగారు" "రిజెవాడు" "ఎవరు బాధ్యులు" కథలు బావున్నాయి. "విజయ"గారి "తొలగిన తెరలు" చాలా బాగుంది. చివర "ఘర్ ఘర్‌కి కహానీ" చిత్ర కథ ప్రచురించడం మాకు ఆనందాన్ని కల్గించింది.

—బి. వి. ఎస్. భానుశ్రీ, విశాఖపట్నం.

అక్టోబరు నెల 'యువ' చాలా ఆకర్ష ణీయంగా వుంది ప్రత్యేకంగా 'మీనా' సీరియల్ ముగింపు చాలా బాగుంది 'తొలగిన తెరలు', 'బూజు పట్టిన వ్యక్తిత్వం' కథలు బాగానే వున్నాయి సంపాద కీయం పత్రికకే హైలైట్!

—కుమారి రాధావంశీ, కాకినాడ

"మీనా" సీరియల్ చదువుతున్నంత సేపూ ఏవో చెప్పలేని ఆనందానుభూతుల్లో లీనమయ్యాను మీనా సీరియల్ ఇక లేదను కునేసరికి హృదయం విచారానందాల్లో ఓలలాడింది సులోచనారాణిగారికి నా హృదయపూర్వక అభివందనాలు

—జి శాంతి, చిత్తూరు

"మీనా" ఇంత తొందరగా ముగిసి పోతుందనుకోలేదు కాని, ముగింపు చాలా బాగుంది నేను వూహించినట్టుగానే అయింది పరిమళా సోమేశ్వర్‌గారి "తప్పటడుగు" చాలా ఇంటరెస్టింగ్‌గా వుంది

"తులసమ్మగారు" "రిక్షావాడు" "ఎవరు బాధ్యులు" కథలు బావున్నాయి "విజయ"గారి "తొలగిన తెరలు" చాలా బాగుంది చివర "ఘర్ ఘర్‌కి కహానీ" చిత్ర కథ ప్రచురించడం మాకు ఆనం దాన్ని కల్గించింది

—బి వి ఎస్ భానుశ్రీ విశాఖపట్నం.

తెలుగు భాషా పత్రిక
(తెలుగు భాషా సేవకై కంకణం కట్టుకున్న అమెరికా ఆంధ్రుల పత్రిక)
నిర్వహిస్తున్న

## సైన్సు ఫిక్షను కథల పోటీ

ఆధునిక విజ్ఞాన ప్రచారానికి సైన్సు ఫిక్షను (సైన్సు సూత్రాలను ఆధారం చేసుకుని వ్రాసిన కథలు, నవలలు) ఎంతైనా ఉపకరిస్తుందని, అట్టి సాహిత్యం తెలుగులో అంతంత మాత్రంగా ఉందని "తెలుగు భాషా పత్రిక" సంపాదక వర్గం గ్రహించి సైన్సు ఫిక్షను కథల పోటీ నిర్వహిస్తున్నది

నిబంధనలు

1, స్వీయ రచనలేకాని అనువాదాలు పంపరాదు 2 వ్రాతలో పదిహేను పేజీలకు మించరాదు 3 బహుమతి పొందిన కథలు 'తెలుగు భాషా పత్రిక' ఏప్రిల్ 1972 సంచికలో ప్రచురింపబడతాయి 4 రచనలు పంపుటకు ఆఖరు తేది జనవరి 31, 1972

మొదటి బహుమతి 300 రూపాయలు (మూడు వందల రూపాయలు)
రెండవ బహుమతి 150 రూపాయలు

తెలుగు భాషా పత్రిక వివరాలకోసం దిగువ చిరునామాకు వ్రాయండి
రచనలను రిజిష్టర్డు బుక్‌పోస్టులో పంపండి

శ్రీ రెడ్ల శేషగిరి రావు, M A, C A I I B,
'తెలుగు భాషా పత్రిక' గౌరవప్రతినిధి, బాంకు ఆఫ్ ఇండియా
విశాఖ పట్నం-1 ఆంధ్ర ప్రదేశ్

# చందమామ

(కథల మాసపత్రిక)

తెలుగు, తమిళం, కన్నడం, మళయాళం
హిందీ, మరాఠీ, గుజరాతీ, ఇంగ్లీషు
భాషలలో వెలువడుతున్నది.

త్వరలో
ఒరియా, బెంగాలీ భాషలలో వెలువడనున్నది.

చందమామ పబ్లికేషన్సు
మదరాసు - 26

ఫిలిం పరిశ్రమ
సేవకు
చిహ్నము




వెస్సస్
విజయ స్టూడియోస్
వాహిని స్టూడియోస్
మదరాసు

యువ

సచిత్ర మాసపత్రిక

సంచాలకుడు చక్రపాణి

సంపుటి 24 నవంబరు—1971 సంచిక 11

రాష్ట్ర ముఖ్యమంత్రులతోను, ఆర్థిక మంత్రులతోను, కేంద్ర ప్రభుత్వ ఆర్థికమంత్రి శ్రీ చవాన్ ఇటీవల ఢిల్లీలో చర్చలు జరిపారు. ఆర్థికమంత్రి చర్చలు జరిపారంటే, అది కేవలము ప్రజల దగ్గరనుంచి ఇంకా ఎక్కువగా డబ్బును ప్రభుత్వం ఎలా సేకరించాలనే విషయం తప్ప మరొకటి కాదు.

ఆ చర్చలలో పాల్గొన్న వారు చేసిన సూచనలయితే నేమి, కేంద్ర ప్రభుత్వ ఆర్థికమంత్రి చేసిన సూచనలయితేనేమి, మొత్తంమీద ఇంకా ఏ ఏ రకాల కొత్త పన్నులను వెయ్యాలి, ఏ ఏ పన్నులను ఇంకా ఎక్కువ చెయ్యాలి అనే విషయం మీదనే ఎక్కువగా నడిచాయి.

ఆ మంత్రుల సూచనలూ, వారి నిర్ణయాలూ పరిశీలించినట్లయితే, పన్నులు బాగా ఎక్కువ అయేటట్టే కనపడుతోంది. అయితే, యీ పన్నులు అతి త్వరలోనే ప్రజల నెత్తిన పడబోతున్నాయా, లేక కొంత వ్యవధి వుంటుందా?

కేంద్రంలోనూ రాష్ట్రాలలోనూ ప్రభుత్వాలు పెట్టే ఖర్చులను చూస్తే, త్వరలోనే కొత్త పన్నులను వెయ్యవలసిన అవసరం కనపడుతోంది. అయితే, నాలుగు నెలలలో సగం దేశంలో శాసన సభలకు ఎన్నికలు జరుగబోతున్నాయి. కనుక,

ఇప్పుడు కొత్త పన్నులను వేసినట్లయితే ప్రస్తుతం ప్రభుత్వం సాగిస్తున్న పార్టీకి అనుకూలంగా ఓట్లు రావేమోననే భయంతో, మళ్ళీ బడ్జెటు కాలంవరకు, అంటే, ఫిబ్రవరి వరకు, కొత్త పన్నులను వెయ్యడం జరగకపోవచ్చును. ఇప్పుడో, ఇంకో నాలుగు నెలలకో చాలా ఎక్కువగా పన్నులను వెయ్యడం మాత్రం తథ్యం.

ప్రజలు పన్నుల భారంతో ఇప్పటికే సతమతమవుతున్నారు. రాబడిమీద ఇచ్చే పన్నులుకాక, ప్రతి వ్యక్తీ తాను కొనే ప్రతి వస్తువు ఖరీదుతో, ఏదో ఒకవిధమైన పన్ను చెల్లిస్తున్నాడు. పన్నులవల్ల అనేక వస్తువుల ధరలు చాలా యెక్కువగా వున్నాయి. రోగపడి, వైద్యానికి మందులు కొనేవారు, ఆ మందులమీద కూడా హెచ్చుగా పన్ను చెల్లించవలసిన పరిస్థితి ఏర్పడింది.

ప్రభుత్వం, పరిపాలనకు కావలసిన ఖర్చును తగ్గించుకొని పన్నులను తగ్గించడానికి ఆలోచించడం, చాలా అవసరం. పాతికేళ్ళనాటికీ ఇప్పటికీ, పరిపాలనా వ్యయం విపరీతంగా పెరిగిపోయింది. అయినా, పరిపాలన మాత్రం మునుపటి అంత కట్టుదిట్టంగానూ, శీఘ్రగతిలోనూ జరగడంలేదు. ప్రతి ప్రభుత్వ కార్యాలయంలోనూ జాప్యం ఎక్కువగావుంది. లంచాలులేనిదే ఏ పనులూ జరగడంలేదనే అప్రతిష్ఠ బాగా వచ్చింది. ఒక ఉద్యోగి చేసే పనికి ముగ్గుర్ని నియమించినా పనులు జరగడంలేదు. కాని పరిపాలనా వ్యయం మాత్రం అపరిమితంగా వుంది.

పాతికేళ్ళనాడు భారత దేశంలో పదిహేను రాష్ట్రాలు వుండేవి. రాష్ట్రానికి పది, పన్నెండు మందికంటే యెక్కువమంది మంత్రులు వుండేవారు కారు. ఈనాడు చిన్నది, పెద్దవీ కలిపి 27 రాష్ట్రాలు వున్నాయి. పెద్ద రాష్ట్రాలలో కొన్నిటిలో ఒక్కొక్కదానిలో దాదాపు 30 మంది మంత్రులు ఉన్నారు. ఈ మంత్రుల జీతాలు, వారికీ, వారి పరివారానికీ అయే ప్రయాణ ఖర్చులు, వారు సంచారం చేస్తున్నప్పుడు, వారికోసం సంచారం చేసే ఉద్యోగస్తుల ప్రయాణ ఖర్చులు, రాష్ట్ర ప్రభుత్వ ఆదాయంలో ఒక పెద్ద మొత్తాన్ని మ్రింగి వేస్తున్నాయి.

ఒక ముఖ్యమంత్రి, తాను స్థిరంగా పదవిలో వుండడానికి తనకు మద్దతు యిచ్చే శాసనసభ్యులందరికీ మంత్రి పదవులను కట్టబెట్టడం ఈ నాడు ఒక మామూలు ఆచారమైపోయింది. శాసనసభ్యులు ఒక నాయకుణ్ణి యెన్నుకోవడము, ఆ నాయకుడు సమర్థులతో పరిపాలన సాగించగల కొద్ది మందిని మంత్రులుగా నియమించుకొని చక్కని పరిపాలన సాగించడం—ఇది పురాణగాథ అయిపోయింది.

తమ నియోజక వర్గంలోని ప్రజల కష్టసుఖాలను పరిశీలించి ప్రజల అవసరాలను ప్రభుత్వ దృష్టిలోకి తెచ్చి ప్రజలకు సౌకర్యాలను చేకూర్చడానికి పాటుపడే నిమిత్తం ఎన్నిక అయిన శాసన సభ్యులు, పదవులకోసం అతి తరచుగా ఒక పార్టీనుంచి ఇంకొక పార్టీకి మారడము చాలా యెక్కువగా జరుగుతున్నది.

ఈ పరిస్థితి మారకపోతే, దేశం బాగుపడదు. ఏ రాష్ట్రంలోనూ, ఏ పరిస్థితిలోనూ పదిహేను మందికన్న యెక్కువగా మంత్రులు వుండరాదనే నిషేధంవుంటే తప్ప, శాసన సభ్యులలో సగంకంటే యెక్కువమంది మంత్రులుగా నియమించబడే పరిస్థితి ఎప్పుడో ఒకప్పుడు రాకమానదు

మంత్రుల సంఖ్య పరిమితమైననాడు, ఉద్యోగుల సంఖ్య కూడా పరిమితమవుతుంది. కాలయాపన లేకుండా పరిపాలన సాగించవలసిన బాధ్యత వారిమీద వుంటుంది. ప్రభుత్వపు ఖర్చు తగ్గుతుంది.

ఈనాడు ప్రజలు చాలా ఎక్కువగా పన్నులను చెల్లించవలసిన అవసరం ఏర్పడిన కారణాలలో ముఖ్యమైన కారణం మరొకటి ఏమిటంటే: విపరీతమైన నష్టాలను పొందుతున్న అనేక పరిశ్రమలను ప్రభుత్వరంగంలో స్థాపించడం. ఇలాటి పరిశ్రమలవల్ల, ప్రజల డబ్బు దుర్వ్యయమైపోవడం తప్ప దేశానికి మరొక మేలు యేమీ కలగడంలేదు. దేశంలో పెద్ద పెద్ద పరిశ్రమలు ఏర్పడి, ఉత్పత్తి బాగా సాగాలంటే, ప్రభుత్వ రంగంలో కొత్త పరిశ్రమలను స్థాపించడం మానివెయ్యడమే కాక, ప్రస్తుతం ప్రభుత్వ రంగంలోవున్న పరిశ్రమలను కూడా ప్రైవేటు రంగంలో సమర్థులయినవారికి అప్ప చెప్పాలి. ఇలా చెయ్యడంలో, ప్రైవేటు రంగం వారు పొందవలసిన లాభాలకు ఒక పరిమితిని పెట్టవచ్చును; కార్మికులకు న్యాయమైన జీత భత్యాలు ఇచ్చేటట్టు నిబంధనలను ఏర్పాటు చెయ్యవచ్చును. అలాచేస్తే, పరిశ్రమల స్థాపనకు ప్రజల దగ్గరనుంచే యెంతో పెట్టుబడి వస్తుంది. ప్రభుత్వం పెట్టుబడి పెట్టవలసిన అవసరమూ వుండదు; విపరీతమైన పన్నులను వేసి ప్రజలను పీడించవలసిన అవసరమూ వుండదు.






ఆగండాగండి! వాళ్ళకు ఆకలి పెరగడానికి టానిక్కు రాసివ్వకండి - తిండిగింజల ధరలు తగ్గిన తర్వాత రాద్దురుగాని!

Anjan




జగన్నాథానికి తెలివి వొచ్చింది. తలమీద కొన్ని టన్నుల బరువు వున్నట్లు, తలను అన్నివైపులనించీ వొత్తిడి చేస్తున్నట్లు తోచింది. తను ఎక్కడ వున్నాడు? ఏమైందీ? ఇది ఏ లోకం? తనింకా బతికేవున్నాడా? ఇలాంటి ప్రశ్నలు అనేకం ఒక్కసారిగా కలగాపులగంగా అతన్ని ముంచెత్తినవి.

తనకు కొస్త దూరంలో బాగా గంజి పట్టించిన గుడ్డలువేసుకొని నడుస్తూన్నప్పుడు వొచ్చే శబ్దం వినిపిస్తోంది. తమాషా వాసన—ఏంటీ సెప్టిక్ మందుల వాసన ముక్కు పుటాలకు ఘాటుగా తగిలింది. ఒక కొననుంచి సన్నగా యీలపాటలు పాడుకుంటూ, చల్లగా హాయిగావుండే గాలి తనమీదినుంచి దూసుకునిపోతోంది. బహుశా రాత్రయి ఉండొచ్చు. ఆ చుట్టుపక్కల తిరిగే వ్యక్తుల పాదాల సవ్వడి చాలా మృదువుగా వుంది. బహుశా తేలిక మనుషులైనా ఐ వుండాలి; లేదా మునివేళ్లమీద నడుస్తూనైనా వుండాలి; లేక మెత్తని పాదరక్షలు—ఏ కాన్వాస్ బూట్లలాటివో వాడేవాళ్ళయినా ఐ వుండాలి

కళ్లు తెరుస్తే తన అనుమానాలు దాదాపు అన్నీ తీరుతవి. కాని కళ్ళకు ఏదో పెద్ద

గంత కట్టివేయబడింది. చీకటి. తప్ప! మరేమీ లేదు....ఎంత అంధకారం! చీకట్లోకూడా కొంచెం వెలుగనేది లేకపోతే అది చీకటని ఎలా తెలుసుకోవటం? ఐతే తనకు కని పించే యీ చీకట్లో ఆ వెలుతురు కిరణంకూడా లేదు; ఇది కటిక చీకటై వుందని తోచింది.

ఒళ్ళంతా నలగబొడిచినట్లు ఉంది. ఎటు కదిలేందుకూ తోచలేదు. ఏమిటీ—ఇది తన మృత్యుశయ్యేనేమో? పాతికేళ్ల వయస్సులోనే చావటం తనకు ఇష్టంలేదు. ఐతే ఇష్టాయిష్టాల్ని అడిగి మృత్యుదేవత కరుణించదు. జీవితంలో తనింకా చేయవలసిన పనులు అనేకం ఉన్నవి. అవి సత్కార్యాలే ఐనప్పటికీ మృత్యువుకు వాటితో సంబంధం లేదు.

అసలు తనెక్కడ వున్నాడు? ఇది ఆసుపత్రయి ఉండొచ్చు. దూరాన ఎక్కడో బాధతో మూలిగే మానవకంఠం మరో రోగిదై వుండొచ్చు. తనుకూడా మూలుగుతే శరీరంలోని నరాల బిగువు కొంత సడలి, కొంచెం హాయిగా వుంటుందేమో? విచారం కలిగితే కన్నీళ్లు ఐపొయ్యేదాకా ఏడవటం ఒక మార్గం కదా!

మూలిగాడు బాధతో. తన మూలుగే ప్రశాంత వాతావరణాన్ని భంగపరిచింది. ఆ మూలుగుకు ఎవ్వరూ జవాబివ్వలేదు. ఒకవేళ చావటం తప్పనిసరైతే తను యీ దిక్కులేని చావుకు గురికావటం జరుగదు కదా!

తనవాళ్ళందరూ ఏమయ్యారో? ఇలాటి కష్టకాలంలో తనను ఎక్కడో, దుర్మార్గుల రక్షణలో, కనీసం తన ముక్కూ మొహమూ ఎరగని కొత్త వ్యక్తుల కాపలాలో దిగవిడిచారా? ఇది ప్రమాదమే ఐనా. ఎలాటి ప్రమాదమో తెలుసుకుంటేనే తప్ప విలవలేదు.

మళ్ళీ మూలిగాడు; యీసారి పెద్దగా, చాలా దూరంలో వున్నవాళ్ళకూడా విని పించాలని....తన మూలుగు తన చెవులకే విచిత్రంగా తోచింది. అర్థంలేకుండా కుక్క మొరుగుతూ ఏడ్చినట్లుంది, సంగీతంతో ఏడ్చి ఉండాల్సింది. ఈ కళలన్నీ యీ బాధలోనా?

మెత్తని పాదాల సవ్వడి తనవైపు రాసాగింది....తన ప్రశ్నలన్నిటికీ జవాబులు పొందొచ్చు. ఆశతో ఆ వ్యక్తి రాకకు ఎదురు చూస్తున్నాడు.

మృదువైన హస్తమేదో మీదపడింది; తేలిగ్గా వుండటాన్నిబట్టి ఆలా అను కున్నాడు; తాకి తెలుసుకోవాలనిపించింది. కాని, ఎవరో, ఏమిటో అని వూరుకున్నాడు.

"మిస్టర్....ఎలా వుంది?" కంఠస్వరాన్నిబట్టి స్త్రీ అని గ్రహించాడు; ఎంత మృదువుగా, హాయిగా అడిగింది! ఆమె అడిగాక సగం బాధ తగ్గినట్లనిపించింది.

బాధ తగ్గిందంటే ఆమె జాలి చూపదేమోనని భయం; అందుకని మారాంచేసే చిన్న పిల్లవాడిలాగు, కొంత నటనకూడా అవసరం అనిపించింది.

"చాలా బాధగా వుంది....ఇది ఆసుపత్రా?"

"ఔను....తెల్లవారుఝామున జరిగిన రైలు ప్రమాదంలో ఇరుక్కున్నారు....ఇప్పుడు మీకు చికిత్స జరుగుతోంది—"

ఇప్పుడు బాగా గుర్తొస్తోంది. తను మాంచి నిద్రలో వున్నాడు; అంతకు ఒక గంటకు ముందే నిద్రవొస్తున్నట్లు తోచింది తనకు....గాఢనిద్రను చీల్చుకుంటూ పెద్ద బాంబు పడ్డంత శబ్దమైంది. తను ఎక్కడికో విసిరివేయబడ్డాడు. పీడ కలలోంచి మెలుకువ వచ్చినట్లయింది. ఏమిటో తెలుసుకునేందుకు లేద్దామనుకున్నాడు....కాని లేవలేకపొయ్యాడు. తను మొయ్యలేని బరువుకింద అణిగివున్నాడు...అంతా చీకటి...మనుషుల హాహాకారాలు. ఏదో గోల, హత్యలు జరిగేప్పుడు వినిపించే విచిత్ర కంఠ స్వరాలు, ఏదో గందరగోళం ...సహాయంకోసం ఎలుగెత్తి పిలిచాడు....లాభం లేక పోయింది....ఏదో లోకంలోకి, బహుశా పాతాళానికేమో తొక్కివేయబడుతూన్నట్లు తోచింది. తను కుంగిపోతున్నాడు....మళ్ళీ మగత వొస్తున్నట్లుంది. ఎలాగైనా స్మృతి తప్పకుండా ప్రయత్నం చేశాడు. మృత్యుముఖంలో వున్నట్లు బాధగా వుంది. అంతా ఒక క్షణమో, రెండు క్షణాలో....అంతే!....తరువాత ఏమైందో తెలియ లేదు....ఇక్కడ యీ లోకంలో తేలాడు.

"మిస్టర్!" అందామె. "మీరు బాధ భరించలేకపోతే మత్తు ఇంజక్షన్ ఇస్తాను."

మత్తు అంటేనే భయంగా వుంది; నిద్ర అంటే అంతకన్న భయం. ఒకవేళ ఆ నిద్రనుంచి మళ్ళీ మెలకువ రాదేమోననే దిగులు. నిజానికి అలా మెలకువ రాకుంటే, విచారించవలసింది మాత్రం ఏముంటుంది కనుక!

"ఫర్వాలేదు....భరించగలను....నాకు చాలా నీరసంగా వుంది....ఆకలిగాకూడా వుంది"

"కాస్త రొట్టె తిని, పాలు తాగుదురు కాని....ఉండండి....మీరు కదలవొద్దు."

రెండు నిమిషాలపాటు జగన్నాథం మళ్ళీ ఆ రైలుప్రమాదాన్నిగూర్చి ఆలోచనలో పడ్డాడు. బహుశా చాలామంది గాయపడి వుంటారు. చాలామంది చనిపోయికూడా వుంటారు. ఆ దృశ్యాన్ని తలుచుకుంటేనే కంపరమెత్తుతోంది, ఒణికిపోతున్నాడు; కాని మనోవీధినుంచి తుడిచివేయలేకపోతున్నాడు. పాపం! తనలాగ ఎంతమంది బాధ పడుతున్నారో? అసలు ఆ లెక్కలు ఎవరన్నా తేల్చారో? లేదో....వాళ్ల గొడవ ఎలా వున్నా ముందు తన సంగతేమిటి? తన స్థితి ఏమిటి? తనకు ఎన్ని గాయాలు, ఎంత

బలంగా తగిలినవి? అన్నిటికన్నా ముఖ్యం తన కళ్లకు యీ గంతలేమిటి? కళ్లు పోలేదు కదా!

"మిస్టర్....నోరు తెరవండి...." అందామె.

నోరు తెరిచాడు. ఆమె అందించే రొట్టె ముక్కలు నమిలాడు. నోటికి కూడా బలమైన గాయం తగిలి ఏమీ తినేందుకు వీల్లేకుండా అవలేదు—అంతవరకూ నయమనిపించింది....యీ రొట్టె ఎంత మధురంగా వుంది! ఆకలి తీవ్రతను బట్టి దీనిరుచి కూడా అసాధారణంగా పెరిగి వుంటుందనే సంగతి జగన్నాథానికి తెలియలేదు.

"చాలు—" అన్నాడు.

"ఇంకొక్క ముక్కే వుంది....తినెయ్యండి....నోరు తెరవండి....ఆఁ," కడుపు నిండినా తనచేత ఆ ముక్క కూడా తినిపించిందామె. తరువాత కాఫీ ఇచ్చింది. ఇంత మంచి కాఫీని గూర్చి తను కలలు కన్నాడే కాని, ఆ కలను యీమె నిజం చేసింది.

"చాలా బాగుంది—కాఫీ!" అన్నాడు.

ఆమె వినపడీ వినపడనట్లు నవ్వింది.

"ప్రమాదంలో ఎంతమంది చచ్చారు? ఎంతమందికి గాయాలు తగిలినయ్?" అన్నాడు-ముందుగానే తన సంగతి అడుగుతే బాగుండదని.

"ఇప్పటికి ఎనిమిది మంది పొయ్యారు, డెభ్భైమందికి గాయాలు తగిలినయ్.... యాభై మందికి చాలా స్వల్పగాయాలు. మిగతా...."

ఆమె మాట పూర్తి కాకుండానే "చచ్చేందుకు సిద్ధంగా వున్న వాళ్ళ లిస్టులో నేను వున్నానా? " అన్నాడు ఆతృతతో.

"లేదు....ఆ ప్రమాదం లేదు ...కాని...." అని చెప్పేందుకు సందేహించినట్లు వూరుకుందామె.

"చెప్పండి....ఫర్వాలేదు. చెప్పండి....నేను మృత్యువును కళ్ళారా చూశాను. ఆ ఇనుప గజ్జెల తల్లి భయంకరంగా ఘీంకరిస్తూ నా వైపు రావటం, నన్ను తన కౌగిలిలోకి తీసుకు నేందుకు చేతులు జాచటం. ఎలా తప్పించుకోవాలో తెలియక నేను తికమకపడుతూంటే అమె త్వర త్వరగా పొరపాటున నన్ను వొదిలి చక చకా ముందుకు సాగిపోవటం చూశాను. మృత్యు దేవతకు కళ్ళు లేవనే సంగతి కూడా అప్పుడే తెలుసుకున్నాను. ఆ దేవి గుడ్డిది కనుకనే ఆమెకు విచక్షణా జ్ఞానం లేదు...." అని ఆగాడు.

"మీకూ ఆ దేవి గతే పడుతుందేమోనని అనుమానం!" అందామె.




చాలా మృదుపుగా ఆ మాట లన్నప్పటికీ, అవి ఎంతో వాడిగా, వేడిగా తన హృదయంలో గుచ్చుకున్నవి: తను గుడ్డివాడై తే....!

మృత్యుదేవత నే ధిక్కరించి మోసపుచ్చి తప్పించుకోగలిగాననీ, ఆమె రాక తనకు భయం లేదనీ యింతకు ముందే గప్పాలు కొట్టిన తను యీ మాటలు వినగానే వొణికిపొయ్యాడు. నిజంగానే తను గుడ్డివాడై తే మృత్యువు వికటాట్టహాసం భూమినే దద్దరిల్ల జేసే ఆమె భీకర నా ట్యం మాత్రమే తా నీ ప్రపంచంలో చూసిన చిట్ట చివరి దృశ్య మౌతుంది. దాన్ని తా నెన్నడూ మరిచిపోడు. మృత్యుదేవత తనను కరుణించి వొదిలింది, జీవితమంతా బాధ పడడానికేనా? ఈ సంగతి ముందుగా తెలిసి వుంటే ఆ గుడ్డి దేవతను కౌలిచి, ఆమె బాహువుల్లో ఆనందంతో కరిగిపొయ్యేవాడు కదా!

అంధత్వం! శాశ్వత అంధత్వం! పుటక నుంచీ గుడ్డివాడై న వాడికి భేదం తెలియదు కాని, తా నీ కళ్ళతో చూచిన అనేక ప్రకృతి సౌందర్య దృశ్యాలు-వినీలాకాశం, లయతో వచ్చి పడే సముద్రపు టలలు, అందమైన పువ్వులు, ఆహ్లాదకరమైన ప్రకృతి శోభ, సూర్యోదయ సూర్యాస్తమయాల రంగులు, ఇంద్ర ధనస్సులోని చాయలు, చల్లని చందమామ, వింత వింత రంగుల మేఘాలు, మానవ నిర్మితాలై న భవనాలు, ప్రశాంతంగా పారే నదులకు అడ్డంగా కట్టిన ఆనకట్టలు, మహా సముద్రాన్ని కూడా దాటేందుకు నిర్మించిన నౌకలు - అబ్బ ఎన్నని-వీటన్నిటినీ చూస్తూనే తన

సంస్మేత ఐతే బాగుండునని, తన అభిరుచుల ప్రకారం నిర్మించి ఆనందించొచ్చని తలచి, నిజ జీవితంలో అది కుదరక, ఎన్ని కలల్ని సృష్టించుకున్నాడు! చూపుల కందని అనేక దృశ్యాలు మనో వీధిలో పరిగెత్తగలిగినవంటే, వాటి పునాదులన్నీ, యదార్థ జీవితంలోనే ఉన్నవి. జీవితంలోని యీ యదార్థమే దూరమవటంతో ఆ కలలు కూడా కరిగిపోతవి.

తనింకేమీ చూడలేడు. 'అహా! ఎంత బాగుంది!' అని ఎవరైనా అనటం వింటే. అది నిజంగా ఎంత బాగుందో తెలియక-ఊహ సాగక కొట్టుమిట్టాడుతాడు. తనకు లేకుండా ఆ సౌందర్యాన్ని తన చుట్టుపక్కల వాళ్ళందరూ పంచుకోవటం ఎంత అన్యాయం! ఎంతమంది చూసినా తరగని ప్రకృతి శోభ తన కీ జీవితంలో మరిలేదు. ఎన్నిసార్లు చందమామను చూసినా ఎప్పటి కప్పుడు కొత్తగా కనిపిస్తుంది! అంబరాన్ని చుంబించే ప్రయత్నంలో పైకి యెగబాకిన మహోన్నత పర్వతాగ్రాల ఠీవి ఎన్నిసార్లు చూస్తే తనివి తీరుతుంది? ఉరుకులు పరుగులుగా పారే మహానదుల నడకలోని సౌందర్యం, మెత్తగా ఒడ్డుల్ని ఒరుసుకుంటూ గలగలలాడుతూ వొడ్డుకు విసిరే అలల కదలిక చూసేందుకు విసుగెత్తుతుందా? ఆకుల పచ్చదనం, భానుని బంగారు కిరణాలతో సింగారించుకున్న పచ్చిక బయళ్ళు, ప్రకృతిలోని వివిధ జంతు జాతుల అందచందాలు....సమయానికి జ్ఞాపకంరాని ఇంకెన్నో-వీటన్నిటికీ నీళ్ళధారేనా? మధురతమమైన పదార్థాలు ఆరగించాక, సముద్రపు నీళ్ళు తాగినట్లు, ఆ చివరి దృశ్యమే తనకు మిగిలివుంటుందేమో?

పసిపాపల బోసినోటి నవ్వుల వెన్నెల, స్వప్నసుందరులే రక్తమాంసాలతో ప్రత్యక్ష మయ్యారేమో ననిపించే యవ్వనపు శోభతో వెలుగొందే రమణీ మణుల సౌందర్యం, ముసలి ముఖాలమీది అనుభవాల తాలూకు ముచ్చటైన ముడతల వంకర టింకర్లు, తన కిక కలలేనేమో? నిద్రపోయి లేచేప్పటికి తనను భ్రమింప జేసేట్లు స్వాగతమిచ్చే ప్రకృతి దృశ్యాలకూ తనకూ మధ్య ఎంత దూరం!

ఈ కళ్ళు కాకుండా, ఏ కాలో, చెయ్యో పోతుందంటే దానికింత విచారించి ఉండేవాడు కాదు. తన యవ్వనపు పొంగు, తన పాపను చూసేందుకు మరి నోచుకోలేదు కదా! జీవితమంతా చీకటి లోకమే ఐతే తనకీ కలియుగం అంతరించినట్లే లెక్క!....ఏడుద్దామని, కంటినిండా నీటిని వూరిద్దామని వుంది. కాని ఏమీ చూడలేని కళ్ళు, నీటినన్నా కారుస్తవో లేదో తెలియలేదు.

తన వూహల బాధతో కుమిలిపొయ్యే జగన్నాథాన్ని ఆమె పలకరించింది.

"మిస్టర్!....మిస్టర్!....మీ పేరేమిటి!"

జగన్నాధానికి వొళ్ళు మండిపోతోంది, ఈ దుర్వార్తను,తన ఘట
మరణ వేదనను మించిన బాధకు తనను గురిచేసిన యీ రాక్షసిని ఏంచెయ్యాలా అని ఆలోచిస్తున్నాడు. ఆమె ప్రశ్నకు మళ్ళీ వర్తమానంలో పడ్డాడు. కాని జవాబు చెప్పేందుకు వెంటనే నోరు పెగల్లేదు.

''భయపడకండి.........ఆ పరమేశ్వరుని దయవుంటే మీకు దృష్టి రావొచ్చు'' అందామె. గొంతులో దయా తరంగాల్ని ఉరికిస్తూ.

ఈ మాటలు చాలా ఊరడింపు కలిగించినవి. ఏమైతేనేం గడచిన తన పాతికేళ్ళ వయస్సూ యధార్థంగానూ, బతకాల్సిన ఆ భావిజీవితం, అది ఎంత తక్కువదైనాసరే, అది ఒక భ్రమగానూ, మిథ్యగానూ పరిణమిస్తుందేమో?

''మిస్టర్!.....ఏమౌతుందో యిప్పుడే ఎవ్వరూ చెప్పలేరు....కాని మీరు చాలా ధైర్యంగా వున్నారని, ఉన్న సంగతి చెప్పాను. మీకు చాలా బాధ కలిగించినందుకు నన్ను క్షమించండి'' అందామె.

ఈమె ఎవరు? చేయెత్తి నమస్కరిద్దా మనుకున్నాడు. దేవతల్లే వొచ్చి, దెయ్యం వలె భ్రమింపజేసి, శాశ్వత దేవత్వాన్ని స్థాపించుకున్న మధురమూర్తి! తనకున్న బాధను పంచుకో గలిగిన యీమె విశాలహృదయాన్ని తేలిగ్గా ఊహించగలడు.... దృష్టిలేదు కాని యీమెను చూడగలగటం తన యిలవేల్పుల్ని చూడటమే కాగలదు! భగవాన్! ఒక్కసారి యీ దేవతను చూసేందుకైనా తనకు దృష్టివుంటే బాగుండు! అలనాడు శ్రీకృష్ణుని స్వరూప సందర్శనాపేక్షతో ధృతరాష్ట్రుడు దృష్టినిమ్మని కోరింది. ఇలాటి సందర్భమేనేమో?

''నేను మిమ్మల్ని చూడలేకపోతున్నాను....నా కిప్పుడు దృష్టిరాదనే విచారంకూడా లేకుండా చేయగలిగారు....తమ పేరేమిటి.'' అన్నాడు జగన్నాధం.

''నర్స్ అని పిలవండి....''

''కాదు... పేరు చెప్పండి.''

ఆమె ఒక్కక్షణం ఊరుకొని ''రాధ'' అంది.

రాధ! తన యీ విషాద గాధలో ఎదురైన రాధ! అలనాడు బృందావనంలో నృత్య గీతాలు ధ్వనింపచేసిన మధురమూర్తి యీమేనేమో?

''రాధాదేవిగారూ!....'' అన్నాడు.

''దేవి ఏమిటి?....నా పేరు రాధ. ఒట్టి రాధ....అంతే!'' అందామె, సుస్మిత హాస్యంతో వొణికే కంఠంతో.

''నన్నలా పిలవనివ్వండి—నా కృతజ్ఞతను ఎలా తెలియపరచాలో అర్థం కాకుండా

వుంది.''

''నన్ను నా డ్యూటీ చెయ్యనివ్వటమే మీరు చూపే కృతజ్ఞతగా స్వీకరిస్తాను. మీరు దిగులు పడకండి, శ్రమ కాకుంటే నే నడిగే ప్రశ్నలకు జవాబులు చెపుతారా?'' అందామె.

''అడగండి.''

''తమ పేరు?''

చెప్పాడు.

''ఎడ్రసు?''

''ప్రస్తుతం ఏం లేదు ; కేరాఫ్ యీ ఆసుపత్రి.''

''అంటే?....మీకు పర్మనెంటు ఎడ్రస్....హోల్ మకాం. ..''

''అవేమీ లేవు. ఏదన్నా ఉద్యోగంకోసం ప్రయత్నిద్దామని మద్రాసు వెళ్తున్నాను.''

''పోనీండి, ఏదన్నా ప్రమాదం జరిగేటట్లయితే, ఎవరికి తెలియపరచాలి? ఇవన్నీ ఫార్మల్‌గా అడిగే ప్రశ్నలే సుమండీ. భయపడొద్దు.''

''ఎవ్వరికీ అవసరంలేదు.''

''తల్లిదండ్రులు?''

''లేరు—''

''అన్నదమ్ములు కానీ, అక్కచెల్లెళ్ళు కానీ—''

''లేరు.''

''భార్యా ...''

''నా కింకా పెళ్ళికాలేదు.''

''ఇక కాదు కూడాను!'' అందా మనుకొని దిగమింగాడు. కళ్లు వున్నప్పుడే తానొక అందకత్తెను ఎన్నుకొని పెళ్ళాడి వుండాల్సింది. ఎంతమంది అమ్మాయిల్ని చూసినా, ప్రతివారికీ ఏదో వంక సృష్టించి, తన కళ్ళు వారించినవి. ఇప్పుడు ఆ కళ్లు చూడలేవు, త నెలా అనుకుంటే అలా—అంతే! మంచి శాస్తి జరిగిం దనిపించింది; కాని ఎంత అక్రమమైన శిక్ష. ఒకవేళ ఇప్పుడు తన కెవరైనా నచ్చినా, తను వాళ్లకు నచ్చుతాడా? గుడ్డివాణ్ణి భర్తగా కోరే అభాగ్య ఎవరుంటారు?

''మీకు స్నేహితులుకానీ, చుట్టాలుకానీ, అవసరమైతే మిమ్ము చూడగోరేవారు, లేదా మీరు చూడదలుచుకున్నవా రెవరన్నా ఉన్నారేమో ఆలోచించి చెప్పండి'' అందామె.

''ఆలోచించనక్కర్లేదు, రాధాదేవిగారూ! ఎవరైనా నన్ను చూడదల్చుకున్నవారు




ఉన్నప్పటికీ, నేను మాత్రం యెవర్నీ చూడదలుచుకోలేదు. అలా అనుకున్నవారు, ఎంత అప్తులైనా నేను చూసే స్థితిలో లేను కదా! ఇందాక మీరన్నట్లు నేను ఆ సర్వేశ్వరుణ్ణే నమ్ముకోవాలి. ఆయన ఏ అంధుడికి తప్పక దర్శన మివ్వగలడు.''

''మీరు చాలా బాధపడుతున్నారు, జగన్నాధంగారూ! ఎక్కువ ఆలోచించకండి. ఆలోచనలవల్ల సౌఖ్యం పెరగటమే కాదు, బాధకూడా పెరుగుతుంది. ఒక్కసారి నోరు తెరుస్తారా? టెంపరేచర్ చూస్తాను.''

ఆమె థర్మామీటర్ నోట్లో పెట్టి, అరనిమిషమయ్యాక తీసేసింది.

''ఎంత వుంది?'' అన్నాడు.

''నార్మల్‌కు కాస్త పైగా వుంది. రేపు ఉదయానికి తగ్గిపోతుంది.''

''నాకు ఎక్కడెక్కడ గాయాలు తగిలినవి? వీటిల్లో నయమయ్యేవీ, నయం కానివీ వివరాలు నాకు చెప్పగలరా?''

''చేతులకూ, కాళ్ళకూ పెద్ద గాయాలు తగలలేదు. రేపు కట్లు విప్పెయ్యవొచ్చు. తలమీదమాత్రం పెద్ద గాయం తగిలింది. కళ్ళ సంగతి ఇందాకే చెప్పాను కదా!''

''ఒక కాలు విరిగినా బాగుండేది'' అని గొణిగాడు.

''కళ్ళు పోవటంకన్న....ఔను.''

''కాదు....కళ్లతోపాటు....కంపెన్‌సేషన్ ఎంత వొస్తుందోనని ఆలోచిస్తున్నాను.''

''భలేవారు విషాదంలోకూడా హాస్యాన్ని ఆలోచించగలరు'' అని నవ్వెందామె.

కాస్సేపు నిశ్శబ్దంగా వుంది.

"రాధాదేవిగారూ! టైం ఎంతై వుంటుంది?"

"రాత్రి పదకొండు దాటింది."

"ఈ గదిలో—లేక హాలా?"

"గదే.... పెద్ద గది."

"నేను కాకుండా ఇంకా ఎవరైనా ఉన్నారా?"

"మరో ముగ్గురున్నారు."

"వాళ్ళూ ప్రయాణీకులేనా?"

"ఔను....వాళ్లు నిద్రపోతున్నారు. మీకుకూడా విశ్రాంతి అవసరం. పడుకోండి."

"నాకు నిద్ర రావటంలేదు. మరి యీ గదిలోని రోగుల్లో ఎవరన్నా, నాలాగు కళ్లు పోగొట్టుకునేందుకు సిద్ధంగా వున్నారా?"

"ఉహూ. మిమ్మల్ని చూస్తే జాలేస్తోంది. ఏం చెయ్యగలను! ఒకో రోగికి ఒకో రకం బాధ. బాధపడేవాళ్ళను చూస్తూనే, బాధపడుతూనే వారి బాధల్ని ఎలా పోగొట్టాలా అని ఆలోచిస్తూంటాను."

"నే నడిగింది అందుకు కాదు. ఒకళ్ళతో పోల్చకుండా, నాకు ఎక్కువ కంపెన్సేషన్ వొస్తుందో రాదో నని."

"ఏం మాటలండీ? కంపెన్సేషన్ కోసం కళ్లు పోగొట్టుకుంటారా ఎవరన్నా?"

"ఎవరి సంగతో నా కెందుకు, రాధాదేవిగారూ! కాంపెన్సేషన్‌కోసం నేను కళ్ళు పోగొట్టుకోలేను. కాని కళ్ళు పోయినందుకు కాంపెన్సేషన్ ఆశిస్తాను."

"ఆమాటకొస్తే మీరు సెకండ్‌క్లాసులో వున్నారు. పెద్ద మొత్తమే రావచ్చనుకుంటాను."

"నేనూ ఆదే ఆలోచిస్తున్నాను. కొద్దిదూరానికే ఎక్కువ డబ్బు చెల్లించేవాళ్ళకూడా ప్రమాదా లుండటం....చూడండి."

"మృత్యుదేవతకు లంచం ఇచ్చి తప్పించుకోవటం సాధ్య మనేట్లు మాట్లాడతారేం? అసలు పై తరగతుల పెట్టెలే ముందు వుండటంలో రైల్వేవారి ఉద్దేశ్యం - ప్రమాదం సంభవించేట్లయితే చాలా తక్కువమందే దెబ్బతింటారని."

"అందువల్ల కాంపెన్సేషన్ కూడా తగ్గుతుందనీను!"

"అదే కాదనుకోండి, వారి ఉద్దేశ్యంలో అర్థం లేకపోలేదు. మీరు సెకండ్‌క్లాసులో వున్నారు కనుకనే చావు తప్పించుకున్నారు. కిక్కిరిసివున్న పెట్టెల్లోని జనం తుక్కుతుక్కయ్యారు."

"చావు తప్పి కన్ను లొట్టపోయింది, కంటి లొట్ట సంగతి తెలియని, వూహించని

వాడు చావుకన్న ఇది నయమని భ్రమించాడు అంతే!

"పోనీండి. పోనీ, మీ రన్న కంపెన్‌సేషన్ మీకు కాకుండాపోతే, అది చేరవలసిన వాళ్ళెవరన్నా వున్నారేమో చెప్పండి."

"ఈ ప్రశ్నకు మరోసారి జవాబు చెపుతాను."

"సరే, అయితే మీరు పడుకోవాలి."

"నాకు నిద్ర రాందే."

"మాట్లాడకుండా వుంటే అదే వొస్తుంది. నేను తెల్లవార్లూ ఇక్కడే వుంటాను. అవసరమైతే పిలవండి, ఇక మాట్లాడకండి."

రకరకాల ఆలోచనల్తోనూ బుర్ర నిండిపోతోంది. రాధాదేవి తనను అడిగిన ప్రశ్నల్లాటివే ఆమెనూ అడుగుతే బాగుండును; కాని ఏమనుకుంటుందో? మానవసేవ చేసేందుకు భూమిమీద అవతరించిన దేవకన్యల్ని తను అగౌరవపరచట మౌతుం దేమో? అలాటి పొరపాటే జరుగుతే తను భౌతిక దృష్టితో పాటు, జ్ఞానదృష్టిని కూడా కోల్పోయిన వాడవుతాడు.

రాధాదేవి పేరుకు తగిన అందగత్తె ఐవుంటుంది. అ నడకలోని వయ్యారాన్ని, కంఠస్వరంలోని మృదుత్వాన్ని, మాటల తీరులోని పొందికను, కాలనులోని అలల సవ్వడిని ధ్వనింపజేసే సన్నని నవ్వును—కేవలం శబ్దం ద్వారా తెలుసుకో గలిగాడు. దీన్నిబట్టి నిజంగానే ఆమె మల్లెపువ్వువలె తెల్లగా, నిర్మలంగా, కోమలంగా వుంటుంది. ముఖారవిందం రోగుల పాలిట ధర్మదేవతను జ్ఞాపకం చేస్తుంది. ఆ ముఖంలోని ప్రశాంతత, ఎదుటివ్యక్తి బాధను ప్రతిఫలింపచెయ్యగల సౌకుమార్యం, మందహాసంలోని మృదుత్వం, మెరిసే కన్నులు కురిసే వెన్నెల....తన స్వాప్నిక సుందరే రూపం ధరించి తన ముందు ప్రత్యక్షమైం దనే భ్రమలు గొల్పక తప్పదు. కాని ఆమె దర్శనం, అంతా మించిపొయ్యాక లభించింది. తా నామెను చూడలేడు; కాని వూహించగలడు!

"రాధాదేవీ?" అన్నాడు. ఇదంతాకూడా కలే నేమోననే అనుమానంతో,

మెత్తని పాదరక్షల సవ్వడి దగ్గరైంది.

"ఏం కావాలండీ?"

తనకు నిజంగా కావాల్సింది మనశ్శాంతి, ఆ మాటచెప్పే సాహసం లే దతనికి.

"దాహ మౌతోంది."

ఆమె చల్లని నీరిచ్చింది; తాగాడు.

"నేను వెళ్ళనా?"

ఎక్కడికి?''

''ఈ గది మధ్యలో నా కోపడక కుర్చీ వుంది. అందులో పడుకుంటాను. నిద్రపోనులెండి. నరకంలో ఎవరికి నిద్రపడుతుంది? మీరు ఎప్పుడు పిలిస్తే అప్పు డొస్తానుగా!''

''రాధాదేవిగారూ! మీకు చాలా శ్రమ యిస్తున్నాను. చూడండి: తెల్లవార్లూ ఎలా మేలుకోగలరు?''

''ఏదో చదువుతూంటాను.''

''ఏం చదువుతారు?''

''మానవ చరిత్ర, శతాబ్దాలు గడిచినా తరగని చరిత్ర, నరుని జీవిత నాటకంలోని వివిధ రంగాలు....చూచి. అర్థం చేసుకోలేన్ని అనేక విషయాలు. చెప్పేందుకు మాటలు రావు. ఒస్తే నేనూ రాద్దును.''

''ఏం రాస్తారు?''

''నాకు తెలిసిన రోగుల దీన గాథలు. నా మనస్సును కరిగించి నాకు మనస్సే లేకుండా చేసిన సంఘటనలు.''

''మీకు మనస్సు లేదనుకోవటం ఆత్మవంచన.''

''కాదు....అది ఏనాడో కరిగి శిలారూపాన్ని ధరించిందేమో అనుకుంటాను. ఎంతో జాలి కలుగుతుంది....కాని ఏం చెయ్యను?''

''రాధాదేవి గారూ! నేను మిమ్ము స్పష్టంగా చూడ గలుగుతున్నాను....చచ్చి స్వర్గంలో పడ్డాననే భ్రాంతి కలుగుతోంది.''

''ఆ భ్రాంతినే నమ్మండి....మనశ్శాంతన్నా మిగులుతుంది''

''మీ లాంటివారు పక్కన వుంటే మృత్యుదేవత కూడా భయపడుతుంది.''

''అది గుడ్డిదని చెప్పారు మీరు....బహుశా రోగిని కబళించ బోయి పక్కన వున్న నన్ను మింగుతుందని మీ అభిప్రాయమా?''

''రోగులు ఎంతోమంది వొస్తుంటారు, పోతుంటారు. కాని మీలాటి దయా మయులు ఏ కొద్దిమందో? మిమ్ము ఆ దయా మయుడే కాపాడగలడు ...''

''సరే పోనీండి....ఇక నిద్రపోరా?''

''పోతాను, కాని మిమ్మల్ని గూర్చే నే నిప్పుడు ఆలోచిస్తున్నాను. అది మానలే ననుకుంటాను'' అన్నాడు.

''ఇంకేం, బాగా ఆలోచించండి. రేపు మాట్లాడు కుందాం....నేను వెళ్ళనా?''

''రేపు మాట్లాడుకుందాం....సరే.''




అడుగుల సవ్వడి దూరమైంది 'రేపు' అనే దానిమీద మానవుడు మోపే పర్వతపు బరువులు అతని బుర్రలో అవతరించినవి ఈ రేపు మీదనే సామ్రాజ్యాలు నిర్మించ బడినవి అవి సర్వనాశన మౌతూన్నవి ఈ రేపు కోసమే మానవుడు బతుకు తున్నాడు. ఈ రేపు కోసమే మానవుడు మృత్యువును బతిమాలి, ప్రస్తుతానికి పంపేస్తున్నాడు. ఈ రేపు లేకుంటే యీ జీవితానికి అర్థమేమిటి? ఎన్ని రేపుల్ని చూసినా రాబొయ్యే 'రేపు'కున్న విలువ గతించిన వాటికి లేదు కదా! ఎన్ని ఆలోచనలు! ఆ ప్రశాంత వాతావరణంలో చాలా సేపు తనతో తానే ముచ్చటించుకున్నాడు

ఏ తెల్లవారు జామునో తనకు తెలియకుండానే నిద్ర పట్టింది.

## 2

మొహం మీద పడిన సూర్యకిరణం చురుక్కు మనిపిస్తూ జగన్నాధాన్ని నిద్రనుంచి లేపింది బాహుశా చాలా ప్రొద్దెక్కి వుండొచ్చు. తన గదిలో మనుషులు హడావిడిగా తిరుగుతూన్న సవ్వడి వినిపిస్తోంది. నాలుగు స్తంభాలాటలా వున్న నలుగురు రోగుల్లోనూ ఒకడికి మూడిందేమో ఆ 'ఒకరు' తను కాదు, కానందువల్ల కలగవలసిన ఆనందం కలగటం లేదు, ఆ అనందాన్ని 'చూడలేక పోవటమే' కారణం కావొచ్చు!

తనకు ఎదురు మూలనుంచి బాధతో మూలగటం వినిపిస్తోంది; కాదు ఏడుస్తు న్నారు. కంఠస్వరాన్నిబట్టి పురుషుడేనని తోస్తోంది.

ఏం బాధో? బాధను అనుభవించి తెలుసుకోవాల్సిందే కాని వూహించి తెలుసుకో వటంలో ఎంతో పొరపాటు వుంటుంది!

తన చుట్టూ జరిగేదాన్ని కేవలం శబ్దసహాయంతో మనో వీధిలో సృష్టించుకొని చూస్తున్నాడు కొంతసేపటికి ఆ 'ఇంటరెస్టు' కూడా లేదు. తను అంధుడవు తున్నాడు అంధుని మనస్తత్వం అలవడుతోంది తన కది ఏ మాత్రమూ ఇష్టం లేదు. ఎవరో బలవంతంగా తన నీ అధోగతికి తోసి నట్లనిపించింది. ఎవర్ని నిందిం చాలో అందువల్ల కలిగే లాభ మేమిటో తెలియదు. ' ఖర్మ! ఖర్మ!' అని గొణుక్కున్నాడు.

ఏడుపు వినిపించటం లేదు, సన్నని మూలుగు, ఉండి వుండి శూలాలు పొడుస్తున్నప్పుడు ఎగిరెగిరి పడేమాదిరి వినవస్తోంది భయానక దృశ్యం నుంచి దూసుకున్నాక, దాని తాలూకు తలపుల తాకిడికి వొణికి పోవటం మాదిరి వుంది. నిజంగా ఆ రోగి పొందిన బాధను తలుచుకుంటేనే యీ బుద్బుద ప్రాయపు జీవితం మీద ఏవగింపు కలిగింది. కాని యీ కిష్టాలూ, బాధలూ లేకుంటే సౌఖ్యానికి యింత ప్రాముఖ్యత, సౌఖ్యంలో దాగిన మాధుర్యం తెలిసేవి కాదు కదా! అందు కని కష్టాల్ని ఎవ్వరూ కోరుకోరు, వాటంత టవి వొస్తేనే తను చూడలేడు తనకు చూపు వున్నట్ల యితే, యీపాటికి గిరికీలు తిరిగి పడిపోయి వుండును అందుకని దృష్టి లేక పోవటాన్ని అభినందించుకొని ఉండాల్సింది, కాని విచారించాడు ఎందుకంటే యీ దృష్టితోనే సుందర దృశ్యాల్ని కూడా చూచి వుండేవాడు కదా!

మళ్ళీ ప్రశాంతత ఏర్పడింది ఒకపక్క నేలమీద ఫినాయిల్ వేసి తుడిచినట్లు న్నారు, ముక్కులు బద్దలయ్యే వాసన బయలు దేరింది. ఈ నరకంలోంచి తనకు విముక్తి ఎప్పుడో?

ఆక లవుతోంది తన సంగతి ఎవరూ కనుక్కోరేం? రాధాదేవి గుర్తొచ్చింది మొను-రాత్రి ఆ బాధలోనే వేరొక లోకాల్లో విహరించ గలిగాడు, ఆమె చూపిన జాలి తనకు ఎంతో శక్తిని, యీ కష్టాల్ని భరించే త్రాణను ఇచ్చింది ఆమె తన దగ్గరికి రాదేం? ఆమె కోసమన్నా యీ ఆసుపత్రిలో మరికొంతకాలం వుండా లనిపిస్తోంది

ఎవరన్నా తన సంగతి కనుక్కునేందుకు ముందు, తనకు మెలకువ వొచ్చిందనే సంగతి వారికి తెలియాలి కదా! ఒక పక్క ఆకలిగా కూడా వుంది

"రాధాదేవిగారూ!'' అని మెల్లిగా, ఆమెకు తప్ప మరెవ్వరికీ వినపడకూడ

దన్నట్లు పిలిచాడు.

జవాబు లేదు. ఆమె ఇక్కడకు దగ్గరలో లేదేమో?

పేరు పెట్టి పిలవటంకన్నా బాధతో మూలుగుతే అదే తంతి వార్తగా ఆమెను బరబరా లాక్కొస్తుంది. ఇదొక కొత్త ప్రపంచం. దీని భాషా, భావాల రూపులు వేరు. వాటికి తను ఇప్పుడిప్పుడే అలవాటు పడుతున్నాడు.

పెద్దగా మూలిగాడు. చూడగలుగుతే యీ అనవసరపు మూలుగులు తప్పేవి కదా!

అమ్మయ్య మెత్తని పాదాల చప్పుడు గరగరమనే దుస్తుల రాపిడి తనకు దగ్గిరవుతోంది ఆ సవ్వడి తన మంచం దగ్గిర ఆగింది ఆమె మాట్లాడదేం? ఆమె మాట్లాడేవరకూ తను ఆగలేక పొయ్యాడు

"గుడ్ మార్నింగ్' రాధాదేవిగారూ!" అన్నాడు.

"రాధాదేవిగారూ! ఓహో రాధా! మిస్టర్ ఆమె కాదు—ఏం కావాలి?"

కంఠ స్వరంలో కఠినత్వం మేళవించింది. స్త్రీత్వం కన్న పురుషత్వమే అధికంగా ధ్వనిస్తోంది ఎవరీమె?

"రాధాదేవిగారు లేరా? ఎప్పు డొస్తారు?"

"ఏం కావాలో చెప్పరాదటయ్యా? ఆమె నైట్ డ్యూటీ! రాత్రికి వస్తుందిలే నే నిప్పుడు డ్యూటీలో వున్నాను"

తను లేవటం ఆలస్యమైంది కనుకనే రాధాదేవి తనతో చెప్పకుండా, తనకు నిద్రాభంగం కలిగించటం ఇష్టంలేక, వెళ్ళిపోయి వుంటుంది తనంటే ఆమెకు ప్రత్యేకాభిమానం ఆపేక్ష వున్నవని నమ్మగలిగాడు. అందులోనూ ఈమె, యీ పగటి డ్యూటీ ఆమె మాట్లాడే తీరునుబట్టి చూస్తే తన నమ్మకం మరింత బలపడి నట్లయింది

"తమ పేరేమిటి?"

"పేర్లతో పనేమిటయ్యా? పేర్లు చెప్పి నీతో పరాచికా లాడేందుకు మాకు తీరిక లేదు నర్స్ అని పిలు"

తనెంతో మెత్తగా, బంగారం నేలమీద పడినట్లు మాట్లాడితే, కంచుగంట కింద పడినట్లు ఖంగుమంటూ తనను కరవ వొచ్చినట్లు మాట్లాడుతుందేం? తనేం తప్పు చేశాడని? నిజానికి తనలాంటి రోగుల వల్లనే కదా, ఈ నర్సులకు పని తగిలి, వారి వృత్తికి ఒక గౌరవం ఏర్పడి, బాధపడే మానవులకు సేవ చేసుకునే అవకాశం కలిగింది? రాధాదేవిలాంటి నర్సులుంటే రోగి జీవిత పరిమితి రెండింత లవుతుంది.

కాని ఈమె....ఈమె పేరేమిటో....నర్స్ అనుకోమందిగా....ఈమె సమక్షంలో జీవిత పరిమితి సగమే అవుతుంది. ఈమె రోగుల పాలిటా, ఇన్సూరెన్స్ కంపెనీల పాలిటా బ్రహ్మరాక్షసిగా తోస్తోంది.

''మిస్టర్! నే నిక్కడ నిలబడే తీరిక లేదు. బ్రేక్‌ఫాస్ట్ తెస్తాను—అరగిస్తావా?'' అందామె.

ఆమె ఏకవచన ప్రయోగం మనసుకు మరీ కష్టంగా వుంది; తనలాటి రోగులు రావటంవల్లనే తానీ బాధలు పడుతున్నానని ధ్వనింపజేస్తోంది. మనిషిని విదిలించి పారెయ్యటం, హీనంగా చూడటం అలవాటైనట్లుంది. ధర్మాసుపత్రికి వొచ్చే బీదా బిక్కాలంటే ఈమెకు ఎంత ఈసడింపో! ఐతే తను అనామకుడు కాదు, తా నెవ రనుకుంటుందో, ఏమిటో! బర్మాషెల్‌లో ఐదొందల రూపాయల జీతగాడు. ఇలాటి నర్సుల్ని నెలకు ఐదుగుర్ని కొనగల తాహతుంది తనకు. ఈ మాటలంటే, ''పోయి కొనుక్కోరాదా?'' అంటుందేమో? మృత్యుదేవి ప్రపంచంలో వివిధరూపాల్లో, అనేక అవతారాల్లో వుంటుంది. అందులో ఇదొక అవతారం కావొచ్చు. ఇంకా నయం. కళ్ళుంటే చూసి భయపడి తారుమనేవాడేమో? ఆమెకు జవాబు చెప్ప బుద్ధికాలేదు. కాని అందువల్ల తనకే నష్టం; ఇదేమన్నా తన ఇల్లా, తన ఇష్టప్రకారం జరిగేందుకు?

''జవాబు చెప్పండి స్వామీ! పని వొత్తిడిలో చస్తుంటే మమ్మ మీరిలా వేధిస్తే ఎట్లా? మళ్ళీ ఏమైనా లోపం జరుగుతే పేరుకు మాత్రమే! ధర్మాసుపత్రు లంటారు. రోగులు చేసే ఆగడాల్ని గురించి ఎవ్వరూ ఆలోచించరు—'' అందామె.

''తీసుకురండి.''

''ఆమె కదిలివెళ్ళిన అలికిడి విన్నాడు. ఆమె చివరికి అన్నమాటలు నచ్చినయ్. నిజమే....పొద్దుకూకులూ యీ రోగుల్తో, వాళ్ళ బాధల్తో సతమతమయ్యే వాళ్ళకు, వారు చేసేది ఎంత గొప్ప పనైనా, వాళ్ళూ మనుషులే కనుక విసుగెత్తకుండా వుంటుందా? ఇంకో అరగంటకు ఆఫీసు మూసేస్తా రనగా సంతకంకోసం కాగితాలు వొస్తేనే తను విసుక్కుంటాడే—వెధవ సంతకం. ఇంతా ఏడుస్తే! తనలాటి మనుషులు కారూ వీరంతా? ఉచ్చ మనక, నీచ మనక మానవత్వపు విలువల్ని గౌరవించే పనిలోవున్న వీళ్ళను వేధించటంలో వారు పొందే మనోవ్యాకులతను కనీసం తన లాటివాళ్ళన్నా గ్రహించి ఉండాల్సింది. తను పొరపాటే పడ్డాడేమో? ఈసారి ఈమెకు క్షమార్పణలు చెప్పుకోవాలి.

కాదు....కాదు....మరి, రాత్రి డ్యూటీలో వున్న రాధాదేవి ఎంత సరసురాలు! ఆమెకు రోగుల మనస్తత్వం తెలుసు. ఆమెలో స్త్రీత్వంలోని మార్దవం, మాతృత్వం.




వున్నవి. కాని యీమె ప్రవర్తనలో బాధను ద్వేషించటోయి, బాధితుల్నే ద్వేషించే తత్వం వుంది. మనుషుల తత్వాలు భేదిస్తవి మరి. ఏమైనా వాళ్ళ తత్వాలతో తను సరిపెట్టుకోక తప్పదు, కష్టమైనా భరించాల్సిందే.

ఆమె బ్రేక్‌ఫాస్ట్ తీసుకొచ్చింది. రొట్టె తిన్నాడు. కాఫీ తాగాడు, రాత్రంత రుచిగా లేదు. తన స్థితి తెలుసుకోవా లనిపించింది.

"చూడండి. మీకు కోపం రాకుంటే—" అని మొదలుపెట్టాడు.

"కోపమెందుకూ? చెప్పండి. అనవసరంగా హస్కు వేసేందుకు వీలుండదు. అది రాత్రి డ్యూటీవాళ్ళకే చెల్లుతుంది. సరే. ఏం కావాలో చప్పున చెప్పండి" అందామె.

"నా కట్లు ఎప్పుడు విప్పుతారు?"

"తలమీది కట్టు వారమయ్యాక విప్పుతారు. కాళ్ళవీ చేతులవీ సాయింత్రం విప్పేస్తారు."

"కళ్ళ సంగతి చెప్పండి."

"మూడువారాలు పట్టొచ్చు."

"మూడువారాలూ నేను అంధుణ్ణేనా?" అని గొణిగాడు.

"ఆ తరువాతమాత్రం గ్యారంటీ ఏమిటి?" అని ఆమె హేళనగా నవ్వింది, ఆమె అన్న మాటల్లోని సత్యంకన్న, కఠినత్వం తనను ఎక్కువ బాధించింది.

"పోనీండి, అప్పటికి అలవాటవుతానుగా?" అన్నాడు.

ఈ స్థితిలో ఇలా మాట్లాడి ఉండకూడదు—అందులోనూ యీమె దగ్గిర. కాని

తనుకూడా దీన్ని స్వల్పవిషయంగానే చూస్తున్నాననే ఇంప్రెషన్ కలిగిస్తే ఆమె ఎగతాళికి అవకాశం వుండదు.

"అలా ధైర్యంగా వుండండి; వొస్తాను. అవతల ఎవరో మూలుగుతున్నారు."

ఆమె వెళ్ళిపోయిన సూచనలు అతనికి స్పష్టంగా తెలిసినవి. జగన్నాధం మళ్ళీ ఆలోచనలో పడ్డాడు. ఈమె ఎలా వుంటుంది? రాధాదేవి ఎలా వుంటుంది? ఇద్దరిలోనూ తను ఎవర్నీ చూడలేదు. కాని యీ కనిపించని వ్యక్తుల్ని తను ఊహించుకోగలుగుతున్నాడు. ఎంత వ్యత్యాసం వుందో తెలుసుకొని ఆశ్చర్యపడ్డాడు ఇక చీకటి పడేదాకా యిదే కాలక్షేపం అయింది.

సాధ్యమైనంతవరకూ ఈ కొత్తామెను పిలవ దలచలేదు కస్సుబుస్సుమనే ఈమె తత్వం తనకు నచ్చలేదు. ఏదో గొప్ప సీరియస్‌నెస్‌ను ప్రదర్శించేందుకు ప్రయత్నిస్తుంది. అలాటి మనుషులంటే తనకు మంట! జీవితానికి కొన్ని నియమాల్ని యేర్పరచుకొని వాటినే పట్టుకొని వేళ్లాడాలని బతికేవాళ్ళకు వ్యక్తిత్వం వుందంటే తను నమ్మలేదు. వాళ్ళల్లో మార్పేమీ ఉండదు. వారికోసం ప్రపంచం మారకుండా వుంటుందా?

మధ్యాహ్నం భోజనం, సాయింత్రం టిఫిన్ ఇచ్చిందామె. ఎప్పుడో ఒకసారి హఠాత్తుగా వొచ్చి పలకరిస్తూనే వుంది. తనను నిర్లక్ష్యం చేయలేదనే నమ్మకంకన్న, తను డ్యూటీలోనే వున్నానని ఆమె రుజూ చేసుకుంటున్నట్లు తోచిం దతనికి. ఆమె వొచ్చినప్పుడు మాత్రం తన కలలు కరిగిపోతూన్నవి ఆమె వెళ్ళాక మళ్ళీ 'మూడ్' లోకి రావాలని ప్రయత్నం చేస్తున్నాడు ఆ కలల వివరాలూ, వాటి అర్థాలూ అప్రస్తుతం.

సాయంత్రం ఆమె వొచ్చి "మిస్టర్! నేను వెళ్తున్నాను. చీకటి పడుతోంది తమ రాధాదేవిగారు వొస్తారు. ఆఁ, అదుగో వొచ్చారు. మిస్ రాధా! ఇదుగో మీ పేషెంట్. నీకోసం కలవరిస్తున్నారు" అందామె.

వినపడీ వినపడనట్లు నవ్వింది రాధేనని తెలుసు తనకు.

"వొచ్చావా? నీకోసం పొద్దుట్నుంచి తపస్సు చేస్తున్నాను" అందా మనుకున్నాడు. కాని ఈ కొత్తామె—తన యీ శత్రువుకూ్కడా ఆ మాటలు వినిపించటం ఇష్టం లేదు. అందుకని "నేనేం కలవరించడం లేదు. కళ్ళజోడు లేదు కనుక, కలలో వ్యక్తులుకూడా సరిగ్గా కనిపించటం లేదు!" అన్నాడు.

"ఇంకెందుకూ కలలు? రాధాదేవిగారే వొచ్చారు. సరే గుడ్ ఈవినింగ్ రాధా! వస్తాను. విష్ యు ఎ హాపీ ఎండ్ పీస్‌ఫుల్ నైట్, మిస్టర్ పేషెంట్!" అని వెళ్ళి


యువ

పోయిందామె.

"మిస్ రాధాదేవీ!"

"ఏమండీ!" అని, తను పక్కనే వున్నానని తెలియజేసేందుకన్నట్లు పాలభాగం మీద చెయ్యి వేసింది. ఆ స్పర్శకు నిజంగానే ప్రాణం లేచివొచ్చింది అతనికి. ఆమె చేతిమీద తన చేతిని జూచాడు. తన చేతిస్పర్శతో ఆమె తన చేతిని లాగేసుకుంటుం దేమో ననుకున్నాడు; కాని ఆమె నిర్లిప్తంగా ఊరుకున్నది.

"అరే! ఇంకా మీ చేతుల కట్లు విప్పనేలేదా?"

"లేదు. సాయంత్రం విప్పుతారని ఆ నర్స్ అంది. కాని ఎవ్వరూ రాలేదు. నేను అడగనూ లేదు."

"ఉండండి, నేను విప్పేస్తాను. అవన్నీ చిన్నచిన్న గాయాలే. బాధ వుండదు."

రాధ కాళ్ళకూ చేతులకూ బిగించిన కట్లను విప్పసాగింది. కాటన్ తీసేప్పుడు కాస్త బాధపెట్టింది కలిగిన బాధను నాలుగింతలుగా స్ఫురింపజేసేట్లు మూలిగాడు.

"అంత బాధగా వుందా?... మెల్లిగానే లాగుతున్నాను....కాస్త ఓర్చుకోండి. మృత్యుదేవతనే చూశాడుకదా మరి!"

కిక్కురుమనకుండా వూరుకున్నాడు. తనకు తెలియకుండానే మానసికంగా రాధా దేవికి లొంగిపొయ్యాడు. మొండితనానికి తాను మారురూపమనే కీర్తివుండేది; అలాటి తనను బొటనవేలి కిందకు తెచ్చుకుంది రాధాదేవి.

ఆమె కట్లు విప్పాక చాలా హాయిగా వుంది. సంకెళ్ళు విడినవి. ఈ పని ఇంతకు ముందే జరుగుతే బాగుండే దనిపించింది.

"ఇప్పు డెలా వుందీ—?" అందామె.

"సగం శరీరానికి శిక్ష పూర్తయినట్లుంది. మిగతా సగమూ...."

"ఈ బాధలు తప్పవండీ! వీటిని భరించి వొదిలించుకోవాల్సిందే కాని, వాటిని గూర్చి ఆలోచించినందువల్ల తీరవు" అందామె. ఈ మాటల్లో ఎంత నిగూఢ భావం, వేదాంతం, ఉపశమనం, మాధుర్యం వుంది! ఇవే మాటల్ని పగటి డ్యూటీ నర్స్ అంటే తను వెక్కిరిచేసేవాడు కాదు

"మిస్ రాధాదేవీ! మీకు దేవుడిమీద నమ్మకం వుందా." అన్నాడు.

"పోనీద్దురూ, తెల్లవారేవాకా మనం వాదించుకున్నా ఏమీ తేలదు."

"కాదు, కాదు నేను వూరికనే అడుగుతున్నాను. మీరు అనుకున్నట్లుగా వాదన వేసుకోను."

"ఏమోనబ్బా! నే నంత తీవ్రంగా ఆలోచించలేదు. కాని మానవాతీతమైన మహా

త్తరశక్తి ఏదో వుందని నమ్మక తప్పటంలేదు. మన కష్టసుఖాల్ని ఆ శక్తికి అంట గడుతున్నామేమో ననుకుంటాను'' అందామె.

''నా కా నమ్మకం ఇదివరకు ఉండేవి కాదు. కాని మీ పరిచయం లభించాక, దేవుడు వివిధరూపాల్లో ప్రపంచంలో మన చుట్టూవున్న వ్యక్తులుగా నైతేనేం, ప్రకృతి రామణీయకతలో నైతేనేం దాగివుంటాడేమో ననిపించింది.''

ఆమె నవ్వి ''దేవుడు పురుష డండీ!'' అంది.

''ఆ మాటకొస్తే ఏ లింగానికి సంబంధించనివాడు. ఐనా రూపాంతరాల్లో స్త్రీ యెందుకు కాకూడదు?''

''అప్పుడు దేవత అవుతుంది కదా!''

''ఔను, మీకు గ్రామర్ కూడా బాగా జ్ఞాపకంవుంది. పోనీ దేవత—ఆ దేవతను నేను కనుక్కున్నాను.''

''మృత్యుదేవిని చూశానని రాత్రి చెప్పారు. దేవతను చూశానని యీ రాత్రి అంటున్నారు. మొదటిది నేను నమ్మాను. కాని యీ రెండోది ఎలా నమ్మను!''

''ఏం? నేను చూడలేను కనుక. మీరు నమ్మలేకుండా ఉన్నట్లున్నారు. కాని, ఒక్క కళ్ళతోనే మనం అన్ని విషయాల్నీ గ్రహిస్తున్నా మనుకోకండి. నేను నా మనోనేత్రంతో స్పష్టంగా చూడగలుగుతున్నాను.''

''చూడండి....కాని, ఇలాటి మాటలంటే నన్ను అనవసరపు గర్వం ఆవరిస్తుంది. నన్ను పొగడకండి. నేను డ్యూటీమాత్రం చేస్తున్నాను....అంతే!''

''ప్రపంచంలో అందరూ మీలాగే అనుకొని, తమ తమ డ్యూటీలు చేసుకుంటే జీవితం ఎంత హాయిగా వుండేదోనని ఆలోచిస్తున్నాను.''

''అందరి సంగతీ యెందుకులెండి. పేషెంట్‌గా మీ డ్యూటీ మీరూ, నర్స్‌గా నాడ్యూటీ నేనూ చేసుకుంటే చాలనుకుంటాను—''

''ఈ డ్యూటీ చాలాకాలం వరకూ చేయాలని వుంది రాధాదేవీ!''

''నన్ను భయపెట్టాలని చూస్తున్నారా? పర్వాలేదు....నా డ్యూటీ నేను చేయ గలను'' అందామె.

ఆమె తనభావం గ్రహించలేదని జగన్నాధం తేల్చుకున్నాడు.

''రాధాదేవిగారూ! కాస్త ఆలోచించి ఆ మాట అనండి!''

''ఏం....నే నేం తప్పు మాట్లాడానా,''

''కాదు. నా డ్యూటీ అంటే మీకు అర్థం కాలేదు.''

''సరే ఐతే, మీరు చెప్పకూడదా?''

– సోషలిజం సంగతి దేవుడెరుగు!
ధరలు తగ్గించండి బాబు!!



"చూడండి! నాకు దృష్టి రాకపోతే, నేను పేషెంట్ కిందనే లెక్క కదా! అప్పుడు మీరు నా జీవితాంతం వరకూ మీ డ్యూటీ చేస్తారా అని ఆలోచిస్తున్నాను."

ఆమె దీర్ఘంగా నిట్టూర్చింది. క్షణకాలం వారి మధ్య నిశ్శబ్దం తాండవమాడింది.

"మాట్లాడరేం రాధాదేవిగారూ."

"మీ ప్రశ్నకు మరోసారి జవాబు చెపుతాను."

"ఆలోచించి చెపుతారా?"

"కాదు. ఇప్పుడు చెప్పలేను" ఆ కంఠస్వరం గాద్గదికమైంది.

బహుశా వర్షించేందుకు సిద్ధంగా వున్న మేఘాలు ఆమె ముఖాన్ని కప్పివుంటవని జగన్నాధం వూహించుకున్నాడు. ఆమెలోని ఏ శక్తుల్ని కదపటంవల్ల ఆమె బాధపడుతోందో? తను అనాలోచితంగా ఏదో వాగేశాడు; అందులో బాధ్యతను, ఎదుటి వ్యక్తి తాలూకు సున్నితమైన మనస్తత్వాన్ని గూర్చి తలపోయలేదు. ఆమెను గాయపరిచాడు. తీరా ఇలా పరిణమించాక కాని, ఆ సంగతి తెలియలేదు. క్షమార్పణ కోరుదా మనుకున్నాడు.

"వన్ మినిట్....అవతల రోగికి ఏం కావాలో చూసి వొస్తాను—" అన్నదామె.

ఆమె వెళ్ళిపోయినట్లు గ్రహించాడు. తను ఎందుకు, ఎక్కడ, ఎట్లా పొరబడ్డాడో ఆలోచించసాగాడు. ఆమె మళ్ళీ వొచ్చాక, తన తప్పును ఒప్పేసుకుని రాజీ

పడదా మనుకున్నాడు. అంతకన్న తనేం చేయగలడు? చేసిన తప్పుల్ని దిద్దుకునేం దుకు కాలం వెనక్కు మళ్ళదు కదా!

## 3

కాలం నేలమీద పారాడుతూన్నట్లుంది. ప్రతి క్షణమూ రాధాదేవి రాకకోసం ఎదురు చూస్తూనే వున్నాడు. ఆమె రా లేదు. తనే రానందుకు కారణమని బాధపడసాగాడు. ఆమెను పిలిచే ధైర్యం లేదు. వెధవపని చేసింది కాక, దాన్ని గూర్చి తర్కించటం, బైట పడటం వెనువెంటనే కుదరకపోవచ్చు. దానికి కొంత ఆత్మపరీక్ష అవసరం. జగన్నాధం ఆ పనిలోనే వున్నాడు.

ఆమెను తను అగౌరవించాడా? ఆమె అభిమానం దెబ్బ తిన్నదేమో? లేక స్త్రీ సహజమైన లజ్జతో కుంగిపోయిందా? తనకు దృష్టి వుంటే ఆమె ముఖంలోని భావాన్ని కొంతవరకన్నా అర్థం చేసుకొని వుండేవాడు.

ఐనా తనేం తప్పు మాట్లాడాడు? ఎంత సున్నితంగా తన అభిప్రాయాన్ని వెలి బుచ్చాడు!....నిజానికి అలా మాట్లాడాలని తను అనుకోలేదు ఎందుకంటే ఆమెకూ, తనకూ పరిచయమై ఒక్క రోజు గడిచింది; ఆమెను తను చూడలేదు. కాని చిత్రించు కొని కలలు కన్నాడు. ఆమె మీద తనకు కలిగిన సదభిప్రాయం, విశ్వరూపాన్ని దాల్చి, అభిమానమై హఠాత్తుగా అనురాగంగా మారిందనే సంగతి తనకు తెలియదు. తీరా ఆ మాటలు, వాటంతటవే వడబోత లేకుండానే దొర్లినవి.

మాటలు! మాటలు ఎంతెంత బావాలను వెల్లడి చేస్తవి! ఎన్నెన్ని పనుల్ని చేయి స్తవి! ఎంత పొరపాట్లకు దారితీస్తవి! ఈ మాటలమీదనే జీవితాలు దొర్లుతూన్నవి. మాటలవల్లనే భావాలు రూపొంది రకరకాల అనుభూతుల్ని కలిగిస్తూన్నవి. అవి గాలి సహాయంతో గాలిలోకి వొదలబడినప్పటికీ, వాటి శక్తిని ఎవరూ గమనించటంలేదు కాని, సరిగ్గా ఆలోచిస్తే యీ మాటలేకదా అనేక బాటల్ని ఏర్పరిచేవి! మాట అనెయ్యటం ఎంత తేలికో, దాన్ని ఉపసంహరించుకోవటం, పొరపాట్లను దిద్దుకో వటం అంత కష్టమనే సంగతి యీనాడు తెలుసుకున్నాడు.

మాటల్ని గూర్చి ఇదివరకెన్నడూ ఇంత తీవ్రంగా ఆలోచించలేదు. ఆలోచిస్తేనే కాని అనేక సత్యాలు, మనం చూస్తూ గ్రహించనివి కూడా బైట పడవు కాబోలు! మాట మాత్రానికి సామ్రాజ్యాలే తలకిందులైనవి. మాటకోసమే నవ్వుతూ ప్రాణాల్ని అర్పించిన వారున్నారు. తిరుగుబాట్లు, కల్లోలాలు యుద్ధాలు మొదలైన వన్నీ మాటలమీదనే మొదలై క్రియారూపాన్ని దాల్చినవి. కవిత్వం, సాహిత్యం,

సుందర దృశ్య వర్ణనలు మొదలైనవి మాటల పొందికకాక మరేమిటి? ఈ మాటల్ని ఏర్చి కూర్చటంలో జరిగే పొరపాట్లే జీవితంలో వేసే తప్పటడుగులేమో?

అలనాడు హరిశ్చంద్రుడు 'మాట' కోసమేకదా అన్నికష్టాలు పడింది! ఈ నాటికీ పెళ్ళాడబోయే స్త్రీకి పురుషుడు మాటతోనే కదా హామీ యిచ్చి ఆమెను బానిసగా చేసుకొని, నమ్మించి, పిల్లల్ని కనిపిస్తున్నాడు! ఒక మంచిమాట, చల్లనిది, మధురమైనది మాట్లాడటం అనేది ఇందుకే ఏర్పడిందేమో? ఈ మాటలే లేకుంటే మనుషులు ఒకరొకరు ఎలా అర్థం చేసుకోగలరు? తమను తామెలా అర్థం చేసుకోగలరు?—ఒకమాట వివిధ వ్యక్తుల నోళ్ళల్లో వివిధార్థాల్ని, వింత వింత భావాల్ని రూపొందిస్తుందనేది తన కిప్పుడు అనుభవపూర్వకంగా తెలిసిన సంగతే!

ఎంత గొప్ప అనుభూతి, భావమైనా మాటల సహాయంతోనేకదా వెల్లడించబడుతోంది? ఒక మాటలో ఎంత నిగూఢత! ఎంత చిన్న మాటలో అంత పెద్ద "సముద్రం" ఇమిడివుంది! సకల భూ పపంచమూ 'విశ్వం' అనే చిన్న పదంలోకి కుదించబడింది! చిన్నపిల్ల బోసి నోటి మాటలోని మృదుత్వం, ప్రియురాలి రహస్యంలోని వీనుల విందు, ముదుసలుల మాటల్లోని గంభీరానుభావం మొదలైనవి మాటలే కదా! వీటిల్లో ఎంత మృదువైనవి ఉన్నవో, అంత పదునైనవీ ఉన్నవి. కనపడని గాయాలు, మానని గాయలు చేసే మాటలు ఎన్ని లేవు! జీవితమంతా ఒక్క మంచి మాట మాట్లాడని వారున్నారు; అన్నీ మంచిమాటలే మాట్లాడేవారున్నారు. వారి గొప్ప తనం యీ మాటలు లేకుంటే ఎవరు గ్రహించేవాళ్ళు?

ముందుగానే యిదంతా ఆలోచించి ఉండవలసింది. సమయం మించిపోయింది. ఇంకా నయం—ఇలాటి మాటలే ఆ పగటి డ్యూటీ నర్సుతో—ఆమె పేరేమిటో? రాధాదేవిని అడుగుతే బాగుండేది!—అని వున్నట్లయితే, ఎంత రభస జరిగేది! తన పెద్దమనిషితనానికి యీ ఆసుపత్రిలో పరిపూర్ణ చికిత్స చేయబడేది.

తనన్న మాటలు హృదయపూర్వకంగా అన్న వేనని ఇప్పుడు నమ్మకం కలుగుతోంది; ఆ నమ్మకమే లేకుంటే వాటిని గూర్చి ఇంత లోతుగా ఆలోచించవలసిన అవసరం ఏమిటి? కాని ఆమె తన ఒప్పుదలను యిచ్చి వున్నట్లయితే, లేదా మరి కాస్సేపటికి సమ్మతిని తెలుపుతే తా నామెను అంగీకరిస్తాడా?

"నీ మొహానికి అంత అదృష్టమా?" అంది అంతర్వాణి.

ఈ మాటకు జగన్నాథం హాణికిపోయ్యాడు. తనలాటి గొప్పవాడికి పెళ్ళికి తగిన పడుచు లేదనే గర్వం ఇన్నాళ్ళూ వుండేది.... కాని ఇప్పుడు తను గుడ్డివాడైతే, తన కోసం ఆశించేవాళ్లు ఎంతమంది వుంటారు? వీళ్ళల్లో గుడ్డి వాళ్ళను తీసేస్తే ఆ ఆశించే

వారు ఎవరైతేనేం, వారు తనకు రంభా ఊర్వశుల్తో సమానమే! తనసలు చూడగలు గుతే కదా వారి సౌందర్యాన్ని అంచనాలు వేసి, తూచి, నిర్ణయించగలిగేందుకు?

ఆ రోజుల్లో చూసిన ప్రతి యువతికీ ఏవో వొంకలు పెడుతూండేవాడు తను. ఇక ఇప్పుడు తనకు వొక్కటే వొంక—గుడ్డితనం! అదొక్కటే చాలు ప్రపంచం లోని దౌర్భాగ్యుల్లో తను జమపడేందుకు. చూస్తూ చూస్తూ ఎవతె తనను పెళ్ళాడు తుంది? ఇప్పుడు తనను నిరాకరించటం యువతుల వొంతు అవుతుంది. జీవితం ఇంతలో తారుమారవుతుందని కలలో కూడా ఊహించలేదుకదా!

రాత్రి చాలా పొద్దు పొయ్యే వరకూ ఇలాగే ఆలోచిస్తున్నాడు. రాధాదేవి మళ్ళీ తన దగ్గరికి రాలేదు. మరెప్పటికీ రాదేమోననే భయం ఆవహించింది; కనీసం తనకు క్షమాభిక్ష పెట్టేందుకు వొచ్చినా చా లనిపించింది.

ఆమెను ఎలా దగ్గిరికి రప్పించుకోవాలా అని ఆలోచించాడు; ఏ ఉపాయమూ తృప్తికరంగా లేదు. చిన్నపిల్లాడల్లే ఏడ్చి, పిలిచేందుకు మనస్కరించలేదు తన యీ తప్పును కాలమే కొంతవరకూ కప్పిపెడుతుంది; అలాగే రాధాదేవి గాయాన్ని కూడా కొంతవరకూ మాన్పుతుంది. అప్పుడు రాజీ కావటం తేలిక. ఐనా గాయాలు మానందే, కొత్తవాటికి చోటు ఉండదు కనుక, ఈ పద్ధతి బాగానే వుందనిపించింది. ఆ శుభసమయం కోసం యెదురు చూస్తూండగానే నిద్రపట్టింది.

## 4

వెలుతురురాగానే చెవులు రిక్కించి విని, బాగా తెల్లారిపోయిందని జగన్నాథం తెలుసుకున్నాడు. రాత్రి జరిగిన సంగతులన్నీ గుర్తొచ్చినవి. తను రాధాదేవి రాకకోసం కాచుకొని కూర్చున్నాడు; ఆమె రాలేదన్నమాట, ఒకవేళ వొచ్చి, తను నిద్రపోతూండటం చూసి వెళ్ళిపోయిందేమో! ఇది నిజమే ఐతే తన దురదృష్టమనే అనాలి....అసలు ఎప్పటికీ తన దగ్గరికి రాదేమోననే నమ్మకం మీదికి ఈ పాడు మనసు మళ్ళుతుం దెందుకని?

ఈ తెల్లవారటం తన బాధలకు తెల్లారటంలాగుంది. ఆ పగటి డ్యూటీ ఆమె. బ్రహ్మరాక్షసి, దిగివుంటుంది, ఏమాత్రం ఇష్టంలేక పోయినా, కొంతమంది మనుష్యుల్ని వొదలించుకోలేం. సమాజ మన్నప్పుడు ఇష్టులూ వుంటారు, అయిష్టులూ వుంటారు మరి. ఇష్టులే ఉండాలని కోరుకుంటే యెలా కుదురుతుంది! తనకున్న అయిష్టుల్లాగే, తనుకూడా కొంత మందికి అయిష్టుడే ఐ వుండాలి. తన కింద పనిచేసే గుమాస్తాలకన్నా తప్పకుండా తను అయిష్టుడే! ఈ సంగతి తనకూ నమ్మకంగా




తెలుసు. మరి వాళ్ళు తనను వొదిలించుకో గలిగారా! తన కామె యెంత అయిష్టు రాలో, తను కూడా ఆమెకు అంతేనేమో? ఈ మాటను నమ్మటం వల్ల బాధ కలుగుతుంది కనుక, ఎలాగైనా నమ్మకుండా దాటేద్దామని విఫలయత్నం చేశాడు!

ఏదైతేనేం యీమెను పిలిచి బ్రెక్ ఫాస్ట్ తెప్పించుకొని తిని, తీరిగ్గా ఆలోచిస్తే బాగుండు ననిపించింది. అటూ యిటూ కదిలాడు.

"గుడ్ మార్నింగ్ మిస్టర్! ఎలా వుంది?"

"బాగానే వుంది" అన్నాడు వెటకారంగా.

"రాత్రి పీస్‌ఫుల్‌గా గడిచినట్లు లేదే! చాలా అలసిపోయినట్లు, విశ్రాంతి తక్కువైనట్లుగా వుంది."

"ఔను....నిద్రలేదు. కళ్ళు కూడా ఎర్రబడినయ్ కదూ?" అన్నాడు విసుగ్గా.

ఆమెకు కోపం వచ్చింద నేందుకు నేలమీద బరువుగా బాదిన పాదం చప్పుడే సాక్ష్యం. కొంతమందిని బాధ పెట్టడం సరదాగానే వుంటుంది కాబోలు! అందుకనే ఆమె కోపం వల్ల తన కేదో వొరిగినట్లనిపించింది. ఏదో వూహించి తనను సూటీ పోటీగా అనాలనే ఉద్దేశ్యంతోనే కదా. యీమె అలా మాట్లాడింది? కుక్కకాటుకు చెప్పు దెబ్బ తగిలించిన గర్వం కలిగింది. కాని యీ కోపంతో తన సంగతి కనుక్కోకుండా పోతుందేమోననే దిగులు పట్టుకుంది. ఈ అవసరాలే, అయిష్టుల్ని కూడా వొదిలించుకోకుండా చేస్తున్నవి కాబోలు!

"మిస్టర్! జోక్స్ కేమొచ్చె? బ్రెక్‌ఫాస్ తేనా?"

"తెండి."

ఆమె వెళ్ళి మరునిమిషంలోనే తిరిగి వొచ్చింది. కొన్ని పనుల్ని ఇంటరెస్టు లేకపోయినా విధిగా చేసి తీరాలి; అలాగే బ్రెక్‌ఫాస్ట్ కూడా ఆరగించాడు.

"డాక్టర్‌గా రొచ్చారు!"

"గుడ్ మార్నింగ్ డాక్టర్! మిమ్మ‌ు చూసే భాగ్యం నాకు లేకపోయింది." ఈ గౌరవం అవసరార్థం ఏర్పడిందని తనకు తెలియకపోలేదు.

"ఏమోలే....నన్ను చూసే భాగ్యం కలిగినా కలగొచ్చు. ఎలా వుంది?"

"బాగానే వుంది....కాని ఈ చిక్కని చీకటి చాలా భయంకరంగా తోస్తోంది.... కొన్నాళ్ళు గడిచాక వెలుతురు కూడా ఇంత భయానకంగానూ వుంటుందేమో?"

"ఏం చేస్తాం? బాధలు భరిస్తేనే కాని తరగవు. మీకన్న మిజరబుల్‌గా వుండే వాళ్ళున్నారు మరి....సరే. వొస్తా" అని వెళ్తూ వెళ్తూ, తనకు కాస్త దూరంలో "పూర్ ఫెల్లో, మంచి ఉద్యోగంలో కూడా వున్నాడు....జాలివేస్తుంది చూస్తే-కాస్త కనిపెట్టివుండు జానకీ!" అన్న డాక్టర్ మాటల్ని విన్నాడు.

కళ్ళు వున్నట్లయితే ఇంత బాగా వినగిలిగి వుండేవాడు కాదు. ఒక అంగంలో లోపం యేర్పడగానే మిగతావాటి శక్తి పెరుగుతుంది కాబోలు. అందుకే తన చెవులు పాము చెవులైనవి.

డాక్టర్ ఆజ్ఞప్రకారం ఈ జానకి తనను కనిపెట్టి వుంటుంది కాబోలనే కొత్త దిగులు పట్టుకుంది, ఈమె దగ్గిరికి రావటమే అసహ్యంగా వుంది. ఎందుకనో? కొంత మందిని చూడగానే ఆప్తు లనిపిస్తుంది; మరి కొంతమందిని చూడగానే మంటగా ఉంటుంది. మొదటివారు చేసిన మేలూ, రెండో వారు చేసిన కీడూ లేదు. ఈ సంగతి తనకు ఇదివరకే అను భవ పూర్వకంగా తెలుసు. కాని ఇప్పటిది కొత్త అనుభవం, చూడకుండానే మనుషుల మీద ఇష్టాయిష్టాలు ఏర్పడినవి. చూసి ఏర్పడేవి క్రమంగా పరిచయంగా మారవొచ్చు, అలాగే ఈ అభిప్రాయాలు కూడా మారుతవేమో?

ఏమైనా జానకితో విరోధం పూనటంకన్న స్నేహంగా వుండేందుకే పయత్నించా లనుకున్నాడు. తత్వాలు భేదించి నంత మాత్రాన మనషుల్ని ద్వేషించటంలో అర్థ ముందా? ఎలాగైనా సరిపెట్టుకోవటంలోనే ఉభయులకూ హాయి వుంటుంది. ఈసారి సమయం దొరికినప్పుడు ఈ కొత్త పద్ధతి ప్రయోగిద్దామని నిశ్చయించుకున్నాడు.

మధ్యాహ్నం భోజనం తెచ్చిం దామె.

"మిస్ జానకీ!" అన్నాడు.

"ఓ! నా పేరుకూడా తెలుసుకున్నారే....మీ రాధగారు చెప్పారా?" అందామె.

''ఎవరైతేనేంలే, ప్రతిదీ రాధాదేవిగారే చెప్పాలా ''

''ఆమె పేరుకు 'దేవి' కూడా కలిపారా? ఇకనుంచీ మేమూ అలానే పిలుస్తాం లెండి.''

ఈమె తన నేమన్నా అంటే ఓర్చుకోగలడు ; కాని రాధాదేవి మీదికి ఒంటి కాలిమీద పోతుం దెందుకని? స్త్రీ సహజమైన ఈర్ష్య వీరిద్దరిమధ్యా ఉండి వుండాలి. ఐతే ఈ ఈర్ష్య దేన్ని గూర్చి? తన కా సంగతు లేమీ తెలియవు. అదలాగుంచి జానకి, రాధాదేవి మీద చూపేలాటి ఈర్ష్యను రాధాదేవి ఈమె మీద చూపటం లేదు. యీమె వలె సూటీపోటి మాటలు, సిగూఢార్థాలున్నవని తోచేవాటిని ఆమె ప్రయోగించటం లేదు. ఎంత వ్యత్యాసం!

''జానకీదేవీ! నేను మిమ్మ కష్టపెట్టి వుంటే ...నన్ను క్షమించండి'' అన్నాడు. ఇంత తక్కువ స్థాయిలో మాట్లాడా లనుకోలేదు. ఇలా మాట్లాడటం మనసుకు కష్టం కలిగించినా, ఈ అడ్డ తోవలో త్వరలోనే స్నేహం చేసుకోవచ్చు.

''ఓహో! నా పేరుక్కూడా 'దేవి' తగిలించారా? స్త్రీ లందరికీ మీ కీ పదాన్నే తోకల్లే అంటిస్తూంటారా?....మీరు చేసిన తప్పేముంది కనుక, క్షమించేందుకు? మీ బాధలు మీ కెలా ఉన్నవో, మా బాధలు మాకూ వుండి అప్పుడప్పుడు వినుకోవటం జరగొచ్చు. అవి చాలా అల్పవిషయాలు కనుక వాటిని గూర్చి తీవ్రంగా ఆలోచించటం మంచిది కాదు.'' అందామె.

ఈ మాటలు క్షమించటానికి సమాన స్థాయిలోనే ఉన్నవి. చూడబోతే ఈమె కూడా తను పొరబడినట్లు కఠినురాలు కాదేమో?

ఆమె తినిపించే భోజనం ఇవాళ రుచించింది. వాతావరణం మారుతూన్నట్లే తోచింది.

''మీకు తీరికవుంటే కాస్సేపు ఇక్కడ కూర్చుంటూ వుండండి జానకీదేవిగారూ! కళ్ళన్నావుంటే ఏదన్నా చదువు కుంటూ కాలక్షేపం చేసేవాణ్ణి....''

''పగటి డ్యూటీలో తీరిక వుండదండీ! రేపు నాకు ఆఫ్....ఎల్లుండినుంచీ నైట్ డ్యూటీలో వొస్తాను—'' అందామె.

జగన్నాథానికి ఇది నిజంగా దుర్వార్తగానే తోచింది. ఏదో కాస్సేపైతే తానీమెను భరించగలడు కాని, ఇక ఎల్లుండినుంచీ రాత్రి వొచ్చి తెల్లవార్లూ తనను పీడిస్తూ తన ప్రాణం కొరకటం మొదలెడుతుందేమో? ఈమె సంగతికన్న రాధాదేవి సంగతే తన ఆందోళనకు పెద్ద కారణంగా తోచింది.

''మరి రాధాదేవిగారో?'' అన్నాడు.

"గాభరా పడకండి. ఆమె పగటి డ్యూటీకి వొస్తుంది. ఇవాళ ఆమెకు ఆఫ్. రేపు ఉదయం డ్యూటీకి వొస్తుంది."

ఇంకా యీ రాత్రికి రాధాదేవి వొస్తుందనీ, ఎన్నో విషయాలు మాట్లాడేందుకు వీలుంటుందనీ, కనీసం ఆమెను కష్టపెట్టివుంటే క్షమార్పణన్నా అర్పించుకుందామనే ఆదుర్దాలో వున్నాడు. ఈ పగలు గడవటమే కష్టంగా వుంటే, రాత్రి గడపటం ఇంకెంత కష్టం! కాని యీ సందర్భాలన్నీ తన చేతుల్లో లేవు. అవకాశాలనేవి కావాలన్నప్పుడల్లా దొరకవు. అవి దొరికినప్పుడు నిర్లక్ష్యం చేస్తే, తరువాత పశ్చాత్తాపమే మిగులుతుంది.

"విచారించకండి....ఆమె రేపు ఉదయం వొస్తుంది....లేకుంటే తీరికవుంటే రాత్రి కొకసారి వొచ్చి వెళ్ళమని చెపుతాను" అంది జానకి కిలకిలా నవ్వుతూ.

ఇంకే సందర్భంలోనన్నా ఐతే యీ నవ్వులోని గలగలను తనూ ఆనందించే వాడేనేమో కాని, ఇప్పటి యీ నవ్వు ఎంత హేళన, జుగుప్సను వెళ్ళకక్కుతోందో తన చెవులకు తెలుస్తూనే వుంది. ఈమెనుంచి వొచ్చే హాస్యం వెగటే కాకుండా తనను అనవసరంగా గాయపరుస్తోంది కూడాను. తన యీ అభిప్రాయాన్ని బైట పెడితే ఈ రభస మరింత ఎక్కువవుతుంది.

"నే నా సంగతులేమీ ఆలోచించటం లేదు ఒకరంటే అభిమానం, ఇంకోరంటే నిరాదరణా నాకు లేవు" అన్నాడు. ఇది అబద్ధమని తనకూ తెలుసు; బహుశా జానకికి కూడా తెలుసేమో?

"ఇందులో అభిమానాలెందుకు లెండి. ఆమె అంటే మీకు సదభిప్రాయం వుంది కనుక, ఆమెనుగూర్చే విచారిస్తున్నా రనుకున్నాను. అంతే!"

నిజంగా అంతే! ఐతే రాత్రికి రాధాదేవిని ఒకసారి రమ్మని చెప్పివుంటే బాగుండే దనిపించింది. ఇప్పు డిక లాభంలేదు. ఇప్పుడు బైటపడితే, ఒక పొరపాటు చేసి, దాన్ని దిద్దుకోబోయి మరో పొరపాటు చేసినట్లవుతుంది. అందుకని ఆ సంగతే ఎత్తుకోలేదు.

"జానకీ దేవీ! ఇక్కడికి దగ్గర్లో నది ఏమన్నా వుందా!....అంటే యీ హాలు లోంచి చూస్తే కనిపిస్తుందా?"

ఆమె నిర్లక్ష్యంగా నవ్వింది. సంవర్భశుద్ధి లేదు అందులో.

"ఆఁ, కాస్త దూరాన జీవనది ఒకటి వుంది."

"పెద్దదేనా?"

"అంత పెద్దది కాదు....కాని సంవత్సరమంతా ప్రవహిస్తూనే వుంటుంది."




“దాని పేరేమిటి?”

“మురుక్కాలవ!” అని పగలబడి నవ్విం దామె. జానకిమీద చాలా అసహ్యం వేసింది. ఎలక్కు ప్రాణ సంకటం, పిల్లికి చలగాటంగా వున్న ధోరణి చూపుతుం దెందు కీమె?

“పోనీండి....నదినిగూర్చి ఎందు కడిగారు? అలా నదేమన్నా వుందని కల గన్నారా?”

అంతలోనే ధోరణి మార్చేసింది గాయపరచటం. వెంటనే కట్టుకట్టడం “అలవాటు కాబోలు!”

“ఆఁ, కల గన్నాను!” అని సర్దుకున్నాడు. కాదంటే అనవసర సంభాషణ పెంచాలి. నిజంగా కలగనేందుకే యీ మాట అడిగాడు మరి.

“సరే....వొస్తాను.”

ఆమె వెళ్ళటంతో గాలివాన వెలిసినట్లయింది. మనిషి “మూడ్”ను బట్టి ప్రవర్తించే తత్వం కా దీమెది. యీమెతో ఎంత తెలివిగా మాట్లాడినా, తను లోకువ వవుతున్నాడు. మరి రాధాదేవితో ఎంత తక్కువ మాట్లాడినా జీవితంలో లోపించినదాన్ని పూరించుకుంటూన్నంత తృప్తి కలుగుతూ వుంటుంది.

జానకితో తనకు లెక్కేమిటి? యీమెను గూర్చి మనసు పాడుచేసుకోవటందేనికి?

విధివశాత్తూ అనుకోకుండానే తనిక్కడికి వొచ్చి పడ్డాడు. ఎందుకనో కాని మొట్ట మొదటి మాటల్లోనే రాధాదేవి తనను చాలా బలంగా ఆకర్షించింది. రాధాదేవి మీద తను యీ రెండు రోజుల్లోనూ ఎన్నో కలలు కన్నాడు. ఇదివరకెప్పుడూ ఏ స్త్రీని గూర్చి ఇంత తీవ్రంగా ఆలోచించి ఉండలేదు. జీవితంలో నిర్లక్ష్యం చేస్తున్న విషయాలే, ఒకోసమయంలో జీవితాన్ని నిర్ణయించేటంత శక్తివంతా లవుతూంటవి కాబోలు!

తన మనోనేత్రం ముందు రాధాదేవి దివ్యమంగళరూపం ఉజ్వలంగా ప్రజ్వరిల్లుతోంది. తనకూ కొంతమంది అందగత్తెల్తో పరిచయమూ, మరికొంతమందితో స్నేహమూ ఉంది. కాని వాళ్లెవర్ని గూర్చి తనెప్పుడూ ఇంత సీరియస్‌గా ఆలోచించలేదు.

రాధాదేవి ఎలా వుంటుందో భౌతిక నేత్రానికి తెలియదు. మనోనేత్రంతో ఆమె సౌందర్యాన్ని వర్ణించేందుకు తను కవి కాదు. ఐతేనేం? చెప్పలేకపోవొచ్చు కాని, ఫీలవుతున్నాడు.

లలితను తనెందుకు మెచ్చుకున్నాడు? ఆమె కళ్ళ మెరుపు—ఆమె కళ్ళతో తేలిగ్గా ఎన్ని మాటలకన్నా లొంగని అభిప్రాయాన్ని వెలిబుచ్చగలదు. శాంతనో? శాంత శరీరసౌష్టవం, యవ్వనపు శోభకోసం. శకుంతలనో? ఆమె మాటలోని మార్దవం, తెలివితేటలు, ఆధునిక యువతిలో వుండాల్సిన సంస్కారం-వీటికోసం. జయనో—ఆమె ఐశ్వర్యవంతుల ఇంటిపడుచు; కథల్లోని రాచకన్యల గర్వం. శీవితోపాటు గొప్ప చిత్రకారుడు చాలా జాగ్రత్తగా వేసిన రంగల్లే కన్నుల పండువగా వుండే ఆ శరీరచ్ఛాయ; మంచినీళ్ళు తాగుతే గొంతులోనుంచి అవి పోతూండటాన్ని గమనించగలిగే ఛాయ అది!

ఇలాగే ఇంకా చాలామంది వున్నారు. ఐతే వీరిలో ఏదో ఒక్కటే ఆకర్షించగలిగే సుగుణం. దాన్ని అంటుకొని వున్న దుర్గుణాలెన్నో వున్నవి. గురిగింజలో నలుపుభాగం ఎంత తక్కువదైనా దాని నలుపుకే ప్రాధాన్యత ఏర్పడినట్లు; తనకు తెలిసిన స్త్రీలవైపు ఆకర్షించబడేందుకు బదులు, వారిని సాధ్యమైనంత త్వరత్వరగా దూరం చేశాడు. ఒకో సుగుణానికి ఒకొక స్త్రీని ప్రేమించటం అర్థంలేని విషయమని తెలుసు.

అలాటి ఒకో సుగుణాన్నే ఏర్చికూర్చి రాధాదేవిని సృష్టించుకున్నాడు. ఆమె తన స్వాప్నికి అనుభూతిలోని సౌందర్యరాశి. ఎక్కడన్నా ఒకటి రెండు సుగుణాల్ని మరచిపోయినా ఫర్వాలేదు. ఇంతకు మించిన సృష్టి తనవల్లకాదు. అందుకనే ఇక్క

చన్నా అగిగలిగాడు!

ఆ సుందరి నిజంగా అలనాటి రాధే! ఆ కవులు జ్యోతిష్కులై ఈమెనుగూర్చే రాశారేమో। ఈ ఆసుపత్రి ఆనాటి బృందావనమైవుండాలి. సమీపంగా ఏదన్నా నది వుంటే దాన్ని యమునానదిగా సరిపెట్టుకుంటుందా మనుకున్నాడు, కాని మురుక్కాలవ మాత్రమే వుందని జానకి చెప్పినప్పుడు మనస్సు కలుక్కుమంది. ఐతేనేం, తను సృష్టికర్త, భౌతిక నేత్రం, ఎదురుగా వున్నదాని నిజస్వరూపాన్ని సరిగా అంచనా వేయ లేక పొరబడుతూంటుంది కాని మనోనేత్రం, లేనిదాన్ని కూడ సృష్టించ గలదు. కనుకనే క్షణంలో మురుక్కాలవ, యమునా తరంగిణీవలె, నల్లని నీటితో, ఒడ్డులు వొరుసుకొని గలగలమంటూ పారసాగింది!

కృష్ణు డెవరో ఐతే, ఇంత ఆలోచించే శ్రమ తను పడే వాడు కాదు ఆనాటి గోపికల్లోని అంతః కలహాల్లాంటివే ఈ నాడు జానకి మాటల తాత్పర్యం కూడాను. యీ దృశ్యమంతా బాగా అతికింది.

మానవుడి మేధస్సుకు అంతేమిటి? అది వూహించలేని దేముంది? ఎన్ని రకాలుగా ఆ బృందావన గాథల్ని వూహించేందుకు వీలుందో అన్నిటినీ వూహిస్తూనే వున్నాడు. నిజంగానే అదంతా జరుగుతూన్నంత ఆనందం కలుగుతోంది, దృష్టి వుంటే ఆ మురుక్కాలవే కనిపించేది, తనచుట్టూ వున్న రోగులూ, బాధిత ప్రపంచమే చూసే వాడు!

''మిస్టర్! నేను వెళ్తున్నాను'' అంది జానకి.

''మరి ఈ రాత్రికి ఎవరొస్తారు?''

'రిలీవింగ్ ఎవరన్నా వొస్తారు రాధాదేవి మాత్రం కాదు **గుడ్ ఈవినింగ్!**'' చకచకా నడిచిపోయిన పాదాల సవ్వడి వినిపించిం దతనికి.

ఈమె కింత ఎగతాళేం? తనమీద ఆట పట్టించింది. కాస్త లోతులకుపోయి ఆలో చిస్తే ఇదీ వొకందుకు మంచిదే ననిపించింది. రాధాదేవి విషయం ఆమెనే అడగటం వల్ల పరి పూర్ణంగా తెలియదు, కొన్ని ప్రశ్నలు అడిగేందుకే వీల్లేనంత డెలికేట్‌గా ఉంటవి. అలాటి ప్రశ్నల జవాబుల్ని ఈమె నుంచి లాగవొచ్చు.

ఐతే యీ జానకి రాధాదేవిని ద్వేషిస్తోంది కనుక, రాధాదేవి లోపాలను గోరంతలు కొండంతలు చేస్తుంది. నమ్ముతూన్నట్లే నటించటంవల్ల రాధాదేవి పాత్రను తను చాలా విశదంగా చూడగలుగుతాడు. ఈ పద్ధతి కూడా బాగా అనుకూలంగానే వుందనుకోవటంతో జానకి మీద కలిగిన ద్వేషాగ్ని చాలావరకు చల్లారింది. నీ స్నేహితుల దగ్గర నీ సంగతి గ్రహించటం ఎంత నిజమో, నీ శత్రువుల దగ్గరా

యువ

అంతే! జానకీ దేవిని కీలుబొమ్మగా చేసి స్వప్రయోజనానికి ఉపయోగించు కోవాలి-
ఆమెను లొంగదీసుకోవటం ఎట్లాగో అనుభవజ్ఞుడైన తనకు, నల్లేరు మీది బండి-
నడక

# 5

రిలీవింగ్‌కు ఏ భూతం, హిడింబి దాపరిస్తుందోనని భయపడ్డాడు జగన్నాథం, ఎవరైతేనేం-రాధాదేవి గానప్పుడు? తనకోసమని ప్రత్యేకంగా తన ఇష్టులే వొస్తారను కోవటం దేనికి!

మెల్లని అడుగుల చప్పుడు దగ్గరయింది, చల్లని చెయ్యి నుదుటి మీద పడింది. ఈ హస్తస్పర్శ తనకు తెలుసు. ప్రాణం లేచి వొచ్చింది

వొచ్చావా-రాధాదేవీ!''

''ఎట్లా కనిపెట్టారు'' ఆ కంఠస్వరంలోని అమృతం తన చెవులకే తెలుసు.

''గుడ్డివాడికి ఇతర యింద్రియాలే అండ మీరు రారని చెప్పింది జానకి.''

''ఇవాళ ఆఫ్. కాని రిలీవింగ్ ఆమెకు జ్వరం, నాకు తప్పలేదు.''

''చాలా శ్రమ పెట్టాను కదూ''

''మీరేం చేశారు? ఎందుకనో కాని, యీ డ్యూటీ చేయటమంటే నాకు చాలా ఉత్సాహంగా వుంటుంది. మనం బతు కుతూ, ఒక ఉన్నతాశయాన్ని నెరవేర్చుకుంటున్నామని, సమాజసేవకూడా చేసే అవకాశం దొరికిందనే తృప్తి కలుగుతూ ఉంటుంది.''

''నిజంగా గర్వపడవలసిన విషయం కూడాను, నాకు యీ మాత్రం అవకాశం దొరకలేదు కదా అనిపిస్తూంటుంది రాధాదేవి రేపు దే డ్యూటీ చెయ్యాలి కదూ?''

''ఔను ఒక్కరోజు శ్రమపడాలి—అంతే!''

ఎంత తేలిగ్గా అంది! కొన్ని పనులు చేసేందుకు ఎంత ఉత్సాహం వుంటుంది! శ్రమ, బడలిక తెలియవు, నిజంగానే ఒక వ్యక్తిలో యింత శక్తి వుందా అని పిస్తుంది.

''మీ కెలా వుంది?''

''బాగా తేలిగ్గా వుంది. వొళ్ళు నొప్పులూ అవీ బాగా సర్దుకున్నవి కాని ఈ మంచంలో ఇలాగే చాలా రోజులు వుంటే నడవటం కూడా నేర్చుకోవాల్సి వొస్తుందేమోనని భయంగా వుంది.''




"నేను రేపు డాక్టర్‌గార్ని అడుగుతాను—మిమ్ము కాస్త దూరం నడిపించటమే మంచిదనుకుంటాను. డాక్టర్‌గారు తప్పకుండా ఒప్పుకుంటారు."

తనమీద యింతకన్న సానుభూతినీ, కరుణనూ వర్షించే వ్యక్తులు యీ ప్రపంచంలో యింకెక్కడన్నా వుంటారా? పావు శతాబ్ది జీవితంలో ఆమె ఎవరో—తనెవరో? ఒకరి ఉనికి మరొకరికి తెలియదు. ప్రమాదవశాత్తూ వొచ్చి ఒకచోట పడ్డారు. కొద్ది దూరం కలిసి నడిచి, విడిపోతారు కాదు యీ దయామయిని తాను విడవలేడు.

గుర్తొస్తోంది యీమెను నిన్న రాత్రి గాయపరచిన సంగతి తను పొరబడాడేమో? నిజంగానే ఆమె తన మాటల్ని పట్టించుకోలేదని అర్థమౌతోంది? అంతవరకే చాలనుకున్నాడు. కాని తన మాటను అంగీకరించికూడా ఉండొచ్చు. అంగీకరిస్తే తన అదృష్టదేవత నవ్వుతూ తనను వరించినట్లే? అడుగుతే బాగుండు; ఎలా అడగాలా అని ఆలోచిస్తున్నాడు.

"భోజనం తేనా?" అందామె.

"తీసుకొని రండి. మిమ్ము చూస్తే ఆకలి దహించుకొని పోతూంటుంది."

"నేను కనపడటం లేదు కదా?"

"కనిపిస్తున్నారు ఎలా కనిపిస్తున్నారో చెప్పేందుకు మాటలు చాలటం లేదు. మీరు రాగానే నేను యిందాక గ్రహించలేదా?"

"సరే, ముందు ఆకలి తీర్చుకోండి. తరువాత మీరు చూసిందంతా చెప్పుదురుగాని."

ఆమె తెచ్చిన భోజనం తిని, తేన్చాడు, జగన్నాధం.

"మిగతా రోగుల్ని కూడా చూసి వొస్తాను" అందామె.

వెళ్తే మళ్ళీ రాదేమో, రాత్రిలాగే అవుతుందేమోనన్న భయం వేసింది. ఈ సమయంలోనే అంతా మునిగిపోతున్నట్లూ, చావుబతుకుల సమస్య తేల్చుకోవాలన్నంత ఆతృత దహించి వేస్తోంది. ఏమైనా కానీ, ఎటో అటు తేలుతే మనశ్శాంతన్నా మిగులుతుంది. తను యిక్కడికి ఎందుకు వొచ్చాడో, వొచ్చిన వాడు ఎటు పడిపోతున్నాడో, ఏమౌతోందో తెలియటంలేదు. జీవితంలోని యీ గొప్ప 'సస్పెన్స్' లేకుంటే బతుకు యెంత నిస్సారంగా ఉంటుంది।

"రాధాదేవీ! మీరు మళ్ళీ వొస్తారా?"

"వొస్తాను—ఏం?"

"రాత్రిలాగే రారేమో ననుకుంటున్నాను....మీరు తప్పక రావాలి. జవాబు చెప్పరేం?"

కొంచెం ఆగి, దీర్ఘంగా వూపిరి పీలుస్తూ "వొస్తానండీ తప్పకుండా వొస్తాను. ఒక గంటయ్యాక—" అందామె.

"గంట కాకుంటే నాలుగ్గంటలు. మీ రాకకోసం జీవితమంతా ఎదురు చూస్తూ కూర్చున్నప్పటికీ నాకు కష్ట మనిపించదు. ఐతే అసలు వస్తారనే నమ్మకం వుండాలి."

కిలకిలా నవ్విందామె. పొగడ్తను అందుకున్నప్పుడు స్త్రీ పొందే గర్వంతో పులకరించి వుండాలి. యీ పద్ధతిని తనకు సానుకూలంగా తిప్పుకోవొచ్చు. ఐతే అనుభవ పూర్వకంగా తనకు తెలుసు—తొందర పడకూడదని.

"నేను తప్పక వస్తాను. వెళ్ళిరానా?" అని మృదువుగా, ఒట్టు వేస్తున్నట్లు చేతిని గట్టిగా అదిమి వెళ్ళిందామె.

ఆమె తిరిగి తన దగ్గిరికి వచ్చేందుకు గంట వ్యవధి వుంది. యీ గంటలోనూ అనేక రకాల సంభాషణలు అతని బుర్రలో తిరిగినవి. ఏవీ కూడా తృప్తికరంగాలేవు. చివరకు విసుగేసి, ఆమె వొచ్చాక మాట్లాడలేక పోతానా అనే ధైర్యంతో వేచి వున్నాడు.

చుట్టూ చాలా నిశ్శబ్దంగా వుంది. గదిలో ఎక్కడా ఆమె మాట వినిపించటంలేదు. పని పూర్తిచేసుకొని, బహుశా తనలాగే ఎలా మాట్లాడాలా, ఏం మాట్లాడాలా అని ఆలోచిస్తూ వూరుకుందేమో? యీ అనుమానాల్తో బాధపడకుండా మనసులోనిమాటల్ని

వెళ్ళగ్రక్కటమే ప్రక్రియ అనే సంగతి తెలియక బాధపడుతోందేమో? తొందర పెట్టాలనుకున్నాడు కాని అది మంచి పద్ధతి కాదని సరిపెట్టుకున్నాడు.

తనింత పిచ్చివాడవుతున్నా డేమిటి? "తొలి చూపుల్లోనే ప్రణయం" అనేదాన్ని నమ్మలేక, హేళనచేసేవాడు ఇప్పుడు మొదటిసారి కంఠస్వరం వినటంతోనే ప్రణయంలో తలకిందులుగా పడ్డాడు. ఐతే యిలాటి అనుభూతికి తను మొదటివాడు కాదు. అలనాడు నలదమయంతుల ప్రణయం, రుక్మిణీ కృష్ణుల ప్రణయం ఈ జాతిదే! వారు ఒకర్నొకరు చూసుకోలేదు సరికదా, ఒకరితో మరొకరు మాట్లాడనూలేదు, మధ్యవర్తుల మాటలు విని ప్రణయ పిపాసు లయ్యారు అందుకనే యీ ప్రణయానికి ఒక దివ్యత్వాన్ని ఆపాదించుకో గలిగాడు.

రాధాదేవిమీద తన కిన్ని ఆశలు ఎందుకు పేరుకొన్నవి? ఈమె ఒక్కసారిగా తన జీవిత సమస్యగా పరిణమించ గలిగిందేమిటి? తనందుకు విచారపడటం లేదు. కాని ఆమె తన అంగీకారాన్ని తెలియబరుస్తే ఈ జీవితమే నిరర్థక మవుతుందేమో ననే అనుమానం కలిగింది ఒకో వ్యక్తిలోని ఆకర్షణలే అయి వొండొచ్చు. కాని ఏ బంధుత్వమూ తనను యింత శక్తితో తలకిందులు చేయలేదు. రాధాదేవి ఒక్కతెనే తా నీ జీవితంలో శాశ్వతంగా కోరగలడు, తనకు మరింకేమీ అక్కర్లేదనిపించింది.

అడుగుల చప్పుడు వింటూనే తన ఆరాధ్య దైవం దర్శించ వొస్తోందనే హెచ్చరికను తనకు తాను చేసుకున్నాడు

"రాధాదేవీ! కూర్చోండి కూర్చునేందుకు యేమన్నా ఉందా యిక్కడ?"

"స్టూలువుంది లెండి చెప్పండిక"

జగన్నాథానికి నోట మాట రావటం లేదు. భక్తుడికి భగవానుడు ప్రత్యక్షమైతే అయోమయంలోపడి, ఆ వాతావరణానికి అలవడేందుకు, సరిగ్గా ఊపిరి పీల్చుకునేందుకు తనలాగే తల్లడిల్లుతాడు కాబోలు!

"మీరు మాట్లాడండి—ఈ నిశ్శబ్దం భరించలేకుండా వున్నాను... ఏదో వొకటి, మీకు తోచింది—" అందామె తన చేతిని స్పర్శిస్తూ; ఆ స్పర్శ తన శక్తులన్నిటినీ మేల్కొల్పి, తనను ముందుకు తరుముతోంది.

భయాన్ని శరీరంలోనుంచి పారతోలేందు కన్నట్లు గట్టిగా వూపిరి వొదిలి అన్నాడు. "రాధాదేవీ! రాత్రి మిమ్మ గాయపరిచాను. ఎంత స్నేహితులం అనుకున్నప్పటికీ, మిమ్మ కోరరాని కోరిక కోరాను—క్షమించండి."

"మీరలా ఎందుకనుకుంటున్నారు? ఐతే మీరా మాటలు కేవలం వినోదంకోసం, ఎగతాళిగా అన్నారా?

చాలా చుట్టుతోవ పట్టించా ననుకున్న తను మరోసారి పొరబడ్డాడు. ఆమె సరాస రాజమార్గాన తనను, ఎదుర్కొంది. పైపెచ్చు తన మాటల విలువను 'ఛాలెంజ్' చేస్తోంది. ఇక బైటపడక తప్పదు. ఇతరుల్తో అబద్ధాలాడినంత తేలిగ్గా తనతో తనే ఎలా అబద్ధాలు చెప్పుకొని, నమ్మగలడు?

"కాదు, రాధాదేవీ! నే నా మాటల్ని మనస్ఫూర్తిగానే అన్నాను. కాని చాలా అనాలోచితంగా అన్నాననిపించింది."

"ఎందుకనీ?"

"చూడండి. నేను జీవితమంతా తమ సహచర్యాన్నికోరాను. నే నంటే— అంధుణ్ణి! చూస్తూ చూస్తూ అంధుణ్ణి చేసుకునేందుకు ఏ యువతి వొప్పుకుంటుంది? నేను ఏ మాత్రం ఆలోచించినా అలా మాట్లాడి వుండకూడదు రాత్రి చాలా బాధ పడ్డాను మీరు మళ్ళీ నా దగ్గరికి రాకపోయ్యేప్పటికి. నేను నిజంగానే నేరస్థుణ్ణని నమ్మి నేను ఎంత దూషించు కున్నాననీ!"

"దీన్నిబట్టి మీరన్న మాటల్లోని సిన్సియారిటీమీద మీకే నమ్మకం లేదనుకో వచ్చా?"

"కాదు కాదు నేను సిన్సియర్‌గానే అన్నాను."

"అలాటప్పుడు ఆ మాటమీదనే ఎందుకు వుండరు? గోడమీది పిల్లి వాటంగా ఎటుపడితే అటు తిప్పేందుకు ఎందుకు సిద్ధపడతారు?"

జవాబు చెప్పేందుకు వూపిరి తిరగక, జగన్నాధం మదనపడుతున్నాడు.

"పోనీ. ఇప్పుడు చెప్పండి నిన్నరాత్రి మీ రన్నమాటమీదనే ఉండగలరా?"

ముందు తన సంసిద్ధతనూ, తన నమ్మకాన్నీ స్థాపించుకోవాలని రాధాదేవి చూస్తోం దనే సంగతి జగన్నాధానికి తెలియకపోలేదు. ఐతే 'ఔను' 'కాదు' అని ఒక్కసారిగా తేల్చేస్తే అంత బాగుండదు. కాస్త చుట్టుతోవ పట్టిస్తే, కళాపూరితంగా మాట్లాడితేనే ఆ మాటల విలువ హెచ్చుతుంది. ఈ ఎఫెక్ట్‌కోసమే తంటాలుపడ్డాడు, జగన్నాధం.

"రాధాదేవీ! నే నన్న మాటల్నిగూర్చిన నా కున్న నమ్మకం విషయంలో సందేహ మేమీ లేదు. ఎందుకంటే ఆ మాటలు నా సౌఖ్యానికీ, ఆనందానికీ, మేలుకూ సంబం ధించినవి; అంతతో పోలేదు; అవి మీ దుఃఖానికీ, కీడుకూ సంబంధించినవి కూడాను—"

"దాన్నిగూర్చి ఆలోచించవలసింది, నేను! మీరు కాదు."

"అలా అనకు. నేను మీకు చేయదలచిన అపకారాన్ని, హానినికూడా మీరు గమనించటం లేదు. గతరాత్రీ, యీనాటి పగలంతా యీ విషయాన్నిగూర్చే చాలా




దీర్ఘంగా ఆలోచిస్తున్నాను. నాలో కలిగిన ఒకానొక క్షణిక బలహీనతకు మీ జీవిత మంతా దుఃఖమయం జేయవలసి వస్తుందనే సంగతి గుర్తుకొస్తే మనసు తుపాకి గుండు తగిలిన పక్షివలె గిలగిలా కొట్టుకుంటోంది.''

''నా జీవితాన్నిగూర్చి మీ రింతగా ఆలోచించినందుకు ధన్యవాదాలు. కాని నేనూ ఆలోచించుకొనే వుండివుంటానని మీరు అనుకోరా ?''

''ఎందు కనుకోను ?''

''మరి నా జవాబుకూడా వినాలనే కుతూహలం మీకు లేదా ?''

''ఒకవిధంగా చూస్తే వుంది ; మరోవిధంగా చూస్తే లేదు : ఆ ఉండటం, నా జీవిత సౌఖ్యానికే దారితీస్తుందో, లేక గొప్ప డిసప్పాయింట్ మెంట్ కే దారితీస్తుందో ననే భయంకూడా వుంది కొన్ని సమస్యలు ఏటూ తెగకుండా వుండటంవల్లనే జీవిత మంటే గొప్ప ''ఇంటరెస్ట్'', బతకాలనే తీవ్ర వాంఛా కలుగుతూ వుంటుం దను కుంటాను. పోతే మీరు నిరాకరిస్తే, అమూల్యమైన దేదో చెయ్యి జారిపోయిన విచారం కలుగుతుంది, లేక అంగీకరిస్తే, మీ కేదో గొప్ప అన్యాయం చేశాననీ, మీకు ఏమీ కాని నా కోసం మీరీ గొప్ప త్యాగం చేశారనే భావం నన్ను పీడిస్తుంది. ఈ రెంటినీ సమన్వయించుకోవటం ఎలాగా అని ఆలోచిస్తున్నాను ' అన్నాడు జగన్నాధం.

ఒక నిమిషం నిశ్శబ్దంలోనే గడిచింది. తన మాటలమీద ఆమె చాలా లోతుగా ఆలోచిస్తోందని తనకు అర్థమైంది. ఆమె తనపట్ల చాలా సుముఖంగా వున్నదనే సంగతికూడా స్పష్టంగా తెలుసుకోగలుగుతున్నాడు. ఎలాగూ ఆశించిన ఆ ఆనందం తన వొళ్ళో ఒరుగుతోంది; అందుకనే మనస్సు సంతోషంతో చిందులు తొక్కుతోంది. కాని ఆ సంతోషాన్ని పైకి కనపడనీకుండా, వేరొక మూడ్‌లో వున్నట్లు సూచించటంలోనే, అంటే సరిగ్గా విరుద్ధమార్గంలో వున్నట్లు నటించటంలోనే, లభ్యమయ్యే ఆనందాన్ని కొన్ని రెట్లు పెద్దది చేసుకో గలుగుతున్నాడు.

"నాకు అపకారం చేద్దామనే దురుద్దేశ్యం మీకున్నదంటే నేను నమ్మలేను." అందామె. "ఐనా మీకు దృష్టి వస్తుందనే నాకు గట్టి నమ్మకం "

"కల గన్నావా?"

"ఔను. కలగన్నాను."

"కాని, కలల్ని నమ్మటం ఎలా?"

"జీవితాన్ని నమ్మి బావుకున్నదేమిటి—కలల్ని నమ్మి చెడేందుకు?"

ఇదొక గొప్ప నగ్నసత్యం! ప్రస్తుతం తా నీ కలలమీదనే కదా ఆధారపడింది! ఈ కలలన్నీ అలలల్లే కరిగిపోయినా పోవచ్చని తనకు తెలియకనా? కాని వీటిమీదనే, ఊహాసౌధాలు నిర్మించాడు. తన అనుభవంలో వున్న విషయాన్నికూడా ఎలా ఏమరగలిగాడు?

"ఒప్పుకున్నాను, రాధాదేవీ! జీవితంకన్న కలలే నయ మనిపిస్తున్నవి. జీవితం మన ఇష్టప్రకారం నడవదు, కాని కలల్ని మనకు అనుకూలంగా సృష్టించుకోగలుగుతున్నాం కాని చివరకు యీ కల నిజం కాకపోతే ?"

"జీవితంలో అనుకున్నది నిజం కాకపోతే ఏం చేశాం? ఇదీ అంతే!"

"నీలాగు గుండె ధైర్యం గలవారు ఎంతమంది ఉండగలరో అని ఆలోచిస్తున్నాను కాని యీ స్వప్న పరిణామం తేలేవరకూ, నిన్ను నే నా ప్రశ్న అడిగి వుండకూడ దనిపించింది."

"అంటే స్వప్నంతాలూకు అనుభూతికూడా దక్కకుండా చేయా లనుకున్నారా "

"కాదు, రాధాదేవీ! ఒక్కటి ఆలోచించు నిజంగానే నాకు దృష్టి రా దనుకుందాం "

"నే నలా ఆలోచించను, మీకు దృష్టి వొస్తుందనే నా అంతరాత్మ నమ్మకంగా, గట్టిగా చెబుతోంది."

"అది నిన్ను మోసం చేస్తే?"

"ఏమైనా కానీండి. మనం బైటి ప్రపంచాన్ని నమ్మలేకపోవచ్చు. కూడా మనం నమ్మకుండా ముందుకు సాగగలమా?" అన్నదామె.

"నమ్మటం వేరు, నమ్మింది నిజమవటం వేరూను. ఒకవేళ అంధుణ్ణయితే—?"

"మాటి మాటికీ ఆ మాట అంటా రెందుకు? మీకు అంధులవ్వాలని వుందా?"

"నీలాటి స్త్రీ సాహచర్యం వుంటే అంధుడుగా జీవితాన్ని వెళ్ళబుచ్చుతూ, హాయిగా వుండడం అసాధ్యం మాత్రం కాదు." అన్నాడు జగన్నాథం.

"బాగుంది మీరు చెప్పేది. ఫైర్ ఇంజన్ వున్నదని సరదాకు ఇంటికి నిప్పు పెట్టుకున్నట్లవుతుంది"

ఆమె చెప్పేది పూర్తి కాకుండానే జగన్నాథం అందుకున్నాడు. "నే నలా కోరడం లేదు; కాని వొకవేళ అలా జరిగినప్పటికీ."

"జరగదని నేను అంటున్నాగా మొన్న నొకసారి భగవంతుని మీద నాకు నమ్మకం వున్నదా అని అడిగారు. అప్పుడు నేను సరిగా చెప్పలేకపోయా ననుకుంటాను. ఇప్పుడు యీ సుడిగుండంలో పడ్డాక, భగవంతు డొక్కడే రక్షించ గలడనే నమ్మకంతో, మీ దృష్టికోసం నేను ప్రార్థనలు చేస్తున్నాను, నా ప్రార్థనలు తప్పక ఆలకించబడుతవని నమ్ము తున్నాను."

జగన్నాథం క్షణంసేపు స్తంభించి పొయ్యాడు. తనకోసం భూలోకాన్ని విడిచి ఎక్కడో స్వర్గలోకాల్లో వున్నాడనే భగవంతుని దాకా వెళ్ళిందీమె, సావిత్రిలాటివాళ్ళు కాలంలోనో వున్నారనుకో నక్కరలేదు; యీ నాటికీ, మన చుట్టూ వుంటూనే వున్నారనే సంగతి తనకు తెలిసి వొచ్చింది.

ఈమెను ఈ దేవ దూతను ఎలా గౌరవించాలో అర్థం కాలేదు. తన సుఖ సౌఖ్యాలు కోరే వ్యక్తి ఈమె గాక ఈ ప్రపంచంలో మరెవ రుండగలరు? ఏనాటి జన్మల బంధమో తా మిద్దర్నీ కలేసి వుంచి వుండాలి. లేకుంటే రెండురోజుల్లో ఇంత స్నేహమా? ఇంత గొప్ప బంధుత్వమా? ఊహించలేని విషయా లెన్నో జీవితంలో జరుగుతూండడం వింతనుకోవటం పొరపాటే; ఈమె నిజంగా ఎంత గొప్ప వ్యక్తిత్వం గలది; వీలుంటే యెలాగైనా యీమెను సుడిగుండంలో పడకుండా కాపాడాలి. అది తన కనీస కర్తవ్యం.

ఆమె చూపిన యీ త్యాగబుద్ధి ముందు ఆమె ఆధిక్యం, తన అల్పత్వం రుజూ ఐనవి. ఈమెకు ఏ మాత్రం అన్యాయం చేసినా తనను కరుణామయు డనబడే ఆ దేవుడు కూడా క్షమించలేడు.

"....రాధాదేవీ! నాకు కళ్లు లేవు కాని, మీ మాటలు విన్నాక కన్నీళ్ళు కార్చి, ఆ నీటితో మీ పాదాలు కడిగే వాణ్ని!" అన్నాడు. తనకు కలిగిన అనుభూతిని వెల్లడిం చేందుకు గుంజుకుంటూ.

ఆమె అతని చేతులు పట్టుకుంది; ఆమె వొణికిపోతోందని అర్థమైంది. లేక తానే వొణికి పోతున్నాడా?

"అలా అనకండి. నిజంగానే నేను ఏడ్చేందుకు సిద్ధంగా వున్నాను....ఇంత మంది రోగుల్ని చూశాను కాని, మీరు మాత్రమే నా హృదయాన్ని కూకటివేళ్లతో పెళ్ళగించ గలిగారు. ఏమో—ఎందుకని మీరంటే నా కింత ఆపేక్ష కలిగిందో నే నిప్పుడు చెప్పలేను—ఒక వ్యక్తి మరో వ్యక్తిలో లీనమైపోవట మంటే ఇదేనేమో! ఇందువల్ల నా బాధ్యతల్ని కూడా మీకు అంటకడుతున్నా ననుకోండి...."

నడి సముద్రంలో వున్న వాడికి గడ్డిపోచ కూడా ప్రాణదాత అవుతుంది. అలా టిది ఒక చిన్న పడవే దొరికినట్లయింది. తనకు ఈ ప్రపంచమంతా గాలించినా ఇలాటి ఒక్క వ్యక్తిని తను సంపాయించగలడా? పూర్వజన్మ సుకృతం ఏమైనా వుండి, అది ఫలించిం దనుకోవాల్సిందే కాని, ఏ ఇతర అర్థాన్నీ సమన్వయించుకో లేడు.

"రాధాదేవీ! మీరు ఉద్రేకపడకుండా వినండి. నేను అశుభం మాట్లాడుతున్నా ననుకోకండి. కీడెంచి మేలెంచటం మంచిది కదా!....నిజంగానే నాకు కళ్లు రాకుంటే ఏమౌతుంది?"

"ఏమౌతుంది?....ఏమైతే మాత్రమేం? నేను అన్నిటికీ సిద్ధంగానే వున్నాను." అందామె.

"నీవు బాగా ఆలోచించలేదు రాధాదేవీ! నేనంటే నీకు అనురాగం వుండటం వేరు. కాని ఒక అంధుడికి నీ జీవితాన్ని అర్పించటం వేరూను."

"ఈ పోలికలన్నీ నేను చూడలేను. మనిషంటే వుండే ఆపేక్ష, కేవలం ఒక్క అంగలోపం వల్లనే అంతరిస్తుందా?"

"అదికాదు....వొక్క ప్రణయమే జీవితం కాదు గదా! ఉదాహరణకు నేను అంధుణ్నయితే, ఈ ప్రపంచంలో నే నెవరికీ పనికిరానివాణ్ని అవుతాను, అంధ త్వంతో పాటు, నిష్ప్రయోజకత్వం కూడా దాపరిస్తుంది."

"ఆ మాత్రం నేను ఆలోచించ లే దనుకున్నారా?"

"నిజమా? ఆలోచించావా? ఎట్లా సరిపెట్టుకున్నావ్? కళ్ళొస్తే ఐదొందల రూపా యిల ఉద్యోగస్తుణ్ని. లేకుంటే ఎందుకూ పనికిరాని దద్దమ్మను....అంధుణ్నయితే



మన మెలా జీవించగలుగుతాం రాధాదేవీ? నాకు ఇతర ఆస్తిపాస్తు లేమీ లేవు—తెలుసా?''

''రైల్వేవారు కంపెన్సేషన్ ఇస్తారుగా!''

''హాస్యం కాదు రాధాదేవీ!....చెప్పు....ఎలా బతకటం?''

''దాని కింత ఆలోచన ఎందుకండీ? నేను సంపాయించ గలనుగా? ఇప్పుడు నూట ఇరవై రూపాయిల జీతం ఇస్తున్నారు.''

''కాని పెళ్ళిచేసుకుంటే ఈ వుద్యోగం ఊడుతుందిగా?''

''ఎక్కడన్నా ప్రైవేటు హాస్పిటల్లోనో, లేక ఏ డాక్టర్ దగ్గరో జేరుతాను. నేను ఇప్పటి జీతం సంపాయించలేక పోవచ్చు. కాని సంపాయించ గలిగేదాంతో రెండు పొట్టలు పోషించబడవా!''

''మరికొన్ని జీవాలు కూడా రావొచ్చు కదా!''

ఆమె మాట్లాడలేదు. బహుశా సిగ్గుపడిందేమో! తన అంధత్వాన్ని అంగీకరించటమే కాదు; జీవితాంతంవరకూ తనతో పాటుగా భరించటమే కాదు; తాను ప్రత్యేక గౌరవాన్ని చూపగల స్థాయిలో వున్న దామె. ముందు ముందు ఏమైతే నేం. ఇంత మధురమూర్తిని తాను మనోనేత్రంతోనే చూడగలడు; పూజించగలడు.

మనసు చాలా నిశ్చలత్వాన్నీ, ప్రశాంతినీ పొందింది. ఇది వరకల్లే ఉరుకులు పరుగుల్తో పారే నదిలాటిది కాదు; సుస్థిరమైన సరస్సులాటిదైంది. అందుకనే తనకు పూర్వం పరిచయమైన స్త్రీల తాలూకు ప్రతిబింబా లేవీ ఇప్పుడు మనసులో ప్రతిఫ

లించటం లేదు. చెలించే నీళ్ళల్లో పాపం ఏం కనిపిస్తుంది? ఇప్పుడు నిశ్చలంగా వున్న తటాకంలా ఉండటంవల్ల రాధాదేవి ప్రతిబింబం చాలా స్పష్టంగా కలకాలం నిలిచి వుండేట్లుగా ప్రతిఫలిస్తోంది.

అంధుడైతే మాత్రం మేం? చీకట్లో తడువుకుంటూనే ఏమీ శ్రమపడకుండా, తనకు కావలసిన దాన్ని పట్టుకొని, స్వంతం చేసుకోగలిగాడు. తన దురదృష్టంవల్ల రైలు ప్రమాదం జరిగిం దనుకుంటే, దాన్ని అంటిపెట్టుకొనే వున్న అదృష్టం చప్పున యెదురైంది. ఈ ప్రమాదమే జరిగి వుండకపోతే. నిస్సారంగా, అసంతృప్తితో జీవితాన్ని గడపాల్సొచ్చేది. ఎక్కడో వూబిలో ఇరుక్కు పోయి, గట్టినేల తగలక మధనపడే తనమనస్సును, ఈ దేవత పైకిలాగి, ఆకాశానికి ఎత్తింది. ఎంతో వికాసంతో హృదయమంతా నిండింది. స్త్రీని విలాస వస్తువుగా మాత్రమే తన జీవితంలో యెరుగు. కాని ఇప్పుడు స్త్రీత్వం తాలూకు అత్యున్నత ఆశయాలనూ, త్యాగబుద్ధినీ చూస్తే తల తిరిగిపోతోంది.

"రాధాదేవీ!....ఉన్నావా? వెళ్ళిపోయ్యావా?"

"ఉన్నాను "

"నా ప్రశ్నకు జవాబు చెప్పవేం?"

"ఏం చెప్పమంటారు? ఆలోచిస్తున్నాను. జీవితం సముద్రంలాంటిది. ఈ వొడ్డున నిలబడి, అవతలి వొడ్డువైపు చూస్తే ఏం కనిస్తుంది? ముందుకు సాగి పోగా పోగా ఎప్పటికో కాని తీరం కనపడదు కదా!"

"ఎప్పటికీ కనిపించకుంటే.—?"

"నష్ట మేమిటి! అంత పెద్ద జీవితాన్ని ఒక్క చూపులో చూస్తే గుండె బేజారవుతుంది. అందుకని దాన్ని ఖండఖండాలుగా నరుక్కొని చూస్తున్నాం....దీన్నిబట్టి మీ ప్రశ్నకు నేను వేరుగా జవాబీయక్కరలే దనుకుంటాను. ఐనా ఆ సమస్య ఎదురయ్యేందుకు చాలా వ్యవధి వుంది. అప్పుడు చూసుకోవచ్చు."

"రాధాదేవీ! నీలాగు ఇంత సాహసంగా మాట్లాడగలిగే స్త్రీని చూస్తే, పురుషుడు కూడా సిగ్గుపడతాడు. ఇంత ధైర్యాన్ని నీ వెలా సంపాయించ గలిగావో?"

"మరి ఏ ఇతర ఆధారమూ లేనివాళ్ళెలా బతుకుతా రనుకుంటున్నారు? ఈ ధైర్యాన్ని నమ్ముకొనే కదా!"

తాను స్త్రీనుంచి కోరదగిన సద్గుణాలన్నీ ఈమెలో ఉన్నవి. ఖేద జీవితానికీ, మోద జీవితానికీ వున్న సన్నని సరిహద్దులో వున్నప్పుడు, ఈమె తనను రెండోవైపు లాగింది. తన్నుకు స్వర్గంలో పడమంటే ఇదేనేమో?

"రాధాదేవీ! భయపడక్కర్లేదు. నిన్ను మోసం చేస్తున్నానేమో? ప్రణయ బంధంలో నిన్ను సరిగా ఆలోచించనీయకుండా స్వార్థంకోసం పాకులాడేనేమో ననే బాధ కలిగింది. కాని నాది పొరపాటు కాదని తేల్చావు....ఇతర ఆస్థిపాస్తులు లేకున్నా, కళ్ళుపొయ్యే పక్షంలో రైల్వేవారిచ్చే కంపెన్‌సేషన్‌తోపాటు, నేను పనిచేసే కంపెనీ వారుకూడా పెద్దమొత్తమే కంపెన్‌సేషన్‌గా ఇస్తారు; ఎందుకంటే నేను డ్యూటీలో వుండే ఈ ప్రమాదానికి గురయ్యాను. ఆర్థికంగా కేవలం నీ మీదనే ఆధారపడవలసి వుండదు—"

"అప్పుడు మీ రనే మరికొన్ని జీవాల గమనాన్ని గూర్చిన బాధేమిటి? అన్నీ తెలిసే మీరు నన్ను ఆడిస్తున్నారు—ఔనా?" అందామె.

"కాదు... రాధాదేవీ! మొన్న రాత్రి నీతో మొట్టమొదటిసారిగా మాట్లాడినప్పటి నుంచీ నాలాటి మానవుడు కొన్ని యుగాల్లో తన ప్రియురాల్నిగూర్చి ఎంత ఆలోచించగలడో అంత ఆలోచించాను. అదంతా నే నిప్పుడు చెప్పలేను. ఎంత స్పష్టంగా నిన్ను చూడగలుగుతున్నానో, ఈ ప్రపంచంలోని సౌందర్యాన్ని మాత్రమే ఊహించుకొని, అందులో లీనమౌతున్నానో నీకు అర్థమయ్యే భాషలో చెప్పలేను. అలాటి అనుభూతి ఇంకెవరికన్నా, చివరకు నీక్కూడా కలిగివుంటుందని అనుకోను."

"పోనీండి. కొన్ని అనుభూతుల్ని మనం మాటల్లో పెట్టలేం; అవి ఎంతో గొప్పవి. వాటిని అనుభవిస్తేనే కాని తెలుసుకోలేం; తెలుసుకొని వూరుకుంటే సరిపోతుంది. ఇది కారణంగానే ప్రతి జీవికీ ఒక ప్రత్యేకత అనుభవపూర్వకమైనది వుంటోంది....ఇక నా సంగ తంటారా? మీ అనుభవాన్ని మీరు ఎలా చెప్పలేరో, నేనూ అలాగే చెప్పలేని స్థితిలో వున్నాను—"

ఆమె కంఠస్వరం మారింది. అది ఆనందాతిశయంవల్ల రుద్ధమైందో, లేక చెప్పుకోలేని అనుభూతుల తాలూకు తీయని బాధతో తల్లడిల్లుతోందో తెలియలేదు.

ఐదు నిమిషాలపాటు ఎవ్వరూ మాట్లాడలేదు.

"రాధాదేవీ! మీరు చాలా అలసిపోయి వుంటా రనుకుంటాను. నిద్ర రావటం లేదా?"

"మీకు నిద్ర వొస్తోందా?"

"నాకు రాదు."

"నాకూ రాదు."

"ఎందుకని?"

"మీ కారణా లేమిటో, అవే నాకూ సరిపోత వనుకుంటాను" అందామె.

"నేను చిక్కని చీకట్లో ఆలోచిస్తున్నాను. కాని నువ్వు నీ చుట్టూ వున్న ప్రపంచాన్ని చూస్తూ ఆలోచిస్తున్నావు."

"మీ కెలా తెలిసింది? నిజమే.... నేను యీ కిటికీలోంచి చందమామను చూస్తున్నాను. పిండారబోసినట్లున్న వెన్నెల మైదానంలోని పచ్చికమీద పడి మెరుస్తోంది. ఈ చల్లని వెలుగు, యింత ఆహ్లాదకరంగా వుంటుందని నేను ఎన్నడూ అనుకోలేదు—"

జగన్నాథం మాట్లాడలేదు. ఎందుకు మాట్లాడలేదో ఆమె గ్రహించింది.

"క్షమించండి" అందామె. "నేను మిమ్మ గాయపరిచాను. నే నీ ప్రకృతిశోభను వర్ణించి ఉండకూడదు. అది చేయటంవల్ల, మీకు లోపించినదాని విషయం, మీకు జ్ఞాపకం చేశాను."

"కాదు రాధాదేవీ! నాకు కళ్ళు లేకుంటేనేం? నేను నీ కళ్ళలోంచే చూడగలుగుతున్నాను. పుట్టుగుడ్డికి వెన్నెలంటే తెలియదు కాని, వెన్నెలంటే తెలిసినవాడికి, వెన్నెల్నిగూర్చి చాలా తేలిగ్గా చెప్పవచ్చు....నిజానికి యీ చందమామ శోభను చూస్తూనే రాత్రి ఒంటిగంటదాకా నిద్రపట్టక ఆనాడు రైలుపెట్టెలో కిటికీదగ్గర కూర్చున్నాను రాధాదేవీ! ఆ రాత్రి చందమామలోని చల్లదనమంతా నాకు తపనగానే వుంది. నాతోపాటు, రైలువేగంతోపాటే, నా కోసమే నన్నట్టు చందమామ తరుముకుంటూ వచ్చాడు. చివరకు చంద్రాస్తమయ మయ్యాక, చుట్టూ చీకట్లు ఆవరించినవి. నిజంగా ఆ చీకటికి భయపడే పడుకున్నాను. కాని యిప్పుడు చూస్తే ఆ చీకట్లోకూడా ఎంత వెలుగుందో ననిపిస్తోంది. నీవు చూసే చంద్రుణ్ణి నేనుకూడా చూస్తున్నాను. కాని నేను చూడగలిగే ఈ చందమామకు సూర్యునంత వెలుగు, హిమాలయ శిఖరాల మీది చల్లదనం వుంది...." అన్నాడు జగన్నాథం.

"ఐతే అది చందమామ కాదు" అందామె.

"చందమామే! భౌతిక నేత్రాలకు కనిపించేది మాత్రం కాదు; నీవు చందమామను యథాతథంగా చూస్తున్నావ్. కాని కళ్ళతో చూడలేని నేను, ఎన్ని రెట్లు పెంచుకోగలుగుతున్నానో నీవు వూహించలేవు. నీవలా చూసి చెపుతూవుంటే నేను నిజంగానే చూసినదానికన్న ఎక్కువగా వూహించగలను...." అన్నాడు జగన్నాథం.

"పోనీండి. మంచి ఆలోచనల్తో పడుకుంటే పీడకలలన్నా రాకుండా ఉంటవి, మీకు విశ్రాంతి అవసరం. ఇక పడుకుంటారా?"

"నీవు పక్కన వుంటే పీడకల లెందుకు వొస్తాయ్, రాధాదేవీ—"

"మంచిదేగా, ఇక పడుకోండి" అని ఆమె దుప్పటి గొంతుదాకా లాగి, దిచ్చి




కొట్టినట్లు మెల్లిగా పొట్టమీద కొట్టింది

"నేను నిద్రపోతాను....మీరు కాస్సేపు పడుకోండి. మళ్ళీ రేపు పగటి డ్యూటీ కూడా చెయ్యాలి కదా!"

ఆమె మెల్లిగా వెళ్ళిపోయిన అడుగుల చప్పుడు విన్నాడు. ఇక ఆ రాత్రంతా మగతనిద్రలో, మధురమైన తలపుల్తోనే గడిచింది.

## 6

కాలం చాలా విచిత్రమైంది. సంవత్సరాల తరబడిగా ఎటూ తేల్చుకోలేకుండా, గమ్యస్థానం లేకుండా గడిపే జీవితానికి, ఒక్కసారిగా, ఒక్కక్షణంలోనే ఎంతో గొప్ప మార్పు, ఎన్నడూ వూహించనిది సంభవిస్తూ వుంటుంది. కొన్ని సమస్యల్ని కాలమే తీర్చుకోగలదనే నమ్మకం. ఇలాటి ప్రమాదాల్లోనే బైటపడుతూ వుంటుంది.

తలచుకుంటే ఆశ్చర్యంగా వుంటుంది. కాని, తను ఎంత తేలిగ్గా, ఎంత ఉన్నతాశయంతో, హృదయపూర్వకంగా రాధాదేవిని ప్రేమించి, ప్రేమించబడగలిగాడో, తను జీవితంలో గుడ్డిగా వెతుక్కుంటూ పోతున్న తీగె దానంతటదే కాలికి తగిలినట్లయిందో, తనింతకన్న కోరదగింది మరేమీ లేదన్న తృప్తి, జీవిత సాఫల్యతను పొందగలిగిన గర్వం తనను ఆవరించటంలో వింతేమిటి?

ఇసుకనేల దొరికితేనే మానవుని ఊహాసౌధాలు ఆకాశాన్ని అంటగలవు; అలా

టిది తనకు రాతి నెలె దొరికింది. ఇక తన ఊహలు ఆకాశపుటంచుల్ని దాటి ఎంత దూరం పోతున్నవో చూసే తీరికకూడా లేదు. రాధాదేవి సాన్నిధ్యంలో తను గడప బోయ్యే జీవితం, పొందబోయ్యే స్వర్గ సౌఖ్యాల్ని గూర్చిన వలపుల తాలూకు మాధు ర్యమే చాలు నిరాశతో యెండి మోడైన తన హృదయాన్ని చిగురింపజేసి, పుష్పించి, ఊడలు కూడా దింపుకునే స్థితికి దిగేందుకు. ఆ జీవితంలో కన్నులు కనిపించకపోవట మనేది చాలా స్వల్ప విషయంగానే తోచింది. ఒక నిరాశను, ఒక ఆశ ఏ విధంగా దిగమింగి, ప్రాముఖ్యతను వహించగలదో అర్థమైంది.

మర్నాడు పదిగంటలకు రాధాదేవి డాక్టర్ని వెంటబెట్టుకొని వచ్చింది. డాక్టర్ అంతా పరీక్షచేసి, తలకు కట్టిన కట్లు విప్పాడు. కిరీటం పోగానే తలమీద పర్వతపు బరువు మాయమైనట్లయింది. మళ్ళీ డ్రెస్ చేస్తారేమోనని భయం వేసింది కాని, ఆ అవసరం లేదన్నాక మనస్సు స్థిమిత పడింది.

''రోగిని కాస్త దూరం నడిపించటం మంచి దంటారా?'' అంది రాధాదేవి. ఏదో అడగటం మరిచిపోయి, అదేదో గుర్తురాక తన్నుకుంటూన్న తనను రక్షించిం దామె.

''తప్పకుండా....ఈ గదిలో నడిపిస్తూ వుండు'' అన్నాడు డాక్టర్.

డాక్టర్ పోతూ పోతూ ''పాపం! కళ్ళు కూడా వస్తే బాగుండు!'' అన్నాడు రాధాదేవితో.

తన కళ్ళ విషయంలో తాను పడని ఆవేదనంతా తన చుట్టూవున్న వాళ్ళు, విశే షించి రాధాదేవి, తనను మనస్ఫూర్తిగా ప్రేమించిన కారణం కావొచ్చు ...కాదు.... తను ఆమెకు రోగిగా వున్నప్పుడుకూడా ఆమె తనపట్ల యెంతో సానుభూతి చూపింది. ఇక ఈ డాక్టర్ కూడా తనమీద యెంతో దయను వర్షిస్తున్నాడు. మానవత్వపు ఔన్నత్యం ఒకపక్క చూడగలుగుతున్నాడు తాను. మరోపక్క జానకి లాటి నర్స్ చూపే నిర్లక్ష్యతను చూసి, మానవత్వంలోని నైచ్యాన్ని చూడగలుగుతున్నాడు. ఈ మనుషుల్లో ఎన్ని రకాలు! ఎన్ని జాతులు! ఎన్ని విభిన్న ప్రకృతులు!

కాస్సేపట్లోనే రాధాదేవి తిరిగి వచ్చింది.

''ఇప్పుడు మీకు కాస్త హాయిగా వుందనుకుంటాను'' అందామె.

భావిజీవితంలోని సుఖాన్ని తలుచుకుంటూండగా, మధ్యలో ఎదురయ్యే యీ బుల్లి బుల్లి సౌఖ్యాలు నిజానికి తనకు లెక్కలోకి రావటం లేదు

''బాగానే వుంది రాధాదేవీ! నా కృతజ్ఞతను మీకు ఎలా తెలియపరచాలో అర్థం కాకుండా వుంది.''

"నన్ను 'మీరు' అంటున్నారేమిటి? రాత్రేమో 'నీవు' అన్నారు, ఇప్పుడు బహు వచనంలోకి మార్చారు. ఎందుకని?"

"రాత్రి 'నీవు' అన్నానా? నాకు బాగా జ్ఞాపకం లేదు....'మీరు' అనటం అమర్యాద సూచకం కాదుగా?"

"పోనిద్దురూ! నన్ను ఏకవచనంలోనే మాట్లాడండి. అదే బాగుంటుంది."

తనకూ అదే బాగుంటుంది నిజానికి. ఎందుకంటే యీ ఏకవచన ప్రయోగంవల్ల ఆమె తనకు చాలా దగ్గరవుతుందన్న సంగతి క్షణ క్షణమూ హెచ్చరించబడుతూ వుంటుంది. అసలు స్త్రీ కలకాలంగా పురుషునికి లొంగిపోతూ, పురుషుని సేవలోనే తన్మయత్వం పొందుతోంది. ఇది ఆ జాతి ప్రకృతో, లేక ప్రపంచ విధానంలో ఆమె అలవరుచుకున్న తత్వమో తెలియదు. ఏదైతేనేం—రాధాదేవి కోరిక ప్రకారమే నడుచుకునేందుకు పేచీ పెట్టలేక పొయ్యాడు.

"రాధాదేవీ! మూడు రోజులుగా స్నానం చెయ్యకుంటే చాలా చిరాగ్గావుంది" అన్నాడు.

"ఇప్పుడు స్నానమెలా చేస్తారు?....సబ్బునీళ్ళుపెట్టి వొళ్ళు తుడుస్తాను."

"సరే."

ఆమె గోరువెచ్చని సబ్బు నీటితో వొళ్ళంతా తుడిచింది. దాదాపు స్నానం చేసినంత హాయిగా వుంది.

"నన్ను కాస్త నడిపించవా?"

"ఇప్పుడేనా?....భోజనంచేశాక నడుద్దురు కాని."

"సరే—"

భోజనమయ్యాక, తను నడవాల్సిన సంగతి ఆమెకు మరోసారి హెచ్చరించవలసి వుంటుందేమో ననుకున్నాడు జగన్నాధం. కాని ఆమె "ఇప్పుడే వచ్చి మిమ్మి నడిపిస్తాను" అన్నాక, తనపట్ల ఆమె ఎంత శ్రద్ధ చూపుతోందో మరోసారి అర్థమైంది.

పది నిమిషాలు గడిచాక ఆమె వచ్చింది.

"ముందు సరిగా కూర్చోండి" అని అతన్ని కూర్చోపెట్టి కాళ్ళు నేలమీద పెట్టేట్లు చేసింది.

"మీరు నడవటం నేర్చుకోనక్కర లేదు. అది మరిచిపొయ్యారు అనుకోకండి. మూడు రోజులకే ఎవ్వరూ మరిచిపోలేరు" అని అతని చెయ్యి పట్టుకుని "నిలబడండి" అందామె.

జగన్నాధం లేచి నిలబడి, కావాలని ఆమె భుజం మీద చెయ్యి వేశాడు. ఆమె ఒక్క-క్షణం వణికింది. అదేదో తనకు యిష్టంలేని పని అని సూచించబోయి, పోనీ లెమ్మని వూరుకున్నట్లు తోచింది. ఆమె తన చెవులదాకా వస్తుందనుకున్నాడు జగన్నాధం. నిజంగానే యీ ఎత్తు మనుషులంటే తనకెంతో యిష్టం!

సానుభూతి చూపే వారున్నప్పుడు కష్టాల్ని భరించటం అంత కష్టం కాదు. ఉన్న యిబ్బందిని ద్విగుణీకృతం చేసుకోవటం కూడా జరుగుతుంది; ఇందువల్ల ప్రతిఫలం కూడా రెండింత లవుతుంది కనుక! జగన్నాధం యిప్పుడు యీ పద్ధతినే అనుసరిస్తున్నాడు.

ఆమె భుజంమీద చెయ్యి తియ్యకుండానే మెల్లిగా నడక సాగించాడు. ఈ గుడ్డివాడి ఆట చూసి, మిగతా ముగ్గురు రోగులూ నవ్వుతున్నారు ఇంకో సందర్భంలో ఐతే ఆ రోగుల మీద కోపం వచ్చేదేమో కాని, వాళ్ళ నవ్వు తన ఆనందాన్ని పెంచ గలిగిందిప్పుడు. ఆమె కిటికీ దగ్గిరికి తీసుకెళ్ళింది. చేతితో తడివి కిటికీ అని తెలుసుకున్నాను.

"మురుక్కాలవ అదే కదూ?" అన్నాడు వేలితో చూపుతూ.

"ఆఁ. మీ కెలా తెలిసిందీ?" అందామె ఆశ్చర్యంతో.

"తెలుసుకున్నాను రాధాదేవీ! మీరు చూడగలిగే దంతా, నేనూ మీ కళ్లు ఆధారంగా చూడగలను." అన్నాడు.

"మీకు తప్పకుండా కళ్ళు వొస్తవి....తప్పకుండా!" అందామె.

కారణం అడగలేదు జగన్నాధం. ఒక వ్యక్తి గాఢంగా నమ్మగలిగే విషయానికి కారణం వుండక్కర్లేదనీ, అకారణం గానే ఆ వ్యక్తి నమ్మగలుగుతూన్న సంగతి ఆ వ్యక్తికీ తెలుసుననే విషయం తనకు కొత్తకాదు. ఆ నమ్మకాన్ని చెడ గొట్టేందుకు ప్రయత్నించటం అమానుష మనిపించింది.

కాస్సేపు కిటికీ దగ్గిర నిలబడ్డాక "ఇక వెళ్దామా?" అందామె.

"ఆఁ, ఆఁ, వెళ్దాం" అని చెయ్యి జాపాడు, ఆమె తన భుజాన్ని చేతి కిందికి జేరుస్తుందనే ఆశతో. కాని ఆమె తన చేతిని ఆసరాగా అందించింది.

"కాస్త దగ్గిరికి రాకూడదా రాధాదేవీ?" అన్నాడు రహస్యం మాట్లాడుతూన్నట్లు.

"మీ చిలిపి వేషాలు నాకు తెలుసు. వాళ్ళందరూ చూసి నవ్వుతున్నారు—" అందామె మెల్లిగా.

"నాకూ వినిపించింది....కాని మీ రోగుల్ని కాస్త సంతోషంగా వుంచాలి కదా!"

"అందుకని—?"




"నా సంగతి కాదు రాధాదేవీ! మిగతా ముగ్గురు రోగుల్నీ నవ్విస్తే బాగుంటుంది."

రాధాదేవి పగలబడి నవ్వింది.

"పాపం! ఎంత పరోపకార బుద్ధి! సరే—నవ్వించండి—కాని మీ బరువంతా నా మీద వెయ్యకండేం?" అని ఆమె అతనికి దగ్గిరిగా జరిగింది. ఈ సమయం కోసమే కాచుకొని కూర్చున్న జగన్నాధం, యీసారి రెండు చేతుల్నీ ఆమె రెండు భుజాలమీదా వేశాడు.

"చూశారా—అలుపిస్తే!" అందామె.

"నడు—ఉప్పుప్పు గోనె...."

"ఊరుకోండి....వాళ్ళంతా వింటారు."

ఆమె ముందూ, గుడ్డివాడు వెనకా నడక సాగించారు. ఆ గది అందరి నవ్వులతోనూ మారుమోగింది. ఆ కాస్సేపూ ఆ ఆసుపత్రి స్వర్గమా అనిపించింది.

సాయింత్రం దాకా మధుర స్వప్నాల్లో కొట్టుకొని పొయ్యాడు. సూర్యాస్తమయమయాక రాధాదేవి వొచ్చి "నా డ్యూటీ ఐపోయింది. నేను వెళ్ళొస్తాను మరి....మళ్ళీ రేపు ఉదయం దర్శనం చేసుకుంటాను." అంది.

ఈమె వెళ్ళటంకన్న జానకి వొస్తుందనే బాధ ఎక్కువయింది జగన్నాధానికి. ఈ విధంగా యీ వారమంతా గడపాలి—తప్పదు.

"ఏం వెళ్ళిరానా?"

"జానకి వస్తుంది కదూ?"

"ఔను...."

"ఆమె అంటే నాకు యిష్టంలేదు రాధాదేవీ!" అన్నాడు, వుండబట్టలేక.

"ఏం? ఆమె మంచిదేనే! మిమ్మ ఏమన్నా అన్నదా? పోనీ నే నామెకు చెప్తాను." అంది రాధాదేవి.

"నన్నేమీ అనలేదు. నీ వేం చెప్పకు. నా అవస్థ నేను పడతాను."

తన చేతిని తాకుతూ "ఏమన్నా అన్నదా? చెప్పండి. ఆమె నాకు స్నేహితురాలే! మిమ్మ జాగ్రత్తగా చూడమని బతిమాలుకుంటాను." అందామె.

ఏదో మాటవరస కన్నది ఇంతదూరం పోతుం దనుకోలేదు తను. ఏం చెప్పగలడు? తన నేం చేసిందనీ? రాధాదేవి ఎంత సహృదయ కాకుంటే, సూటీపోటీగా కారం రాస్తునట్లు మాట్లాడే జానకిని కూడా స్నేహితురాలుగా చూడగలుగుతోంది!

"ఊరికనే.... నువ్వేమంటావో అని అన్నాను. అంతే!.... నిజంగా.... అంతే!"

ఇంతలో జానకి వచ్చినట్లుంది.

"హల్లో! రాధాదేవీ! గుడ్‌మార్నింగ్! ఎట్లా వున్నారు మీ పేషెంట్?"

రాధాదేవి షాక్ తగిలినట్లు చప్పున తన చేతిని జగన్నాధం చేతిమీది నుంచి వెనక్కి లాక్కుంది.

"బాగానే వున్నారు. జానకీదేవీ! వీరిని కాస్త కనిపెట్టి ఉండు."

"ఏం సీరియస్ కేస్ ఐందా?"

"నీ కెప్పుడూ ఎగతాళే! ఆయన నడుస్తున్నారు కూడాను—'

"ఇంకేం—రేపటినుంచీ పరుగెత్తుతారు కూడాను. మిస్టర్! చాలా యింప్రువ్ అయారు.... మీకేం భయంలేదు లెండి!"

జగన్నాధానికి యీ సంభాషణ బొత్తిగా యిష్టంలేదు. తనకూ, రాధాదేవికీ మధ్య వున్న రహస్యం యితరులకు ముఖ్యంగా జానకికి తెలియకుండా ఉండాలి. ఇందువల్ల తన ఆనందాన్ని యితర్లు పంచుకుంటారనే భయం కూడా ఉంది.

"సరే—నేను ఒస్తాను మరి! ఏమండీ!—వెళ్ళిరానా? గుడ్ యీవినింగ్ జానకీ!"

"గుడ్ యీవినింగ్!"

అడుగుల చప్పుడు దూరమైంది.

ఇక యీ రాత్రి జానకి సమక్షంలో గడపక తప్పదు. ఇప్పుడు గుర్తొస్తోంది—యీమె ద్వారా రాధాదేవి సంగతులు తెలుసుకోవచ్చనే విషయం. దీనికి ఒక పథకాన్ని తయారు చేసుకున్నాడు. రాధాదేవితో నడపిన ప్రణయం లాటిదే యీమెతో కూడా

నడిపిచూస్తే అసలు రంగు బైట పడుతుంది. ఇది మంచి ఉపాయమే. ఒకవేళ యీ జానకి ప్రణయాన్ని నిరాకరించినా బాధలేదు. ఎందుకంటే యిదంతా కేవలం వినోదం కోసమే కాని 'సీరియస్'గా కాదాయె. అదీగాక తన హృదయం రాధాదేవికి గతరాత్రే శాశ్వతంగా అంకితమైపోయింది. ఈ నిశ్చయంతో అతను తగిన సమయం కోసం ఎదురుచూడ సాగాడు.

# 7

వాతావరణం చాలా ప్రశాంతంగా ఉంది. గదిలోకి సన్నగా, హాయిగా చల్లగా గాలి ప్రవహిస్తోంది. మిగతా రోగు లందరూ నిద్రపోతూవుంటారు. ఏదో ఒక వంకతో జానకిని పిలిచి, కాలక్షేపం చేయటాని కిది తగిన సమయంగా తోచింది అతనికి.

"జానకీదేవిగారూ!" అన్నాడు.

అడుగుల చప్పుడే జవాబైంది.

"ఏమండీ—ఏం కావాలి?"

వస్తూనే ఎగిరెగిరి పడుతుందేమిటి? కంఠస్వరంలో కాఠిన్యం తప్ప కరుణ కనిపించదేం? అసలు యిలాటి మొండిఘటాల్ని లొంగతీసుకోవటంలోనే చాక చక్యం కావాలి. ఈమె నొక విషమ పరీక్షగా భావించుకొని, ఎలాగైనా నెగ్గి, ఆత్మ తృప్తి పొందాలనే పట్టుదల కూడా హెచ్చింది—జగన్నాథానికి.

"ఏం లేదు. మీరు కాస్త తీరిగ్గా ఉన్నారేమో అడుగుదామని...."

"ఆఁ. తీరికే—" అందామె.

"వాతావరణం బాగుంది కదూ?"

"ఏం బాగులెండి; బైట వెన్నెలన్నా లేదు. దూరాన గుడ్లగూబలు గానం చేస్తున్నయ్. కింద కీచురాళ్ళ ధ్వని—"

"గాలి బాగున్నట్లున్నది?"

"ఆఁ, బాగానేవుంది."

"మీకు అభ్యంతరం లేకుంటే నన్ను కాస్త ఆ కిటికీదాకా నడిపిస్తారా!"

"ఇప్పుడా?....సరే....లేచి కూర్చోండి."

కూర్చున్న తర్వాత ఆమె చెయ్యి అందించింది. మాట కఠినంగావున్నా, చెయ్యి చాలా మృదువుగా ఉంది. ఆమె చేతిని పట్టుకోగానే, ఆమెలో ప్రవహించే విద్యుత్

స్పష్టంగా తెలుస్తోంది. లేచి నిలబడి ఆమె భుజంమీద చెయ్యి వేశాడు. ఆమె శరీరపు జలదరింపుతోపాటు, చిరాకును ధ్వనింప జేసే కంఠస్వరంతో అంది :

"ఏమండోయ్! భలేగా అలుసు తీసుకుంటున్నారే! భుజంమీద చెయ్యి వేశారు—యిదేం మర్యాదండీ?"

ఇంకెవరయినా అయితే వెంటనే చెయ్యి లాగేసి, తన పొరపాటుకు క్షమార్పణ చెప్పుకొనే వారేమోకాని, కామినీ హృదయం అనుభవపూర్వకంగా తెలిసిన జగన్నాధం తొణకలేదు. ఆ సమయంలో చెయ్యి తీసేస్తే తను కావాలనే, తెలిసివుండే చేయరాని పని చేసినట్లు ఒప్పుకోవటమౌతుంది. అందుకని చేతిని యింకా స్త గట్టిగా నొక్కుతూ "జానకీదేవీ! నాకు కనిపించదనేమాట మరిచిపొయ్యారా? కాస్త ఆధారంగా వుంటారు కదా అని భుజంమీద చెయ్యివేశాను, అంతేకాని వేరే ఉద్దేశంతో కాదు." అన్నాడు.

ఆమె ఒక్కక్షణం మెదలకుండా వూరుకోని, ఆ తరువాత తగ్గుస్థాయిలో "అది కాదండీ! ఎవరన్నా చూస్తే ఏమనుకుంటారు?" అంది.

ఎవరి మాటో దేవుడి కెరుక! ఈమె ఏమనుకుంటోందో స్ఫటికమంత స్పష్టంగా తెలుస్తూనే ఉంది

"ఆc, ఎవరున్నా రిక్కడ? అందరూ నిద్దర్లు పోతున్నారాయె...." అన్నాడు నిర్లక్ష్యంగా.

ఈ దెబ్బతో ఆమెతో ఒక్కసారిగా రాజీ కుదిరిపోయినట్లయింది. ఒకళ్ళు నేరస్థులుగా చేయాలని బయలుదేరి, తమ నేరాలకు ఒకదాని కొకటి చెల్లు వేసుకున్నారు!

"సరే నడవండి."

ఆమె ముందూ, హాయిగా వూతంగా ఉన్న ఆమె భుజం పట్టుకొని అతను వెనుకా నడవసాగారు. ఒక్కోసారి ఒకో గొప్ప యిబ్బంది కూడా చాలా సానుకూలంగా ఉంటుంది. ఇప్పుడు జగన్నాధం గుడ్డితనమే అతనికి అనేక అవకాశాల్ని ఏర్పి కూర్చింది. చూస్తూ చూస్తూ చేయలేని పనుల్ని, చూడకుండా తేలిగ్గా చేయగలుగు తున్నాడు.

కిటికీ దగ్గిరికి వెళ్ళాక "నా కేమీ కనిపించటం లేదు జానకీదేవీ! బైట ఏమున్నదో మీరు చెపితే...." అన్నాడు. ఒకచేత్తో నున్నగా గుండ్రంగా ఉన్న ఆమె భుజాన్ని వాటంగా అదిమి పట్టాడు.

"ముందు నా భుజం మీది చెయ్యి తియ్యండి. మీ బరువంతా నా మీదే వేస్తున్నారు." అందామె.




ఇక లాభం లేదనుకొని "సారీ!" అని చేతిని లాక్కున్నాడు జగన్నాథం. "బైటి వాతావరణాన్ని కాస్త వర్ణిద్దురూ" అన్నాడు, వేడికోలు ధ్వనింపజేస్తూ.

"ఇందాకనే చెప్పానుగా! అయినా ఏముంది వర్ణనకు? మిణుకు మిణుకుమనే నక్షత్రాలు మాత్రం తొంగి చూస్తున్నవి. ఈ చిమ్మ చీకటిలో మరేమీ కనిపించటం లేదు."

"ఏమో—నాకు కనిపించే దృశ్యాన్ని వర్ణించేదా?"

"మీ కసలు ఏమన్నా కనిపిస్తోంది కనుకనా?"

"అదేమిటి జానకీదేవీ! నాకు దృష్టి లేకుంటేనేం—మనోనేత్రంతో అంతా చూడ గలుగుతున్నాను."

"ఓ! కలలు కంటున్నారా?"

"మీకు విసుగు లేకుంటే చెపుతాను జానకీదేవీ!"

"చెప్పండి....అంతకన్న చేసే పని లేదు."

మూడ్‌లోకి పడేందుకన్నట్లు గట్టిగా వూపిరి లాగాడు; ఆ తరువాత పెద్దగా నిట్టూర్చాడు.

"ఏమిటి—మొదట్లోనే నిట్టూర్పులా?" అందామె ముసిముసిగా నవ్వుతూ.

"వినండి: సుందరమైన పుష్పవనం. ఎన్నిరకాల పూల చెట్లు! వింత వింత రంగుల పూలు. ఎన్ని రకాల వాసనలు. ఇన్ని వాసనల కసలు పేర్లు వుంటయ్యా? ఈ వాసనలన్నీ మత్తెక్కిస్తూన్నవి. పైనుంచి నిండు చంద్రుడు వెన్నెలను తీగెలు తీగెలుగా జారుస్తూ, ప్రతి వస్తువునూ ఆక్రమిస్తున్నాడు. రకరకాల పక్షులు ఆనందంతో పాటలు పాడుతూన్నవి ఒకపక్క నెమళ్ళు పురులు విప్పి నాట్యమాడుతూన్నవి. తోట మధ్యనుంచి పారే సెలయేటి సంగీతం వీనులకు విందుగా వుంది. నీటిమీద పడే వెన్నెల గలగలమని నీటితోపాటే ప్రవహిస్తూ వుంది."

"ఆ తరువాత నన్ను చెప్పనీండి....ఆ సెలయేటి ఒడ్డున మీరు కూర్చునివున్నారు. చెట్ల గుబుర్లలోనుంచి, ఆ దేవకన్య వస్తోంది."

"మీ కెలా తెలిసిందీ?"

"కళ్లు కనిపించని మీకే కనిపించగాలేంది, నాకు కనిపించదా?"

ఈమె మాటలు నిజంగానే తనను గాయపరిచినవి; కాని తనూ ఆనందిస్తూన్నట్లు నటిస్తేనే కాని లాభంలేదని తెలుసు.

"కాదు జానకీదేవీ! ఆ దేవకన్య నా పక్కనే వుంది!" అని ఆమెను గట్టిగా పట్టుకున్నాడు, జగన్నాథం.

"బాగానే వుంది నాటకం!" అందామె, పట్టు విడిపించుకునే ప్రయత్నం చేయకుండా. "కథల్లో మాదిరే సంభాషణ నడిపించి ఆడపిల్లల్ని వలలో వేసుకోవాలని చూస్తున్నారా? బాబూ! మీ కలలకూ, మీకూ ఒక సలాం. నన్నింక వదలండి."

"కల ఐపోయింది. మిగతా దృశ్యమంతా కరిగిపోయింది. కాని దేవకన్య మాత్రం చేతులకు చిక్కింది" అని ఆమెను దగ్గరికి లాక్కునేందుకు ప్రయత్నించాడు.

ఆమె చాకచక్యంతో పట్టు విడిపించుకొని "మీకు అనుకూలంగా యీ కలలు ఎలా వస్తవి?....మీ మాటల తీరూ, ఆడపిల్లల్తో మాట్లాడే ధోరణీ చూసి మొదట్లోనే అనుమానించాను. అందుకనే కాస్త దూరాన వుంచాను. ఇప్పుడు మీ అసలు రంగు బైటపడింది!" అంది.

"మీరు చాలా తెలివిగలవాళ్ళు జానకీదేవీ! నేను ఎలాటివాణ్ణయినప్పటికీ, నన్ను చూడగానే నిజంగా అర్థం చేసుకోగలిగింది మీరే! మీకు ధన్యవాదాలు."

"చాల్లెద్దురూ! మెల్లిగా పొగడటం, దగ్గిరికి జేరదియ్యటం, యీ నటనా అదీ, ఎవరికి తెలియదు?"

ఇలాటి సంఘటనలే మరికొన్ని ఈమె జీవితంలో ఉండివుంట వనుకున్నాడు జగన్నాథం. ఐతేనేం, స్త్రీ ఎన్నిసార్లు పొరబడినా, పురుషుని టోపీలో పడేందుకు మళ్ళీ

సిద్ధంగా వుంటుందనే విషయం సృష్ట్యాదినుంచీ అనేకసార్లు రుజూ అయే వుంది.

"మీరు పొరబడ్డారు జానకీదేవీ!.... మొదటినుంచీ మీరంటే నాకు తగని అభిమానం ఏర్పడింది. కారణం అడగకండి, నాకే తెలియదు...."

"రాధాదేవి కూడాను. ఇలా ఎంతమందిమీద మీ అభిమానం విస్తరించిందో చెప్పండి."

"రాధాదేవా? ఈ సమయంలో ఆమె పేరు ఎందుకు ఎత్తారు? కాకపోతే యీ ఆసుపత్రిలో నాకు మొదట పరిచయమైంది ఆమె. ఆమె ఎంత సానుభూతిగా నన్ను చూసినప్పటికీ, ఆమె అంటే నాకు ఇష్టం కలగటం లేదు—నిజం."

"ఏం—ఎందుకనీ? మొదటిరోజునుంచే రాధనుగూర్చి కలవరిస్తున్నారుగా?"

"కారణం నేను చెప్పలేను జానకీదేవీ! నది సముద్రంలోకి ప్రవహించినంత స్వభావసిద్ధంగా నా హృదయం మీ మీదకే ప్రసరిస్తోంది."

"దాన్ని కాస్త ఆపండి....ఎన్ని రకాలుగా మాట్లాడటమైనా మొగాళ్ళకే చెల్లుతుంది" అందామె.

"అదేమిటి జానకీదేవీ! నేనెంతో సీరియస్‌గా మాట్లాడుతున్నాను. నేను మిమ్మల్ని ఎంత స్పష్టంగా చూడగలుగుతున్నానో తెలుసా? మీ ఎత్తు—"

"భుజాలు పట్టుకున్నప్పుడే తెలిసి వుంటుంది!"

"ఆరోగ్యంతో మెరిసే మీ శరీరం—"

"తాకి చూసి తెలుసుకున్నారు!"

"మీకంతా ఎగతాళిగా వుంది. మీ దివ్యమంగళ స్వరూపాన్ని తలుచుకుంటే...."

"తలుచుకోకండి, రంభా ఊర్వశుల్ని మించిన అందాలరాణి రాధాదేవిని తలుచుకోండి!" అందామె వెటకారంగా.

"మాట్లాడుతే ఆమె సంగతి ఎందుకంట?....ఆమె!" అని హేళనగా నవ్వి. "మధ్యాహ్నం నన్ను నడిపించినప్పుడు, భుజంమీద చేతులు వేశాను" అన్నాడు.

"వేశారూ? ఆడపిల్లలంటే ఇంత సమదృష్టి వున్నవాళ్ళను నేనింకెవర్నీ చూడలేదు." ఆమె కంఠంలోని ప్రణయ కోపపు వేడి జగన్నాథానికి తగులుతూనే వుంది.

"తమాషాకు! నీకు అప్పుడే కోపం వొచ్చింది. ఈర్ష్య వున్నదంటే, ప్రణయం కూడా వున్నదనే అర్థం!"

"ఈ అర్థాలు నాకు తెలియవు. పక్కమీదికి దయచేస్తారా?"

"జానకీ! అంతా విను మరి—" ఏక వచనంలోకి దిగిన సంగతి తెలుసు తనకు... "ఆఁ, ఇందాక ఆమె భుజంమీద చేతులు వేశానా? బొమికలు తగిలినయ్యంటే నమ్ము!

ఛీ! అదేం మనిషి? సన్నగా పీరల్లే ఎగురుకుంటూ—ఇంకా నయం, కళ్ళున్నట్లయితే ఆమెను చూడాల్సి వొచ్చేది కదానని విచారించాను....కాని నిన్ను చూడలేకపోతున్నాననే విచారంకూడా కలిగింది.''

''అయ్యో! నన్ను చూసినా, చూడకున్నా యీ నాటకానికి ఇంక తెర దించుతే బాగుంటుంది. మేము మా మర్యాదనూ, మీరు మీ మర్యాదనూ కాపాడుకోవటం మంచిది'' అందామె.

''జానకీ! మర్యాదలు చెడే విషయాలు నేనేం మాట్లాడాననీ?....నీ కేమన్నా కష్టం కలిగిస్తే క్షమించు'' అని చేతులు జాచాడు, జగన్నాథం.

ఈ చిటకా బాగా పనిచేసింది. జాపిన చేతుల్ని తన చేతుల్లోకి తీసుకొని ఆమె మెల్లిగా రాచింది. తను క్షమించబడటమే గాక, ఆమెకు చాలా దగ్గిర అవగలిగానని కూడా జగన్నాథం గ్రహించాడు.

''అలాటి మాటలనకండి....మీరేం తప్పుచేశారని క్షమించేందుకు?'' అని ఆమె గోముగా అతని చేతివేళ్ళల్లో తనవేళ్లు దూర్చింది. తప్పించుకుంటూ, అందకుండా పరుగెడుతూన్న లేడి చప్పున ఆగి, వేటగాడి కాళ్ళముందు మోకరిల్లినట్లయింది.

''ఎంత చిలిపి పిల్లవు జానకీ! అంతలోనే కోపం, అంతలోనే ప్రసన్నత! నీలాంటి అల్లరిపిల్లను చూస్తే....''

''చూడలేరుగా! చూసినా, ఏం చెయ్యాలని వుంటుందో నాకు తెలుసు కనుక, మీరు చెప్పనకర్లేదు....ఇక నిద్రపోరాదా?''

''నీకు విసుగెత్తిస్తున్నానా?''

''నాకోసం కాదు....మీ ఆరోగ్యం చెడుతుందేమోనని'' అందామె.

''దానికేం. పగలంతా విశ్రాంతే కదా. నీలాటి నర్స్ పక్కన వుంటే రోగాలు వేధించవు—జానకీ! నీవెంత మంచిదానివి!''

''మీ రాధాదేవి కన్నా?''

''రాధ ప్రేమలో నేను పడిపొయ్యానని భ్రమిస్తున్నావ్—అంతే. ఆమె అంటే నాకు బొత్తిగా ఇష్టంలేదు—నిజం! నా మాట నమ్ము.''

''సరే—నమ్మాను లెండి.''

''జానకీ! నా ప్రణయాన్ని నిరాకరిస్తావేమోనని ఎంతో భయంవేసింది. కాని-''

ఆమె చప్పున తన చేతిని లాక్కుంటూ ''చూశారా! ఆడది లొంగినట్లు కనిపిస్తే చాలు, ఇక ఏం మాటాడేందుకైనా మొగాడు వెనుకాడడు'' అంది.

''నే నేమన్నాను? ఏం చేశాను? క్షణంలో ఇలా మారుతుంటా వేమిటి?''




"ఏం అనబోతున్నారో నాకు తెలుసులెండి. ఐనా యీ ప్రణయంతో అయే దేమిటి?"

"ఏం యీ ప్రమాదానికి గురి కాక పూర్వం నేను ఎన్నడూ పెళ్ళినిగూర్చి ఆలోచించలేదు. కాని తీరా మంచాన పడ్డాక, చేసుకున్న భార్య వుంటే ఎంత సేవచేసేదో, ప్రేమలో యెంత సుఖాన్ని అనుభవించేవాణ్నో అనుకోసాగాను. అలాటి సమయంలో నీవు దొరికావు—"

"చేసుకున్న భార్యకన్న ఎక్కువ సేవ చేస్తున్నానుకదా ననుకున్నారు-అంతేనా?"

"కాదు జానకీ! ఐనా మనుషుల ఉద్దేశ్యాలకు అంత తేలిగ్గా, నీ ఉద్దేశ్యాలను అంటగడతా వెందుకు? నేను అనుకున్నాను; నీలాటి భార్యవుంటే—"

మాట పూర్తిగాకుండానే ఆమె అంది! "బాగానే వుంది వరస. క్షణాల్లో మీరు యెంత వూహించారో!—ఐనా నేను మీ ప్రణయాన్ని స్వీకరించా ననుకోకండి."

"అనుకో నక్కర్లేదు. నీ ధోరణి అర్థమౌతూనే వుంది, జానకీ! నేనేం బీద వాణ్ణి కాదు. భాగ్యవంతుల్లోనే జమ. ఈ దృష్టి రానీ, రాకుండనీ, మనిద్దరం హాయిగా బతకగలం. నీ వీ వెధవ ఉద్యోగం చెయ్యనక్కర్లేదు. అద్దమైన వాళ్ళకూ చాకిరీ చెయ్యక్కర్లేదు—బాగా ఆలోచించు," అన్నాడు జగన్నాధం.

కాస్సేపు ఎవ్వరూ మాట్లాడలేదు. బహుశా ఆమె ఆలోచనలో పడివుంటుందను కున్నాడు, జగన్నాధం. ఈ ఆడపిల్లలు పైకి యెంత కఠినంగా కనిపిస్తారో, లోపల

అంత మృదువుగా వుండి, క్షణంలో దిగజారిపోతారేమిటో?

ఆమె అంది; "ఇప్పుడు ఆలోచించేదేమీ లేదు. మీ కట్టు విప్పాక కాని నేనేం చెప్పలేను."

"అంటే?"

"అంటే ఆంధుడికి భార్యగా వుండలేను—మీరు కోపగించుకోకండి. యెంత వుంటేనేం, సుఖం లేనప్పుడు—మీ కట్లు విప్పేవరకూ, మళ్ళీ మీరీ ప్రణయం సంగతి ఎత్తకండి. నేను అప్పుడు నా నిర్ణయాన్ని చెపుతాను" అందామె.

ఆమె వుద్దేశం జగన్నాధానికి పూర్తిగా అర్థమైంది. తనకు కళ్ళు వాస్తే తను కావాలి; లేకుంటే అక్కర్లేదు. మనిషి విలువల్ని తూచేందుకు, మంచి ఐతే ఏరుకొని, చెడు ఐతే విసిరిపారేసేందుకు యీామె తన సంసిద్ధతను తెలియపరిచింది. కాని ఇలాటి సందర్భంలోనే రాధాదేవి, తనను అంగీకరించింది. తను గుడ్డివాడైనప్పటికీ ఆమెకు అభ్యంతరం లేదు; తను నిస్సహాయ స్థితిలోవున్నా ఆమె సంపాయించి జీవితమంతా తనను భరించేందుకు వెనుకాడలేదు. ఆ దేవత వెదజల్లిన కాంతిలో, యీ దెయ్యం భయంకర రూపం స్పష్టంగా కనిపిస్తోంది. నిజంగా తనకు కళ్ళే వస్తే యీామెను నిరాశా సముద్రంలో ముంచి, తన దారిన తాను చక్కాపోతే ఎంత బాగుంటుందో తలుచుకున్నాడు. ఈమెను శిక్షించేందుకన్నా, మానవత్వపు విలువల్ని యీామెకు అర్థమయేట్లు చేసేందుకైనా తనకు దృష్టి వస్తే బాగుండుననిపించింది, జగన్నాధానికి.

"మీకు కోపం వచ్చిందా?' అందామె, లాలనగా.

"లేదు—నీవు నిజం చెప్పావు జానకీ! నాకు దృష్టిరాని పక్షంలో నాకన్న యోగ్యుణ్ణి నీవు ఎన్నుకోవటం ఉచితమైన పనే!....నాకు కోపం లేదు. నేనే తొందరపడ్డా ననుకుంటాను క్షమించు"

"మాట్లాడుతే క్షమించమంటారేమిటి? నేను మిమ్మ హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నాను—కాని."

ఇలా మాట్లాడేవాళ్ళకు హృదయమంటూ వున్నదనుకునేటంత మూర్ఖుడుగా ఆమె తనను భావిస్తోంది కాబోలు! ఆ పొరపాటును దిద్దుకోలేని స్థితిలోనే ఉంచుతే, సమయం వచ్చినప్పుడు కుక్కకాటుకు చెప్పుదెబ్బ తగిలించవచ్చు.

"నాకు అర్థమైంది జానకీ! కళ్ళొస్తే నేను నిజంగా ధన్యుణ్ణవుతాను—ఇంక వెళ్దామా?"

ఆమె చెయ్యి అందించింది. కాని అతనా చేతిని అందుకోకుండా ఆమె భుజంమీద చెయ్యి వేశాడు. రెండోచేయి పొరపాటున ఆమె ముఖం మీద పడింది. కళ్ళ దగ్గిర

తడి తగిలింది. ఆశ్చర్యపోయాడు.

''జానకీ! దుఃఖిస్తున్నావా?''

''లేదు—లేదు—'' అని ఆమె త్వరత్వరగా అతన్ని నడిపించుకొని వెళ్ళింది.

తను మాట్లాడిన ప్రతిమాటా జానకిని కదిలించి వుంటుందనే సంగతి జగన్నాధానికి అర్థమైంది. ఇంత తేలిగ్గా ఈమెను తన వైపు తిప్పుకోగలుగుతానని తను అనుకో లేదు. ఇక ఆ రాత్రి దిగ్విజయ యాత్ర చేసినవాడల్లే హాయిగా నిద్రపొయ్యాడు. జానకి మాత్రం చాలా పొద్దు పొయ్యేవరకూ ఆలోచనల్తో వేగి వుంటుందనీ, అదే ఆమె శిక్ష అనుభవించేందుకు మొదలనే జగన్నాధం ఊహ అబద్ధమవలేదు.

# 8

మర్నాడు చాలా సంతోషంగా వుంది. దుష్టశిక్షణ శిష్టరక్షణ జరిగిందాయె. ఈ విషయాలన్నీ రాధాదేవికి చెప్పాలనుకున్నాడు కాని, ఏలా చెప్పాలో అర్థంగాక వూరు కన్నాడు.

''ఏం? చాలా ఆనందంగా కనిపిస్తున్నా రివాళ?'' అంది రాధాదేవి.

''ఏం లేదు. నీవు నాకు దొరికినప్పటినుంచీ యీ ఆనందసాగరంలో మునకలు వేస్తున్నాను.''

''రాత్రి జానకి ఏమీ అనలేదుకదా?''

ఈ సంగతులన్నీ తెలిసినవేమోనని జగన్నాధానికి భయం వేసింది. కాని, ఆమె ఉద్దేశం అదై వుండదని సమాధానపరుచుకున్నాడు.

''ఏమంటుంది?—ఆమె ఏమన్నా అంటుందని నీవెందుకు అనుకున్నావు?''

''మీరు నిన్న అన్నారుగా—ఆమె అంటే ఏదో కష్టంగా మాట్లాడారు. అందు కని—''

''ఏదో ఊరికనే తమాషాకు అన్నాను. రాత్రి హాయిగా గడిచింది.''

''నేను చెప్పలా—అమె మంచిదని?'' అని నవ్వింది రాధాదేవి.

ఆమె మంచితనాన్ని గూర్చిన తన అభిప్రాయం వినిపిస్తే రాధాదేవి అభిప్రాయం కూడా తప్పక మారుతుంది. కాని ఆ జానకి 'మంచితనం' అలాగే ఉండనివ్వడంవల్ల ఇబ్బందేమీ లేదు. చెప్పుకోదగిన సంగతులేమీ జరగకుండానే కాలం జరిగిపోతోంది. జగన్నాధం మాత్రం రాధాదేవి చుట్టూ కట్టిన కలల కోటల్లో విశ్వవిహారం చేస్తూనే వున్నాడు. ఇక రాత్రిళ్ళు జానకితో వినోదంగా గడుస్తోంది. అందులోనూ ఆమె

ఇదంతా నిజమనుకుంటూంటే, ఆమెని ఏడిపిస్తూ తను ఆనందిస్తున్నాడు. రెండు మూడుసార్లు జాలివేసి నిజం చెప్పేద్దామని నాలుక చివరిదాకా వచ్చింది కాని, యీ వ్యవహారాన్ని క్లయిమాక్స్‌కు లాగాలనే పట్టుదల జగన్నాథాన్ని వారించింది.

అసందర్భంగా జానకి రాధనుగూర్చి చెప్పడం ఒక విశేషం. ఒకపక్క ఆ మాటలు తనకు ఇష్టం లేనట్లే నటిస్తూ, మరోపక్క వింటూనే వున్నాడు. జానకి చెప్పిన మాటల్నిబట్టి రాధకు ఎవ్వరూ లేరు. అసలు ఆమె తల్లిదండ్రు లెవరో ఎవరికీ తెలియదు. ఆమెను పెంచినామె, ముసలితనంలో ఎక్కడో పల్లెటూళ్ళో వుంది. తన జీతంలో అధికభాగం రాధ ఆ పెంచిన తల్లికే పంపుతూ వుంటుంది.

ఇవన్నీ నేరాలు కాకపోయినప్పటికీ జానకి చెప్పిన ధోరణి చూస్తే, తన దృష్టిలో రాధాదేవి స్థానాన్ని అధఃపాతాళానికి తొక్కాలనే ఉద్దేశం కనిపించింది. ఇతరుల్ని అవమానించటం, నీచపరచటంద్వారా తన గొప్పతనాన్ని చాటుకుంటూన్న విధానాన్ని జానకి ప్రయోగిస్తోంది. ఆమె రాధాదేవినిగూర్చి ఎంత హీనంగా మాట్లాడుతోందో, తన దృష్టిలో రాధాదేవి స్థానం అంత ఉన్నతంగా పెరుగుతోంది. పైకిమాత్రం తనూ రాధాదేవిని అవమానించే మాటలకు ప్రోత్సాహాన్ని ఇస్తూన్నప్పటికీ అదంతా జానకిచేత ఇలా మాట్లాడించాలనేందుకే నని జానకి ఎన్నటికీ తెలుసుకోలేదు. ఆమె పిచ్చిలో, మైకంలో ఆమెను వదిలేశాడు.

ఇదే పద్ధతి రాధాదేవి దగ్గర కుదరలేదు. జానకినిగూర్చి ఆమె చాలా మంచి అభిప్రాయాన్ని చెపుతుంది.

చివరకు ఒకనాడు, "ఆమెకు నీపట్ల స్నేహభావం లేదు తెలుసా?' అన్నాడు, ఉండబట్టలేక.

"మీ కెలా తెలుసూ? నన్నామె ఏమన్నా అన్నప్పటికీ మే మిద్దరం స్నేహితురాండ్రమే! మీరంటే ఇవ్వాళ వచ్చారు కాని...." అందామె!

రాధాదేవి హృదయంలో ఆమె శత్రువులక్కూడా స్థానం వుందనే సంగతి జగన్నాథానికి తెలిసివచ్చింది. జానకినిగూర్చి ఎన్నిమాట లన్నప్పటికీ, రాధాదేవిమీద అవి పనిచేయవని తెలిసింది. ఈ కంఠశోషకూడా అనవసరం. రాధాదేవి ఉదాత్తత ప్రతి రోజూ ఏదో ఒక రూపంలో కనిపిస్తూనే వుంది. బతికివుండి దేవకన్యను పొందగలిగిన తన అదృష్టాన్నిగూర్చి అతను మూర్ఛపర్యంత మౌతున్నాడు.

రాధాదేవికి ఎవ్వరూ లేరు—ఐతేనేం. ఆమెకు ఆమెగానే వున్నది! తనుకూడా ఏకాకి. ఈ విధంగా రెండు హృదయాల మధ్య ఏర్పడిన యీ ఒంటరితనం ఒక్కసారిగా మాయమై, ఒకరు కొకరుగా కలకాలం జీవించగలిగే అవకాశం ఏర్పడు




టుంది. ప్రియ బంధువులల్లే, జన్మజన్మాల స్నేహభావం ఒక్కసారిగా క్రియా రూపాన్ని దాల్చేటంత శక్తివంతంగా తమను కలిపి వుంచుతుంది. అదే తనకు పదివేలు!

వారమయ్యాక చూసుకుంటే జానకితో తన ప్రణయం చాలాదూరం వెళ్ళిందని పించింది. ఒక సంవత్సరంపాటు స్నేహం చేసినా సాధించలేనిదాన్ని, కేవలం ఒక్క వారంలో సాధించాడు. తా నిందుకు సంతోషించని మాట నిజమే కాని, స్నేహం పెరగకుండా అడ్డుపడలేదు; పైపెచ్చు ప్రోత్సహించాడు కూడాను.

రాధాదేవితో జరిగిన ప్రణయం కూడా యింత తీవ్రరూపాన్ని దాల్చలేదు. అయితే రాధాదేవి ప్రణయం స్వచ్ఛమైనదైతే, జానకితో జరిపిన ప్రణయం కల్తీగానూ, మోసంతోనూ నిండివుందనే సంగతి తనకు తెలుసు. పోతే భేదమల్లా తను ఏనాడో రాధాదేవికి అంకితమై పొయ్యాడు; జానకికి ఏ నాడూ లొంగలేదు. జానకి నిజానికి కూడా తన కింకా పూర్తిగా లొంగలేదు. లోతు తెలియందే నీళ్ళల్లోకి దిగేందుకు ఆమె తత్వం ఒప్పలేదు. ఆమె ప్రణయానికీ తనకు దృష్టి వొచ్చేందుకూ యిలాటి సంబంధమే వుంది.

తరువాత వారంలో మళ్ళీ రాధాదేవి నైట్ డ్యూటీలోకి వొచ్చింది. ఇప్పుడు

ప్రశాంతంగా హాయిగావుంది. ఈ యిద్దరు స్త్రీలూ తనను ప్రేమిస్తూనే వున్నారు. జానకిని తృణీకరించటం తథ్యం. ఉభయులూ తనకు సకల సేవలూ చేస్తున్నారు; దృష్టి మినహాగా తన కీ ప్రపంచంలో మరే లోటూ లేదు. రాధాదేవి ఉంటే ఆ దృష్టి లేని లోటుకూడా తెలియటం లేదు.

ప్రతి రాత్రీ భావి జీవితాన్నిగూర్చి తను మాట్లాడుతూనే ఉన్నాడు. రాధాదేవి వింటూ కూర్చుంటుంది. ఆమెకూడా తనలాగే స్వప్నాలకు రూపాన్నిచ్చేందుకు కింద మీదవుతోందని గ్రహిస్తున్నాడు. జానకిలాగు బోలు మనిషి కాదీమె. జానకి తనను ప్రియుడుగా అంగీకరించగలుగుతే, ఈమె దైవంగా స్వీకరించ గలుగుతోంది.

ఈ వారాంతంలో ఒకనాటి మధ్యాహ్నం రాధాదేవి ఒచ్చింది. జానకి డ్యూటీలో ఉందప్పుడు.

"మీ పేషెంట్‌తో కాస్త మాట్లాడనిస్తావా జానకీ ?" అందామె.

"నా పేషెంటేమిటి ?....దీనికి నా అనుమతి ఎందుకూ ?" అంది జానకి విసుగ్గా.

"నీ రక్షణలో వున్నారుగా ఏం లేదు జానకీ! అమ్మకు యేమీ బాగాలేదు. వెంటనే బయలుదేరి రమ్మని టెలిగ్రాం వొచ్చింది."

"అరె పాపం! సారీ!" అని నొచ్చుకుంది జానకి.

ఈ సంభాషణంతా వింటూనే ఉన్నాడు జగన్నాథం. రాధాదేవి వెళ్ళిపోతూ చెప్పేందుకు వచ్చిందని అర్థమైంది. ఈమె వెళ్తుందంటే యెంత విచారం కలుగుతోంది! ప్రపంచంలో యెవర్నీ, చివరకు విధినికూడా లెక్కచేయని తను, ఒక స్త్రీ కోసం వూపిరాడనంతగా బాధపడుతున్నాడు!

రాధాదేవి దగ్గరికి రాగానే "అయితే వెళ్తున్నావన్నమాట రాధా ?" అన్నాడు, ప్రపంచంలో తనకు మిగిలింది కాస్తా దూరమౌతూన్నప్పుడు కలిగే వ్యధను ధ్వనింపజేస్తూ.

"విన్నారా అంతా ? ...ఔను....సాయింత్రం బండికి వెళ్తున్నాను. అమ్మకు చాలా ప్రమాదంగా ఉందట....బహుశా బతకదేమో ?" ఆ చివరి మాటలో దుఃఖ తరంగాలు గంతులేసినవి. పెంచిన అమ్మనే, కన్నతల్లికన్న యెక్కువగా ప్రేమించి వుంటుందని జగన్నాథానికి అర్థమైంది. ఆమె హృదయం ఎంత సున్నితం! మనిషిని ప్రేమించటమంటే, ఆ ప్రణయానికి ఒక దేవాలయం కట్టి గౌరవించి, పూజించటమంటే, యేమిటో యీమెకు తెలుసు. ఇలాటి అమర ప్రేమ తనకు దక్కిందన్న గర్వం కలిగిందతనికి.

"సరే—వెళ్ళిరా రాధాదేవీ! మీ అమ్మగారి ఆరోగ్యం సంగతి ఉత్తరం రాస్తావా....అన్నట్లు మళ్ళీ యెప్పుడొస్తావు?"

"ఏమో—ఎలా చెప్పేది? ప్రస్తుతం రెండు వారాలకు సెలవు పెట్టాను" అందామె.

"బహుశా పది రోజులకు నాకు కట్లు విప్పుతా రనుకుంటాను. ఆ నాడు నీవు యెదురుగా ఉంటావని ఆశించాను రాధా!"

"మిమ్మ ఈ స్థితిలో వదలి వెళ్ళేందుకు నాకూ విచారంగానే ఉంది. ఏం చెయ్యను—చెప్పండి? అయినా నేను వుండి చేయగలిగే దేముంది?"

"ఏమో—నీ ప్రార్థనలు విన్న ఆ దేవుడు ఆ సమయానికి నాకు కళ్ళిస్తాడేమో?"

"తప్పక యిస్తాడు....నేను యెక్కడవున్నా మీకు దృష్టి రావాలని ఆ దయామయుణ్ణి ప్రార్థిస్తూనే ఉంటాను. నేను జీవితంలో యెన్నడూ దేవుణ్ణి యేమీ కోర లేదు. అందుకని నా ఈ ఒక్క కోర్కెనూ ఆయన మన్నిస్తాడని నా నమ్మకం.... మీకు తప్పకుండా దృష్టి ఒస్తుంది....తప్పక...." ఆమె ఉద్వేగంతో ఊగిపోతోందని అర్థమైంది. తన జీవిత మాధుర్యమంతా యీామె మాటలలోనే యిమిడివున్న దనిపించింది. ఈ ప్రాణి లేకుంటే తన బతుక్కి అర్థం ఉండ నేరదు.

"రాధాదేవీ! మీరు నా పట్ల చూపిన ఈ కరుణకు యే ప్రతిఫలమూ యివ్వలేని స్థితిలో ఉన్నాను" అన్నాడు.

"ఇచ్చారు కదా—మీ కెందుకు కా విచారం?"

"నేనేం యిచ్చాను?"

ఆమె జవాబు చెప్పకుండా జగన్నాథం గుండెమీద చెయ్యి వేసింది. ఔను.... తను హృదయాన్నే ఆమెకు అర్పించాడు? ఆమె కోరింది కూడా అదే కావటంవల్ల అంతులేని ఆనందం కలిగింది, జగన్నాథానికి.

"రాధాదేవీ! నీతోపాటు ఈ గుండెను కూడా లాక్కుపోతున్నావు సుమా!" అన్నాడు జగన్నాథం.

"ఇంతమాత్రానికే మొగాళ్ళు యిలా దిగజారిపోతారేం? మనం మళ్ళీ త్వరలోనే కలుసుకుంటాం కదా! మీరు కాస్త ధైర్యంగా ఉండండి. జానకి ఉంటుంది. జానకితోనూ, డాక్టర్‌గారితోనూ చెపుతాను."

"నువ్వు యెవరికీ చెప్పవద్దు రాధాదేవీ! ఒకవేళ నాకు కళ్ళు రాకపోతే, నీవు వొచ్చేదాకా యిక్కడే పడివుంటాను కళ్ళొస్తే నిన్ను వెతుక్కుంటూ ఒస్తాను....నీ ఎడ్రస్ రాసివ్వవూ?"

"ఏం మాటలండీ? మీకు కళ్ళురావనే సందేహం యెందుకున్నది?.... నేను కూడా ఎంత త్వరగా వీలయితే అంత త్వరగా వ్రాస్తాను కదా!" కాగితం అందిస్తూ అందామె.

"ఇదిగో నా ఎడ్రస్ '

"రాధాదేవీ! జానకి దగ్గర్లోనే ఉందా?" అన్నాడు చాలా తగ్గుస్థాయిలో.

"లేదు.... యెందుకూ?"

"ఏం లేదు. మన మాటలు ఆమె వినటం నాకు యిష్టంలేదు ... రాధాదేవీ! సెలవు.... మీరు వెళ్ళిరండి.... వెళ్ళగానే ఉత్తరం రాస్తారు కదూ? ... ఉంటాను మరి" అని నమస్కరించాడు.

రాధాదేవి జగన్నాథం రెండు చేతులూ పటుకొని "మీరు నన్ను గౌరవించాలనే ఉద్దేశ్యంతో అగౌరవ పరుస్తున్నారు. ఇంకెప్పుడూ యిలా చెయ్యకండి" అంది.

"రాధాదేవీ! దేవతల్ని కొలవటం తప్పా?.... ఒక్క విషయం: నీకూ గుడ్డివాడికీ కొన్నాళ్ళ స్నేహమనే సంగతి మరిచిపోకు.... నాకు కళ్ళు రాకుంటే, నీవే దిక్కు రాధాదేవీ!"

"చెప్పానుకదా—మీకు కళ్ళు రానట్లయితే, నాకు వైర్ చెయ్యండి. నేనే వాస్తాను-సరేనా?.... ఇక సెలవా?"

మాట్లాడేందుకు మాటలే దొరకలేదు. చేయి పైకెత్తి గాలిలో విసిరాడు. తనకు దూరమౌతున్న అడుగుల శబ్దం విన్నాడు.

జీవితం ఎంత చిత్రమైనది! కొన్నేళ్ళపాటు ఏ మార్పూ లేకుండా యీదురోమంటూ సాగే జీవితం, ఒక కొత్త శక్తితో చకచకా సాగిపోతుంది. ఈ వేగానికి తట్టుకో గలగటంలోనే చాకచక్యం కావాలి. రాధాదేవితోడి స్నేహం, అప్పుడే వీడ్కోలు, తన సర్వస్వమూ కోల్పోయినంత బాధ—ఎన్ని రకాల అనుభూతులు! అంతలోనే ఆశ, దాని వెనుకనే నిరాశ! ఒకపక్క జీవితంలోని మాధుర్యం, మరోపక్క విషాదం! రాధాదేవిలాగు తనను మొదలంటా కదపగలిగిన వ్యక్తి మరెవ్వరూ లేరు కనుకనే, ఆమె దూరమౌతున్నదనే ఈ అసంతృప్తి కలిగింది. క్షణంలోనే తన స్వర్గమంతా నరకమైనట్లు తోచింది,

"విరహవేదన ఆరంభమైందా?" అని నవ్వుతోంది జానకి.

తేనె తుట్టె దగ్గరికి వెళ్ళినప్పుడు, తేనె దొరక్కపోయినా తేనెటీగలు చుట్టు ముట్టినట్లు, వాళ్ళంతా గగుర్పొడిచేట్లుగా చేసే రొద, వీలు చిక్కినన్ని చోట్ల కుట్టే విధానంవలెనే తోచింది ఈ జానకి. ఈమె జీవితంతో ఆడుకునేందుకూ, వినోదిం

బఙ్గాదేశ్ పుణ్యమా అని
నాణేయాలు మూడు అచ్చయినాయి!




చేందుకూ అలవడిందే కాని. సీరియస్‌నెస్‌ను ఎన్నడూ అనుభవించి ఉండలేదేమో? నిజానికి తనూ జీవితాన్ని రబ్బర్ బంతివలె తన్నుతూ లెక్క చేయలేదిన్నాళ్ళూ!

కాని రాధాదేవి తాను ఎరుగని పక్కకు జీవితాన్ని తిప్పింది. ఒక వ్యక్తికి మనసా, వాచా, కర్మా అంకితమై పోవటమంటే ఏమిటో ఆమె అనుభవపూర్వకంగా చూపి, తనను మార్చగలిగింది.

ఇక ఈ జానకికి తన ఈ పవిత్ర ప్రణయం ఎన్నటికీ అర్థంకాదు. అర్థం కాకుండా ఉండటమే కావలసింది. ఆమె హేళన చేసినంత మాత్రాన తనకు పొయ్యే దేమీ లేదు. మూర్ఖుణ్ణి చూసి జాలిపడుతూ తనలో తాను నవ్వుకునే స్థానంలో వున్నాడు తను. అందుకనే జానకిని అసలు మనిషిగానే చూడలేకపోతున్నాడు; ఈ సంగతి ఆమె బహుశా ఎన్నటికీ గ్రహించలేదేమో?

"పాపం, రాధాదేవి అమ్మగారికి ఎలా వుందో అని ఆలోచిస్తున్నాను."

"అదే....ఆమె తల్లికి జబ్బు చెయ్యకుండా వుంటే, మీ రాధాదేవి ఇక్కడే వుండేవి కదా అని ఆలోచిస్తున్నాను!"

మనుషులు ఇతరుల అభిప్రాయాలను ఇంత హాస్యాస్పదంగా పరిగణిస్తూ కించ పరుస్తా రెందుకో? యీమెతో ఈ సంభాషణా ధోరణి మార్చకుంటే, తను భరించలేడు

"జానకీ దేవి! కాస్త వొళ్ళు తుడుస్తారా?"

"ఇప్పుడా? . ఈ ఎండవేళ ఎందుకులెండి. సాయంత్రం చల్లబడ్డాక తుడుస్తాను రాధ ఏం చెప్పిందీ?" అంది జానకి.

"ఏముంది చెప్పేందుకు? ఐనా నేను చెప్పానుకదా—రాధాదేవి మీదికి నా మనసు పోదని. ఎంత చెప్పినా నీకు నమ్మకంలేదు. అందుకనే ఇలా మాట్లాడుతూంటావు.. ప్రేమించటమే తప్పు. ప్రేమించాక ఎన్ని మాటలన్నా పడాలి మరి!" అన్నాడు వ్యధను ధ్వనింపజేస్తూ.

పాలభాగంమీద చెయ్యివేసి "నేను తమాషాకు అంటే మీ రిలా కష్టపడతారెందుకు?" అందామె. తను వేసిన ఎత్తు ఫలించినందుకూ, ఈ లంపటాన్ని వొదిలించుకో గలిగినందుకూ సంతోషం కలిగింది. జగన్నాధానికి.

"నాకేం కష్టంలేదు జానకీదేవీ! నీవు పొరబడుతున్నా వేమోనని నా భయం.... అది సరే, మరి నైట్ డ్యూటీకి ఎవరొస్తారు?"

"నిర్మలనే అమ్మాయి వొస్తుంది. మీరు కాస్త నడవటం అదీ తగ్గించండి.... ఆమె నిప్పులాంటి మనిషి....పిచ్చివేషాలు వేస్తే ఈ కిటికీలోంచి కిందికి తోస్తుంది—జాగ్రత్త!" అందామె.

పిచ్చి జానకి! తనను స్వంతం చేసుకున్నట్లే భ్రమిస్తున్నందుకు నవ్వు వొచ్చింది. నిజానికి ఆ నిర్మలమీద తనకు ఎలాటి అభిప్రాయమూ లేదు కాని, ఈమె మాటలు విన్నాక నిర్మల అంతుకూడా తేల్చాలనే కుతూహలం కలిగింది. తనలో లేని అభిప్రాయాలను, జానకి తనకు తెలియకుండానే తనలో ప్రవేశపెడుతోంది!....ఐనా ఇప్పటికే ఇద్దరి మధ్యా నలిగిచస్తూ, ఈ మూడో ఆమెను కూడా అంటించుకోవటంలో అర్ధం లేదు.

"జానకీ! నేను అలాటివాణ్ణి కాదు—తెలుసా?"

"అమ్మ పుట్టిల్లు మేనమామలకు తెలియదా?"

ఇక ఏం చెప్పినా ఈమె నమ్మదని తేలిపోయింది.

అవతలి రోగి ఎవరో మూలిగి, జానకిని హెచ్చరించి, తనను రక్షించాడు.... కాలం చాలా బరువుగా, మెల్లిగా సాగుతోంది. ఇదివరకంటే ఈ పగలు త్వరగా గడుస్తే, రాత్రి వొస్తుంది కదా, రాధాదేవి దర్శనం అవుతుంది కదా అనే ఆశ వుండేది, ఇప్పుడా ఆశలేదు. పగలైనా, రాత్రయినా ఒకటిగానే వుంది. అర్ధం లేకుండా వేచి వుండటం తప్ప ఇంకేమీ లేదు.

"మిస్టర్! నా డ్యూటీ ఐపోయింది. నేను వెళ్తున్నాను. నిర్మల విషయంలో

జాగ్రత్తని మళ్ళీ ఒకసారి హెచ్చరిస్తున్నాను!'' అంది జానకి.

''ఈ సంగతి ఆమెతో కూడా చెప్పి వెళ్ళు'' అన్నాడు జగన్నాధం వొళ్ళు మండి.

''ఆమెకు అంతా తెలుసులే! వస్తాను మరి'' అని జానకి వెళ్ళిపోయింది.

ఈ ప్రణయ వృత్తాంతాలు ఈ గది దాటి వెళ్తున్నవనే సంగతి ఇప్పుడే తెలిసింది ఎంతదూరం వెళ్ళిందో తెలియదు కాని, మొత్తంమీద కొంత పబ్లిసిటీ జరిగింది ఇదంతా ఈ జానకే చేసి వుంటుంది అసలీ జానకితో తెగతెంపులు చేసుకుంటే బాగుండు. కాని ఈ స్థితిలోనా? ఎట్లాగూ చివరకు గొప్ప 'డిసప్పాయింట్మెంట్'ను ఆమెకోసం సిద్ధంగానే వుంచాడు.

అడుగుల చప్పుడుతో కొత్త నర్సు వచ్చిందని అర్థమైంది.

'గుడ్ మార్నింగ్ నిర్మలాదేవీ!'' అన్నాడు జగన్నాధం

''ఓ! నా పేరు కూడా అప్పుడే కనుక్కున్నారా?'' అందామె.

''ఇంకో పనేం లేదు మరి '

''తమకు భోజనం తీసుకొనిరానా?''

''మీ దయ—''

ఆమె వెళ్ళి భోజనం తీసుకొచ్చింది. భోంచేస్తూ ఆలోచనల్లో పడ్డాడు. ఎంత వద్దనుకున్నా తన పాత పద్ధతి, స్త్రీకి లొంగినట్టు నటిస్తూ ఆమెను లొంగతీసుకోవటాన్ని నిర్మలపట్ల కూడా ప్రయోగిస్తున్నానా అనే అనుమానం కలిగింది ఏమైనా ఈ వ్యవహారాన్ని ఇంకా ముందుకు సాగనివ్వటం మంచిది కాదని నిశ్చయించుకున్నాడు జగన్నాధం

ఈ నిశ్చయంతోనే నిర్మలను అనవసరంగా పిలవ దలచలేదు రాధాదేవి తనకు దూరమైంది మనిషి దూరమైనా మనసు దూరమవక్కర్లేదు కదా! మామూలు కలల్లో కరిగిపోతూ కాలం గడపసాగాడు

ప్రతిరోజూ రాధాదేవి దగ్గర్నుంచి ఉత్తరం వస్తుందేమోనని ఎదురుచూస్తూనే వున్నాడు ఒంటరిగా ఆమె ఏం బాధలు పడుతోందో? ఈ కష్ట సమయంలో తానామెకు ఏ విధంగానూ సహాయపడలేకపొయ్యాననే బాధ మిగిలిం దతనికి.

ఆరోనాడు ఉత్తరం వచ్చింది. ఇప్పుడు జానకి నైట్ డ్యూటీలో వుండటం మేలయింది కాస్సేపు ఆలోచించి, చివరకు నిర్ధారణ చేసుకొని నిర్మలచేత ఉత్తరం చదివించుకున్నాడు

పాపం—రాధాదేవి తల్లి ఐదురోజుల క్రితమే చనిపోయిందట! అక్కడి వ్యవహారాలన్నీ చూసుకొని వచ్చేందుకు మరో పదిరోజులన్నా పడుతుందట! ఈ లోనేగా

కట్లు విప్పుతారనీ, తనకు తప్పకుండా దృష్టి వచ్చేందుకు భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాననీ, కట్లు విప్పగానే ఉత్తరం రాయించమనీ రాసిం దామె.

నిర్మల అంతా చదివి "పాపం! రాధ ఎంత మంచిది!" అని నిట్టూర్చింది.

తనేమీ మాట్లాడలేదు రాధ మంచితనమంతా తనదే ననే గర్వం ఒక పక్కా. ఆమె దైన్యస్థితి మరోపక్కా వేధించినవి. మళ్ళీ ఉత్తరం రాసేందుకు మాత్రం ఏముంది? ఎవరిచేతన్నా రాయించాలి మౌనంలోనే రకరకాల ఆలోచనల్లో మునిగి పొయ్యాడు జగన్నాధం.

# 9

"ఇవాళ మీ కట్లు విప్పుతారు. మిమ్మల్ని థియేటర్‌కు తీసుకొని వెళ్ళబోతున్నాం" అంది జానకి.

ఏదో షాక్ తగిలినట్లయింది. ఇన్నాళ్ళూ లేని ఆతృత ఆపాదమస్తకమూ వణికించింది. నిజానికి తన దృష్టి విషయమే మరిచిపొయ్యాడు. ఒక కష్టాన్ని కప్పిపుచ్చే సుఖం ఆవరించి మరిపింప జేసింది ..ఇప్పుడు తన జీవిత సౌఖ్యమంతా అటో, ఇటో తేలే సంఘటన రానే వచ్చింది. దీన్ని ఎదుర్కొనేందుకు సిద్ధంగా లేనందువల్ల భయోత్పాతం కలిగింది.

ఎలాగో ఆ షాక్ తట్టుకున్నాడు థియేటర్‌కు తీసుకొని పోబడుతూన్నప్పుడు, ఒకవేళ దృష్టి రాకున్నప్పటికీ, రాధాదేవి సహచర్యంతో జీవితం సాఫీగా గడుస్తుంది కనుక, విచారించటంలో అర్థం లేదనే తలపు మెరవగానే చాలా తృప్తి కలిగింది. ఎటు తేలినా తను లెక్కచెయ్యక్కర్లేదని తనకు తాను సరిపెట్టుకున్నాడు జగన్నాధం.

థియేటర్‌లో పడుకోబెట్టారు.

"మిస్టర్! మీ కట్లు విప్పుతున్నాం. మీరేమీ భయపడకండి ."అన్నాడు డాక్టర్.

మెల్లిగా, బాధలేకుండా, జాగ్రత్తగా కట్లు విప్పారు. మూతపడివున్న రెప్పల్ని కడిగి, మెల్లిగా తెరిచి, క్రిమిసంహార ద్రావకాన్ని వేశారు

"మిస్టర్! మెల్లిగా కళ్ళు తెరవండి." అన్నాడు డాక్టర్.

మొదట్లో కళ్లు తెరిచేందుకు భయం వేసింది. కాని తెరవటంవల్ల యీ ఆతృతన్నా తగ్గుతుంది కదా! భయపడుతూనే రెప్పల్ని కొద్దిగా ఎత్తాడు—ఏమీ కనిపించటం లేదు శాశ్వత అంధత్వం రానే వచ్చిందనే తలపు రాగానే వెన్నెముకలోంచి ఒక శీతలప్రవాహం అతివేగంగా పయనించింది,




''తెరవండి కళ్లు తెరవండి ఎందుకు మూసేస్తారు?'' అన్నాడు డాక్టర్. ఇంకా ఆశలున్నవని తోచింది, జగన్నాథానికి.

ఈసారి మళ్ళీ తెరిచాడు. క్రమంగా పూర్తిగా తెరిచాడు అంతా బూజుబూజుగా, నీళ్ళధారల్తో కడిగివేస్తున్నట్లుంది ఏ వస్తువూ విశిష్టరూపాన్ని చూపటంలేదు. కొంత వరకే దృష్టి వచ్చిందేమో?

డాక్టర్ కళ్లు మరోసారి తుడిచాడు

''భయపడకండి కాంతికి కళ్ళు తట్టుకోలేవు క్రమంగా అలవాటు చెయ్యాలి నర్స్! ఒక్కలైట్ వుంచి మిగతావి తీసెయ్—యిప్పుడు తెరవండి '' అన్నాడు డాక్టర్

జగన్నాధం కళ్ళు తెరిచాడు రేచీకటి ఉన్నవాడి మాదిరిగా యేవో నీడలల్లే కనిపిస్తూన్నవి.

''మీ రలా కళ్ళు తెరిచే ఉండండి నర్స్! ఒక్కో లైట్ వేసుకొనిరా—'' అన్నాడు డాక్టర్.

లైట్ తర్వాత లైట్ వెలగసాగింది. కాంతి పెరగసాగాక, ఒక్కో వస్తువే క్రమంగా విశిష్ట రూపాన్ని దాల్చసాగింది చివరకు లైట్లన్నీ వెలిగాక, చాలా స్పష్టంగా చూడగలుగుతున్నాడు తను!

ఎంత ఆనందం కలిగిందో అతనికే తెలియదు; ఒక్కసారిగా ఒక్క మానవుడు భరించలేనంత ఆనంద మది! ఆ ఉద్వేగానికి తట్టుకోలేక పొయ్యాడు. గట్టిగా కళ్ళు

మూసికొని, తెరిచాడు లేదు తనకు దృష్టి పోలేదు తను చూడగలుగుతున్నాడు కళ్ళు మూస్తూ, తెరుస్తూ ఒక నిమిషం గడిపాక లేచి కూర్చున్నాడు

ఎదురుగుండా డాక్టర్ నవ్వు మొహం కనిపించింది డాక్టర్ రెండు చేతుల్నీ పట్టు కొని "డాక్టర్‌గారూ! నాకు బాగా కనిపిస్తోంది నాకు నేత్రదానం చేశారు మీరు మీకు జన్మంతా కృతజ్ఞుణ్ణి" అని నమస్కరించాడు

ఆ తరువాత చుట్టూ చూశాడు మొదట జానకి కనిపించింది కాదు ఈమె జానకి అయి వుంటుందనుకున్నాడు

"జానకీదేవీ!" అన్నాడు అనుమానం తీరక

ఆమె ఒకడుగు ముందుకొచ్చింది తన వూహ తప్పలేదు, ఈమె—ఈ జానకి ఎంత అందగత్తె! ఇప్పుడే స్వర్గంలోనుంచి దిగిన దేవకన్యల్లే ఉంది తనకు కళ్ళు రాకుంటే యీ సౌందర్యమంతా స్వప్నానుభూతిగానే ఉండిపోయ్యేది కదా!

కాని, ఈ జానకి యెంత సౌందర్యవతి అయితేనేం? ఈమెకు హృదయం లేదు, అది పాషాణం! ఈమె మాదిరి రబ్బరు బొమ్మకూ, యీమెకూ భేదమేమీ లేదు భావ శూన్యమైన భాషల్లే చూసేందుకు తప్ప మరెందుకూ పనికిరాని తామర పువ్వల్లే, వుందీమె! ఈ హృదయంలేని వ్యక్తికి తన హృదయాన్ని సమర్పించ గలగటం కేవలం భ్రమ!

'నిర్మలాదేవీ!' అన్నాడు, ఆ రెండో ఆమె ముందుకు వొచ్చింది

"మీ అందరికీ నా కృతజ్ఞత!" అని ఒక్క నమస్కారం చేశాడు నిజానికి తనకు కళ్ళొచ్చినందుకు థియేటరులో వున్న వాళ్ళందరూ తనతోపాటే ఆనందాన్ని సూచిస్తూన్నారు

"మీకు కళ్ళు రాకముందే వీళ్ళందరూ తెలుసల్లే వుందే! ఎప్పుడూ చూడకపోయినా చప్పుడు సరిగా గుర్తుపట్టారు!' అన్నాడు డాక్టర్ నవ్వుతూ

ఆ ఆనందంలో నాట్యమాడబోయి చప్పున ఆగిపోయాడు వీళ్ళు ఎంతమంది ఉన్నప్పటికీ రాధాదేవి లేని లోటును తీర్చలేరు నిజంగా తనకి దృష్టి రావటం ఆమె చేసిన ప్రార్థనల ఫలితమే ననిపించింది ఆమె తన నోముల పంట! ఆమె ఉన్న ట్లయితే, తను పొందిన ఆనంద మెలాటిదో ఆమెలో స్పష్టంగా చూసుకో గలిగేవాడు కదా! ప్రపంచమంతా ఒక ఎత్తూ, రాధాదేవి ఒక్కతే ఒక ఎత్తూను ఈ తలపు రాగానే కలిగిన సంతోషం సగం మాయమైంది

థియేటరు తలుపులు తెరవబడినవి బైటికి తొంగిచూశాడు జగన్నాధం సూర్య కాంతిని కూడా కళ్ళు తట్టుకున్నవి వరండాలోకి వొచ్చి పిట్టగోడమీద ఆని—ఆసుపత్రి

ఆవరణనంతా పరికించి చూశాడు....తను మళ్ళీ యీ ప్రపంచంలో పడ్డాడు; జీవితాన్ని సాగించే యోగ్యతను పొందాడు.

—కాని ఆ కలలన్నీ కరిగిపోతూన్నవి. ఇది యింద్రభవనం కాదు—ఆసుపత్రి! హాలులో పడుకున్న రోగుల నిట్టూర్పులూ, బాధను వెలిబుచ్చే మూలుగులూ, రోదనలూ, బాధను భరించగలిగినా, ముఖ కవళికల్లో దాయలేని అశక్తతతో తన్నుకొనే ముఖభంగిమలూ, ప్రపంచంలోని విషాదాన్ని ఊడ్చి ఒక మూలకు జేర్చినట్లు తోచింది. సూరాన ప్రవహించే యమునా నది, కేవలం మురుక్కాలవగానే మారింది. ఈ బృందావనమంతా, కంకర రోడ్లతోనూ, అక్కడక్కడ పొత్తుగా పెరిగిన పిచ్చి చెట్లతోనూ నిండివుంది. దేవకన్య లనుకున్నవారంతా మానవ మాత్రులు—కేవలం మానవులయ్యారు వీళ్ళందరితోపాటే, దేవత్వం వొచ్చిపడిం దనుకున్న తనూ మానసికంగా మానవుడు, సాధారణ మానవుడయ్యాడు.

పర్వతాగ్రంనుంచి లోయలోకి పడ్డాక, లేవలేని స్థితిలో పైకి చూసి ఎంత ఎత్తో తెలుసుకున్నప్పుడు కలిగే వికారంలాటిది ఆవరించింది. ఈ బాహ్యదృష్టి ఉండటం వల్ల మనోనేత్రానికి చాలవరకు పని తగ్గిపోయింది. తాను యదివరకల్లే ఊహల్తో గాలిమేడల్ని కట్టలేడు. చూడటమే నమ్మటంగా భావిస్తాడు—అంతే!

ఒకానొక దివ్యానుభూతి కలిగినట్లే కలిగి, సముద్రతరంగం వలె కరిగిపోయింది. చీకట్లో కనిపించిన అద్భుత చిత్రాలన్నీ, వెలుగులో పేలవంగా, నిర్జీవంగా, యథా రూపాలతో ప్రత్యక్షమయాయి, యీ నిత్యజీవిత మంటే వెగటేసి, యింతకన్న ఉన్నతమైనదేదో వున్నదనీ, దానికోసం చేతులు జాచాలని తెలిసి, చాచిన చేతులకు ఏదీ అందని అసంతృప్తితో రోజులు వెళ్ళబుచ్చుతూన్న తనకు ఆ అత్యున్నత మైనది ఊహాపథంలో మెరిసి, ఒకచోట గూడు కట్టుకొని, తను నమ్మగలిగినంత శక్తివంతంగా రూపొంది. యిప్పుడదంతా ఒక్కసారిగా పేకమేడల్లే కూలిపోయింది. మళ్ళీ ఈ సాధారణ ప్రపంచమే శరణ్యం. దీనిలోనే పోరాటాలు, గాయాలు, బాధలు, మిణుగురు పురుగులల్లే మెరిసే సౌఖ్యాలు—అవే మిగిలినవి. దృష్టి వొచ్చినందుకు యింతకుముందు కలిగిన ఆనందమంతా క్షణంలో విషాదంగా మారింది!

ఏమిటి తన కీపాడు ఆలోచనలు? ఎంత గొప్పదైనప్పటికీ స్వప్నానుభూతి, నిజానుభూతి ముందు తీసికట్టేకదా! స్వప్నాలతోనే సౌఖ్యపడగలుగుతే, జీవితం ఇంత దుర్భరంగా ఎందుకుంటుంది? ఆ మిధ్యసంగతి తెలిసికూడా, తను పొరబడ టంలో అర్థంలేదు, కేవలం తను తరచటంవల్ల సారమంతా అంతరించి ఈ పిప్పి మిగిలింది!

తనకు దృష్టి వొచ్చినందుకు తనకన్న ఎక్కువగా రాధాదేవి. తన యిలవేల్పు, ఆరాధ్య దైవం, జీవిత సర్వస్వమూ పొందిన తృప్తితో ఆనందిస్తుంది. తనకీ ప్రపంచంలో మిగతావన్నీ, తన కలలు కూడా మిథ్య అవుగాక! కాని—రాధాదేవి మాత్రం సత్యం, నిత్యం. తన మిగతా కలలంతా కూలిపోయినా ఆమె మాత్రం తనకు రక్తమాంసాలతో దక్కుతుంది. ఆమెను, ఆ దివ్యమంగళ విగ్రహాన్ని తా నిప్పుడు చూడగలడు. ఆమె ప్రతి కదలికా తనకు ఆనందాన్నిస్తుంది. నిష్కల్మషమైన ఆమె ముద్దు ముఖంలో ప్రతిఫలించే ప్రతి ఉద్వేగాన్నీ తాను గ్రహించగలడు. యీ కళ్ళు రావటం ఆ దేవతను దర్శించి, పూజించి తరించేందుకే ననిపించింది.

తను గుడ్డివాడైతే రాధాదేవికి ఎంత బరువయ్యేవాడు! ఆమె భరించేందుకు సిద్ధంగా వున్నప్పటికీ, ప్రతిరోజూ ఆమె రెక్కల కష్టాల్ని పిండుకునే నిస్సహాయ స్థితిలో నే గడపాల్సివచ్చేది, ఇది దురన్యాయమే ఐనప్పటికీ, అంతకన్న దారిలేదు-తా నీ అన్యాయాన్ని ఆశ్రయించకుండా తను సుఖపడుతూ రాధాదేవిని సుఖపెడుతూ జీవిత శేషాన్ని గడిపేందుకే దృష్టి వచ్చింది. రాధాదేవి పొందే ఆనందాన్ని తలచుకున్నప్పుడు కాని, తాను పొందిన ఈ వరానికి తగిన విలువ చిక్కలేదు.

రాధాదేవికి టెలిగ్రాం పంపుతే....? ఆమె ఎక్కడో చిన్న పల్లెటూళ్ళో వుంది. టెలిగ్రాం ఎప్పటికి జేరుతుందో? తనే బయలుదేరి వెళ్ళటం మంచిది. టెలిగ్రాంకన్న తనే ముందుగా వెళ్ళగలడు! సువార్తను విన్నదానికన్న, చూస్తేనే ఎక్కువ ఆనందం కలుగుతుంది. ఆమె ఆనందాన్నికూడా, తను చూడగలడు....ఆబ్బ! ఎంత సుందర దృశ్య మది!

పెంపుడు తల్లిరిగూడా పోగొట్టుకొని యీ విశాల విశ్వంలో ఒంటరినైపొయ్యా ననే దిగులుతో, విచారంతో కుంగిపోతూ, నమ్ముకున్న తన గతి ఏమైందోనని ఆతృతతో ఎదురుచూస్తూ వుంటుం దామె! తనే వెళ్తే ఆమె యీ దిగులును పూర్తిగా వదలగొట్టగలడు. మహానదిలా ఆమె విచారం, ఆనందసాగరంలో లీనమవుతుంది. ఆమె రాసిన రెండు ఉత్తరాలకూ తను జవాబివ్వలేదు....పాపం! తనను మరిచిపోయి వుంటాడని అనుకుంటోందేమో? ఆమె చూపిన సానుభూతికి తనేం ప్రతిఫలం చెల్లించగలడు?

రాధాదేవిని తలుచుకుంటూన్న కొద్దీ అతను ఆతృతతో దహించుకొని పోసాగాడు. సాయంత్రందకా బండిలేదు. రెక్కలన్నా వుంటే ఎగిరివెళ్ళి అక్కడ వాలేవాడు కదా! ఊహలవేగంతో పరుగెత్తలేని కాలం, కాలం వేగంతో పరుగెత్తలేని తను—ఈ వ్యత్యాసాలకు తట్టుకోలేని స్థితిలో పడ్డాడు. రాధాదేవి తనలో కలిగించిన యీ

- పదవతరగతి మార్కుల టేబులేషన్‌కు
మామూలుగా ఒకటిన్నరలక్షే ఖర్చయేదట -
ఈసారి కంప్యూటర్ వాడినందుకు
పదిలక్షలు ఖర్చయిందట !!



ఆవేశం నిజంగానే భరించలేనంత బలవత్తరంగా వుంది....

"మీ బెడ్ దగ్గిరికి వస్తారా—బ్రెక్‌ఫాస్ట్ ఇస్తాను."

భావిని మింగేసి వర్తమానం ఎదురవగానే ఊహలు మరి సాగలేదు. జానకి నవ్వు మొహంతో ఎదురుగా వుంది. జానకి! మూర్ఖురాలు! పరిస్థితులు తనకు అనుకూలిస్తే తనను అంగీకరించేందుకూ, ఎదురుతిరిగితే విడనాడేందుకూ సిద్ధపడిన రాక్షసి!

స్వార్థం లేకుండా బతకటం కష్టమే కాని, ఆ స్వార్థానికి ఇతరుల్ని బలిపెట్టినప్పుడు, ఆ యజ్ఞపశువులు పొందే ఆవేదన తనకు ఇప్పుడే తెలిసింది. జానకి విషయంలో తను పొందిన ఈ ఆవేదనలాటిదాన్నే, తన కారణంగా రాధాదేవి పొందివుంటుంది. ఆమె స్వార్థత్యాగిగా, ఆ వ్యధనంతా భరించేందుకు సిద్ధపడింది. ఆమె ప్రణయంలోని పవిత్రత, నైర్మల్యం—ఈ ప్రపంచంలోనే సాధ్యమౌతుందనేది, తన దృష్టికి ఒక కట్టుకథ మాత్రం కాదు!

"ఏమిటి ఆలోచిస్తున్నారు?....రాధాదేవిని గూర్చా?" అందామె.

వొళ్లు మండిపోయింది జగన్నాథానికి. ఎదుట లేనివాళ్ల మీదకూడా ఈమె ఇలా పడి

ఏడుస్తుం దెందుకు? ఒకవేళ తమాషాకు అని వున్నప్పటికీ, అనాలోచితంగా, అసందర్భంగా వ్యక్తుల్ని గాయపరిచే ఉద్దేశ్యమే ఐ వుండాలి, 'ఔను', అని చెప్పి ఆమెను నొప్పించటం, లేదా వాద ప్రతివాదాలకు అవకాశం ఇవ్వటం అనవసర మనిపించింది.

"ఉహుఁ....ఏం లేదు....వొస్తున్నాను—!"

ఆమెను అనుసరించి జగన్నాధం బెడ్ దగ్గిరికి వెళ్లాడు. బ్రెక్ ఫాస్ట్ తీసుకుంటూన్నప్పుడు జానకి ఎదురుగా కూర్చుని తన విజయాన్ని సూచిస్తున్నట్లు గర్వంగా నవ్వుతూనే వుంది. ఎంత పిచ్చిలో, భ్రమలో పడిపోతోం దీమె అనిపించిం దతనికి. ఈ విజయం తన దనుకుంటోంది ఆమె—కాదు—ఆ విధిమీదనే రాధాదేవి సాధించిన విజయ మిది! ఆ సంగతి తనొక్కడికే తెలుసు.

మధ్యాహ్నంవరకూ జానకి తన జోలికి రాకుండటం అదృష్టమే అనిపించింది. మధ్యాహ్నం భోజనమయాక "నన్ను యీ సాయంత్రం డిస్ఛార్జ్ చేస్తారా?" అన్నాడు జగన్నాధం.

"మహారాజల్లే!....రాత్రి నేను ఖచ్చితమైన జవాబు చెప్పలేకపొయ్యాను. ఆ శేషించిన ప్రశ్నకు యిప్పుడు జవాబు...." అంటోంది జానకి.

ఆమె మాట పూర్తిగాకముందే "జానకీదేవీ! మీ జవాబేమిటో నాకు తెలుసు. కనుక మీరు చెప్ప నవసరం లేదు" అన్నాడు జగన్నాధం.

"అంటే....?....అర్ధమేమిటి?"

ఆమె మొహం వెలవెలబోతోంది. ఊహించని అపజయమేదో ఎదురైనప్పుడు పొందే నిరాశ ఆమెను ఆవరించేందుకు సిద్ధంగా ఉండగా కలిగే భయం ఆమె ముఖంలో స్పష్టంగా కనిపిస్తోంది.

"అర్ధమేం లేదు....నేను సాయింత్రం వెళ్ళిపోతున్నాను. అంతే!"

"అయితే, నా సంగతేం చేస్తారు?"

"నా స్థితి యెటో తేలేవరకూ, నీ వెలా నిర్ణయించుకోలేకపొయ్యావో, నేనూ నా నిర్ణయాన్ని చివరిదాకా దాచివుంచాను. యిప్పుడు నీ నిర్ణయాన్ని నా నిర్ణయం ఖండిస్తోంది...."

జానకి దిమ్మెరపోయింది ఎండమావును నమ్ముకున్న పాంధుని స్థితిలో పడిందామె.

"ఇదా చివరికి మీ రనేది? ఆడపిల్లలను నమ్మించి, ప్రణయం జరిపి చివరకు నట్టేట్లో ముంచటమేనా? మీరు ఎగతాళిగా మాట్లాడకండి—"

"నేను చాలా సీరియస్‌గా చెపుతున్నాను. నేను నిన్ను స్వీకరించలేదు" అన్నాడు

జగన్నాథం నిశ్చయాన్ని సూచించే కంఠస్వరంతో.

"ఎందుకనీ? నిన్న మొన్నటిదాకా మీరు చూపిన ప్రేమంతా నటనేనా?" అన్నది జానకి ఆవేదనను వ్యక్తపరుస్తూ.

"కారణాలు అడగొద్దు జానకీ! జీవితంలో యెదురయ్యాం; విడిపోతున్నాం: బహుశా మళ్ళీ మనం ఎన్నటికీ కలుసుకోం. అందుకు విచారం లేదు.... నేను నిన్ను నమ్మించి మోసం చేసిందేమీ లేదు."

"లేదా?" అందామె విచారంతో నిండిన కంఠస్వరంతో. ఈ ఉద్దేశం ఉన్నవాళ్లు యింతదూరం యెందుకు రానిచ్చారు? నేను నమ్మినట్లయితే, యిప్పు డీ స్థితిలో ఎందుకు వుంటాను?"

"జానకీ! నేను నిన్ను మోసం చేయలేదని మరోసారి చెపుతున్నాను. ఆ మాట కొస్తే నీవే నన్ను మోసం చేసేందుకు సిద్ధమయావు."

"నేనా?....మీకు దృష్టి వొచ్చాక మతిపోలేదు కదా?"

నిర్లక్ష్యంగా నవ్వాడతను. "లేదు. ప్రమాదంలో దెబ్బతిన్నది కళ్లు కాని మతి కాదు. మతి దెబ్బతిన్నట్లయితే నిన్ను స్వీకరించి ఉండేవాణ్ణేమో?....నా కీ దృష్టి రానట్లయితే నన్ను నిరాకరించే దానివి కదా! అది మోసమయ్యేది కాదా? నన్ను యథాతథంగా గాక, నా చుట్టూవున్న యితర పరిస్థితుల బాగోగులమీద ఆధారపడే టంత బలహీనమైనది నీ ప్రణయం. ఎప్పుడైతే నీవు గోడమీది పిల్లివాటానికి తలా పడ్డావో అప్పుడే, ఆ క్షణంలోనే నిర్ణయించుకున్నాను—నీకూ నాకూ పొత్తు కుదర దని" అన్నాడు.

"నన్ను క్రింద తోసేసే ఉద్దేశ్యంతోనే ఎంత ఎత్తు తీసుకెళ్ళారు! అయాచితంగా ఎన్ని ఆశలు పెట్టారు! ఎంతమంది రోగులు వొచ్చిపోవటం లేదు కనుక? మీరూ అందరిమాదిరే వుంటే నా కీ బాధ తప్పేది కదా!" అందామె ఖిన్నవదనంతో.

"అప్పుడేదో అనుకున్నాం కాని, నీవు మాత్రం అనవసరంగా ఎందుకింత దూరం వొచ్చావో ఇప్పుడు చెప్పలేవుకదా! ఆ మైకంలో ఉభయులమూ పొరబడి ఉండొచ్చు. అందువల్ల మునిగిపోయిం దేముంది?—జానకీ! ఒక్క శరీర సౌందర్యానికే మానవులు మూర్ఛపోవటం నిజమైనట్టయితే, అందచందాలు లేనివాళ్ళందరూ జీవిత మంతా దుఃఖపడుతూనే గడిపేవాళ్ళుకదా!"

"ఇప్పు డీ మెట్టవేదాంతంలో పడ్డారు! ఆనాడు చెప్పిన కబుర్లకూ, ఈ మాట లకూ ఏమన్నా సంబంధం వుందా! ' అంది జానకి.

"మనుషులకే సంబంధం లేకుండా పోతున్నప్పుడు. మాటలకు సంబంధం ఎందు

ఘంటుంది జానకీ. నీ అభిప్రాయాన్ని మార్చుకునేందుకు నీకు ఎంత అవకాశమూ, స్వేచ్ఛా వున్నవో, నా అభిప్రాయాన్ని మార్చుకునేందుకు నాకూ అంత అధికారం వుందికదా!—ఈ ఉద్రేకమంతా తగ్గించుకొని ప్రశాంతంగా ఆలోచిస్తే నీకీ సత్యం తప్పకుండా తెలుస్తుంది.''

వికటంగా నవ్విం దామె. ''ప్రశాంతంగా ఆలోచించటం! మీరు పోతూ పోతూ నా మనశ్శాంతిని కూడా పట్టు కెళ్తున్నారు. మళ్ళీ మామూలు మనిషినయ్యేందుకు కొంతకాలం పడుతుంది. మీ గాయాన్ని మాన్పుకున్నారు! నన్ను తీవ్రంగా గాయ పరిచి వెళ్తున్నారు. మీకు సేవచేసినందుకు, హృదయపూర్వకంగా ప్రేమించినందుకు ఈ మాత్రం ప్రతిఫలమన్నా వుండొద్దా?''

తర్కించటంవల్ల ఈమె చాలా బాధపడుతుంది. అందువల్ల సమాధానపడదు కూడాను. ఏవో తన అక్కసు తీర్చుకునేందుకు మాత్రమే ఈ సంభాషణ ఉపయోగ పడుతుంది. అదీగాక అవతల రాధాదేవిని కలుసుకోగల సన్నివేశాన్ని తలుచు కుంటూంటే, ఈ సంఘటన యెంతో పేలవంగానూ, అనవసరంగానూ తనకు తోచింది. ఈమె తనను నిజంగా యెంత ప్రేమించివున్నప్పటికీ తాను నిస్సహా యుడుగానే ఉండిపోకతప్పదు.

''జానకీదేవీ! ఈ నిరాశను ఎదుర్కోగల శక్తి సామర్థ్యాలు నీకున్నవి. కాలం గడుస్తే అంతా మరిచిపోవచ్చునే సంగతి నీకు తెలుసు. ఎన్ని అపజయాల్ని ఎదు ర్కొన్నప్పటికీ, జీవితాన్ని సాగించగల గుండె ధైర్యం నీకు వున్నందుకు అభినం దిస్తున్నాను'' అన్నాడు.

''మళ్లీ పొగడటం సాగించారా. నేనేం మీ వెంట పడతాననీ, మిమ్మ బతిమాలి భంగపడతాననీ భయపడ్డారు కాబోలు! నా పొరబాటువల్లనే ఇదంతా జరిగిందేమో! మొగవాళ్ళ మాటల్ని నమ్ముకున్న ఆడదానికి మొదటినుంచీ ఇలాటి మర్యాదలే జరిగిన సంగతి నాకు తెలుసు; ఇప్పుడు అనుభవంలోకి వచ్చింది—అంతే!'' అందామె.

జానకి తననెత్తిన పాలు పోసిందనిపించిం దతనికి. ఈమె ఎంత తీవ్రమైన గాయా నికి గురైందో, దాన్ని మాన్పటం తనకు సాధ్యమో కాదోనని భయపడుతున్నాడు. అన్నిటినీ మించి తన కాళ్ళకు చుట్టుకొని, జానకి యిక్కడ రభస ఆరంభిస్తే యెంత గొడవవుతుందో! ఎలాగో తను తప్పించుకో గలిగినప్పటికీ ఎంతమంది దృష్టిలో తను నీచపరచ బడతానోనని ఆలోచిస్తూన్న తనకు, అతి క్లిష్టంగా కనిపించిన యీ చిక్కుకు, దూముడి దొరికినట్లయింది.

''జానకీదేవీ! మరోసారి ధన్యవాదా లందుకోండి. జీవిత గమనంతో మీరు సరి




సమానంగా పరుగెత్తగలరు. మీలాటివాళ్ళు ప్రపంచంలో చాలా కొద్దిమంది. తగిలిన గాయాన్ని గూర్చి విచారించటంకన్న, దాన్ని మాన్పుకునేందుకు వెంటనే ప్రయత్నించగల తెలివితేటలున్నవి. మీరు సుఖపడగలరు—తప్పక!''

జానకి మొహం కళకళ్ళాడింది. ఒకపక్క తాను ఎదుర్కోగలిగిన అపజయం, మరోపక్క తన మనోబలాన్ని నిరూపించగలిగింది. ఈ సంగతి జగన్నాధం గ్రహించ గలుగుతాడనీ, అప్పుడు నిజంగానే అతను దిమ్మెర పోతాడనీ ఆమె అనుకున్నది అబద్ధం కాలేదు. తన గుండె నిబ్బరాన్ని జగన్నాథం మెచ్చుకోకుండా ఉండలేక పొయ్యాడు.

''నా సుఖాన్ని కోరిన మీకు కూడా సుఖం లభ్యమవగలదు. పరిస్థితుల్ని అనుకూలంగా తిప్పుకోగలిగిన సామర్థ్యం మీకు వుంది; అది నాకు చేతకాదు కనుక, ఇక మిగిలింది పరిస్థితులకు అనుకూలంగా మారటమే కదా!'' అందామె.

''ఏదైతే నేమి—జీవించటం ఒక కళ అనుకునేట్లయితే, ఆ కళ మీకు బాగా తెలుసు....పోనీండి జానకీదేవీ! మనం మిత్రుల్లాగే విడిపోతూన్నందుకు చాలా ఆనందంగా వుంది. ఇలా హృదయాలను విప్పుకొని మాట్లాడగలుగుతే జీవితం ఎంత హాయిగా, సాఫీగా సాగుతుంది!'' అన్నాడు జగన్నాధం.

'నే నీ మిత్రత్వాన్ని కూడా గుర్తుంచుకో దలచలేదు. అంతా ఒక కల అని

నన్ను నేను నమ్మించుకునేందుకు ప్రయత్నిస్తాను—అంతే!''

''కల!'' అన్నాడు జగన్నాథం. ''కలే! జీవితమే ఒక కల! కలలు మన ఇష్ట ప్రకారం యెలా రావో, జీవితం కూడా మన ఇష్టానుసారంగా నడవదు. కనుకునే అంత యింటరెస్ట్! మరీ అనుకోని ప్రమాదాలు వొస్తూంటే జీవిత గమనమే మారుతూ, దాని కొక వేగం, కొత్త వన్నెలూ వొచ్చి పడుతూ, గొప్ప సస్పెన్స్‌లో వూగిపోతూ, వేగంగా సాగిపోగలుగుతున్నాం ...ఇదంతా లేకుంటే జీవితం నిస్సారమే కదా!''

''సరే—జీవితాన్ని గూర్చి ఆలోచిస్తూండండి....నాకు పని వుంది. వస్తాను మరి—'' వెళ్లిం దామె.

రాధాదేవి సంగతి ఈమెకు చెపుదా మనుకున్నాడు కాని, అనవసరమని సరిపెట్టుకున్నాడు. చివరకు ఆ సాయంత్రం తనను సాగనంపేప్పుడు జానకీదేవి చాలా సంతోషంగా వున్నట్లే కనిపించింది. ఇంత తక్కువ వ్యవధిలో జానకి ఇంత తేలిగ్గా మారగలుగుతుందని అనుకోలేదు.

ఆమె ప్రణయం బొత్తిగా బలహీనమైనదై వుంటుందా?....కాదు....మొదట్లో ఆమె తన నిరాకరణకు తలకిందులైంది. కాని వెంటనే తట్టుకుంది. ప్రతి వ్యక్తికీ ఒకోరకం వేదాంతం వుంటుంది. అదే ఆ వ్యక్తిని నడిపించేది. అలాటి వేదాంతమే జానకిని ఎప్పుడూ ఆనందంవైపే తోస్తూ వుంటుంది....జానకిలాటి వాళ్ళు ఈ ప్రపంచంలో కోరినదాన్ని తప్పకుండా ఏనాటికన్నా సాధించగలుగుతారు. ఒకవేళ సాధించలేకపోయినా, కుంగిపోయి విచారపడరు!

''వొస్తాను జానకీదేవీ!'' అని ఆమెకు నమస్కరించాడు.

ఆమె కూడా ప్రతి నమస్కారం చేసింది.

బండి రేపిన దుమ్ములో ఒకరి కొకరు కనిపించనంత వరకూ, జేబు రుమాళ్ళు గాలిలో ఊగుతూనే వున్నవి

# 10

రైలులో యెంత ప్రయత్నించినా నిద్ర రావటం లేదు. మిగతా ప్రయాణీకులు లైట్లు ఆర్పి నిద్రిస్తున్నారు. ఒకడు గుర్రు పెడుతూ, తను నిద్ర పోతున్నానని హెచ్చరిస్తున్నాడు కూడాను. వీళ్ళు ఇంత హాయిగా యెలా నిద్రపో గలుగుతున్నారో? తనకు కలిగిన అనుభూతుల్లాటివి వీళ్లను వేధించటంలేదు కాబోలు! లేక ఆ అనుభూతు

అన్నిటికీ అలవడి పోయారేమో?....ఐనా తన సంగతి ఆలోచించుకోక, వీళ్ళందరి సంగతీ తనకు ఎందుకు ?

పూర్వం యెప్పుడో, యెక్కడో కొంతమంది మహాపురుషులు అద్భుతాలు చేశారనీ, అద్భుతాలు జరిగినవనీ అంటారు, ఇదివరకు యిలాటి కాకమ్మ కబుర్లు తను నమ్మేవాడు కాదు. జాగ్రత్తగా పరిశీలిస్తే ఇప్పుడు తన జీవితంలో జరిగిన ఈ సంఘటనలన్నీ అద్భుతాలు కావా ? అద్భుతాలకోసం తను యెదురుచూడలేదు ; కాని అవ్వే తనను వెతుక్కుంటూ వచ్చి చుట్టుముట్టినవి.

ఒకో సంఘటనలోని 'కీడు'ను గూర్చి విచారిస్తాం కాని. ఆ కీడు వెనుకదాగిన మేలు బైటపడేవరకూ తెలిసిరాదు. తనకు కళ్ళు పోవటం, మళ్ళీ రావటం ! ఇంతకు మించిన అద్భుతం ఏముంది ? ఆ కీడును ఆశ్రయించిన 'మేలు' రాధాదేవి రూపాన ఎదురైంది ; కాదు—ఎదురై తన హృదయాన్ని అర్పించి, వరించి, తరింపజేసింది. దురదృష్టాలవలెనే అదృష్టాలుకూడా గుంపులు గుంపులుగా వచ్చిపడుతూంటవి కాబోలు!

ఈ వచ్చిన దృష్టి మళ్ళీ పోతుందేమో నన్నంత భయంతో నిద్రరావటం లేదేమో ననిపించింది. ఐనా మేలుకున్నప్పటికీ చుట్టూవున్న చిమ్మచీకటిని చీల్చుకుంటూ పొయ్యే రైలుమోత ఒక్కటే వినిపిస్తోంది. బైట కొండలే ఉన్నవో, పుట్టలే ఉన్నవో, చెట్లే ఉన్నవో, దెయ్యాలు నాట్యమే చేస్తున్నవో తెలియటం లేదు. మేలుకొన్నా చూడలేని ఆ దృశ్యంలో తనకు నిద్రపట్టకుండా చేయగల సామర్థ్యం వుండేందుకు వీల్లేదు.

శరీరం విశ్రాంతి తీసుకుంటూన్నప్పటికీ, మెదడు పనిచేస్తూ తనకు నిద్ర రానివ్వటంలేదు. ఔను....అదంతా తలుచుకొని తను పులకరిస్తున్నాడు. తెల్లారేప్పటికి తనా స్టేషన్‌కు జేరుతాడు. అక్కణ్ణుంచి ఆరుమైళ్ళు బండిమీద వెళ్తాడు. రాధాదేవి తనను చూడగానే వచ్చి కాళ్ళమీద పడుతుంది. తనకు కళ్ళొచ్చినందుకు ఆనందాశ్రువుల్తో తన పాదాలు కడుగుతుంది. ఆ ఇలవేల్పు దర్శనంతో తను పావనమౌతాడు...

రాధాదేవి యెలా వుంటుందో తెలియదు. ఆమె తనను గుర్తించగలదు కాని. తానామెను గుర్తించలేడు. ఐతేనేం —ఆమె కంఠస్వరం తనకు బాగా తెలుసు. కరుణాపూరితమైన ఆమె మాటలకు ఎండి మోడైన హృదయాలే చిగిరిస్తవి !

తన ఊహాపథంలోని రాధాదేవికీ, నిజమైన రాధాదేవికీ తేడా వుండొచ్చు. కాస్త కుడి ఎడంగా సరిపోతారు....ఆమెను తనవెంట తీసుకొని వెళ్తాడు. ఇన్నాళ్లూ తనను పెళ్ళి చేసుకోమని సలహాలిచ్చిన మిత్రులకు మరి శ్రమ వుండదు....ఆ జీవితాన్ని తలుచుకుంటేనే యింత గొప్పగా వుంటే—యిక అనుభవిస్తుంటే

లైటువేసి గడియారం చూశాడు. ఒంటిగంట దాటింది. ఆవలింతల్ని తోసుకుంటూ వొచ్చే తలపుల తాకిడి వేడి తగ్గలేదు. ఒకపక్క ఆకాశం ఎర్రబడింది. చంద్రోదయ సమయం.... అలాగే చూస్తూ కూర్చున్నాడు.

చందమామ మెల్లిగా బైటపడుతున్నాడు. ఎంత చల్లగా, అందంగా వున్నాడు! భూమిమీద పుట్టాక, మొట్టమొదటిసారి చందమామను చూసినప్పుడు కలిగేటంత ఆనందం కలిగింది. వెన్నెల వొత్తుగా, గమ్మత్తుగా భూమిమీదికి జారుతోంది; పోగులు కనిపించని సాలెగూడల్లే ఆవరించేసింది. తెల్లారితే వుండని ఈ వెన్నెల్నిగూర్చిన దిగులుకూడా ఆరంభమైంది. తాత్కాలికంగా వుండేవాటికే ఈ విలువలూ, ఆత్రుతాను. జీవితంకూడా తాత్కాలికం కనుకనే యెంతో 'యింటరెస్ట్'ను కలిగిస్తోంది. చంద్రుడు యెప్పుడూ వుంటే, వాడి మొహం చూసేవా డుండడు కదా!

—అంతేకాదు. జీవితంలోని కొన్ని వెన్నెల రాత్రులే పిచ్చెక్కిస్తవి. మరి కొన్నిటిని గూర్చి అసలు తలచనే తలచం....ఎందుకనీ? పిచ్చెక్కించిన వెన్నెలలోని విశేషం, తలచని వెన్నెలలోని లోపం ఏమిటి? బహుశా వెన్నెల యెప్పుడూ ఒక్కటే! మార్పల్లా మనిషి 'మూడ్'లోనే ననేందుకు సందేహ మేమిటి? భోజనం రుచి, వంటకాలమీదకన్న, ఆకలిమీదనే ఆధారపడి వుండటం తనకు తెలియదా?

ఎంత విచిత్రం—ఈ చంద్రుడు! నీకు కావాలంటే ప్రకాశించడు; అక్కర్లేదంటే ఊరుకోడు. ఎవ రేమనుకున్నా, యెవరు అనుభవించనీ, మాననీ తన పని చేసుకొని పోతాడు....ఇదేవేళ, రాధాదేవి కూడా మేలుకొని ఈ చందమామను చూస్తూ, తనను గూర్చి ఆలోచిస్తూ వుంటుందేమో?....ఎందుకు కాకూడదు? తనవలెనే ఆమె కూడా చందమామను గూర్చి ఆలోచిస్తూ తనలోతాను మధనపడుతూంటుందేమో? ఒకే చందమామ, యిద్దరు వ్యక్తులకూ ఒకేరకం అభిప్రాయాల్నిచ్చి కలిపేందుకు వుపయోగపడుతున్నా దనిపించింది.

రాధాదేవి స్మరణే యిక జీవితంలో తనకు మిగిలేది, ఇంత పెద్ద జీవితాన్ని తరిచి, తాను పొందిన అమృత మామె! ఎంత తరిచినా చివరకు మిగిలేదేమీ లేక నిరాశతోనే మట్టిలో కలిసిపోవాల్సిన దురదృష్టం తనకు దూరంగానే వుంది....రాధాదేవికూడా యిలాగే అనుకుంటుంది....రేపు ఆమెను అడిగినప్పుడు అంతా తెలుస్తుంది.

ఈ వెధవ రైలు చకచకా పోదేం? ఈ ఇంజన్ డ్రైవర్‌కు కూడా ఒక ప్రియురాలుండీ, ఆమె యెదురుచూస్తూ వున్నట్లయితే తెలిసేది! కాలం స్తంభించిందేమో నన్నంత ఆత్రుత వేధిస్తోంది. కాలాన్ని భాగాలు చేసుకుని చూస్తుంటే మరీ చిల్లర బేరం తాలూకు తలనొప్పి, కొద్దికొద్దిగా తెలియకుండానే జారిపోతోందనే భయం



కలుగుతూన్నవి.

జీవితం యెంత విచిత్రమైనది! జీవితాన్నిగూర్చి రాయమంటే ఒక్కొక్కరు ఒక్కొక్క అభిప్రాయాన్నిస్తారు కాబోలు! జీవితాన్ని గూర్చి ఇన్నాళ్ళూ తనెన్నిసార్లు తర్కించుకొన్నాడు! రకరకాల ఆలోచనల సారంగా, ఒక అభిప్రాయం కలగటం, కొన్నాళ్ళయ్యాక మళ్ళీ మారటమూను....ఇప్పుడు జీవితాన్ని తను ఏమనుకుంటున్నాడు?

ఇది ఒక వ్యాపారం, బేరం లాటిది. జీవితం చంపుతానని బెదిరించింది; తను బతిమాలుకుంటే కళ్ళు లొట్టపరుస్తా నంది; మళ్ళీ తను భంగపడితే—కాదు రాధాదేవి ప్రార్థిస్తే—యీసారికి వదిలాను పొమ్మన్నది....అలాగే రాధాదేవిని తనకు ఇమ్మని ప్రార్థిస్తే జీవితమనే వ్యాపారి ఒప్పుకున్నాడు. ఇదే విధంగా జానకి తనను యిమ్మని

అర్థిస్తే యివ్వలేదు! ఇలా గీకి గీకి బేరమాడి రాధాదేవిని పొందాడు తను! జీవితం వ్యాపారం గాక మరేమిటి?

చందమామ బాగా పైకి యెగబాకాడు తనను చూచి నవ్వుతున్నా డనిపించింది కాదు.... చందమామను చూసే తను నవ్వుతున్నాడు.... అలాగే యెంతోసేపు మేలు కున్నాక, తనకు తెలియకుండానే కునుకు పట్టింది.... తెల్లారి లేచాక, తర్వాతి స్టేషనే తను దిగేదని తెలిసి అమితానందమైంది.

దిగాల్సిన స్టేషన్ రాగానే ఆతృతతో దిగాడు. తనతోపాటు చాలా కొద్దిమంది ప్రయాణీకులే దిగారు. అస లీ ప్రాంతంలో ఒక వూరున్నదనీ, అక్కడ ప్రణయ దేవతావతారంలో రాధాదేవి వున్నదనే సంగతి త నొక్కడికే తెలుసు. అదీ మంచిదే —యిలాటి కొన్ని రహస్యాలు జీవితాన్ని నడిపించి, మురిపించి ముందుకు సాగ నిస్తున్నవి. ఇలాటి రహస్యాలే విజ్ఞానాన్ని కొద్దిమందికే దక్కేట్లుగా చేసినవి. మనిషి వ్యక్తిత్వాన్ని కాపాడుతూన్నవి కూడాను.

ముందుగా వైర్ చేసివుంటే రాధాదేవిని యిక్కడే కలుసుకునేవాడు కదా! తన కీ ఆతృత, దోవ తెలీని పొంధుదు పడే ఆవేదన వుండేవి కాదు కదా!....కాదు, తన కోసం ఆమె యింత పొద్దున్నే వచ్చే శ్రమను తప్పించాడు. అసలు అనుకోకుండానే ఆమెను కలుసుకుంటేనే బావుంటుంది. అంతా ముందుగానే తెలుస్తే సారస్యం ఏముం టుంది కనుక?

తను వెళ్ళాల్సిన ఊరు ఆరుమైళ్ళు. చేతి సంచీ తప్ప మరేంలేదు. బైటికి వచ్చి చూస్తే ఇవ్వాళో రేపో యీ మాయకాయాన్ని త్యజిస్తాననే స్థితిలోవున్న గుర్రం కట్టబడిన బండి వుంది. ఒకందుకు బాగానే ఉందనిపించింది—గుర్రానికి తగిన బండి అది; బండికి తగిన పీరులాంటి సాయిబు. ఇప్పుడు తనకు యిదే దిక్కు. నడుస్తే దీనికన్న ముందు వెళ్ళగలదేమో కాని దారి తెలియదాయె! అందుకని బండిని రెండు రూపాయిలకు బెరమాడి ఎక్కి కూర్చున్నాడు.

గజ మొక మైలుగా నడక సాగించిందా బండి. పోయిన కొద్దీ దూరం పెరుగు తోందో, తరుగుతోందో తెలియటంలేదు. విసుక్కున్నాడు; గుర్రాన్నీ, బండివాణ్ణీ కూడా తిట్టుకున్నాడు. తన తిట్లకూ, దీవెనలకూ ఫలితంలేదని తేలాక మెదలకుండా వూరుకున్నాడు. దారంతా ఒకచే గతుకులు. గమ్యస్థానం జేరాక ఎముకలకు టాంకాలు వేయవలసి వొస్తుందేమో....ఏమైనా తను కలుసుకోబొయ్యే రాధాదేవినిగూర్చి తలుచు కుంటే యీ బాధలన్నీ ఒక లెక్కలోవి కావు.

ఎలాగో ఎనిమిదింటికి ఆ పల్లెటూరు జేరాడు. బండి యెవరింటికి వెళ్ళాలని

అడిగాడు, బండివాడు.

"రాధాదేవి....అదే....రాధా!"

"రాధ?....ఏ రాధ....ఎవరు?"

ఎవరని చెప్పగలడు తను? ఆమె యెవరో, యెలా వుంటుందో తనకు తను చెప్పుకోగలడు కాని, మరొకరికి తెలియ చెప్పటం యెలా?

"అదే....ఆసుపత్రిలో నర్స్‌గా వుంటుందే........యీ మధ్య ఆమె తల్లికూడా పోయిందే...." అని నీళ్లు నమిలాడు జగన్నాధం.

బండివాడు కాస్త ఆలోచించి "ఓ....రాధా...." అని ఆశ్చర్యంగా జగన్నాధం వైపు ఎగా దిగా చూశాడు. వాడి చూపులకు అర్థం తెలియక జగన్నాధం వేరొక దిక్కు చూశాడు.

బండి సాగింది. ఇది సుందరమైన పల్లె అనుకున్న తనకు చాలా నిరాశ కలిగింది. ఎదురైన ప్రతివాళ్ళూ తనను పరామర్శించినట్లు విచిత్రంగా చూడటం, చూపులతోనే గాయపరుస్తున్నట్లు తోచింది జగన్నాధానికి. తనను దేవ దూతగా భావిస్తున్నారో, వింత మృగంగా లెక్కవేస్తున్నారో తెలియలేదు.

బండి దాదాపు ఊరి చివరకు వచ్చింది. చూపు అనినంత మేరా పూరిళ్లు తప్ప మరేం లేవు. ఏ యింటిని చూసినా అనారోగ్య వాతావరణం కనిపిస్తోంది. రాధాదేవి యిలాటి పూరింట్లోనే వుంటోందా?

"ఎంత దూరం?"

"అదుగో....ఆ కనిపించటంలా—తాటిచెట్టు—అక్కడ" అన్నాడు బండివాడు చరణాకోలు కర్రతో చూపుతూ.

కళ్ళు పెద్దవిచేసి చూశాడు....మామూలు పూరికొంప కాకపోతే మిగతావాటికన్నా కాస్త శుభ్రంగా వున్నట్లు తోచింది. అయితేనేం—తను యీ పూరికొంప కోసం కాదు వచ్చింది....యిందులో శాపగ్రస్థయి నివసించే తన దేవత రాధాదేవికోసమాయె! బంగారం మట్టిలోనే కలిసి వుంటుంది మరి!

ఇంటిముందు బండాగింది. ఒక్క ఉదుటులో కిందికి దూకాడు జగన్నాధం. ఇల్లు గొళ్ళెంపెట్టి ఉంది. ప్రశ్నార్థకంగా బండివాడి వైపు చూశాడు.

"నీళ్ళకు పోయివుంటుంది—" అన్నాడు వాడు.

బండివాడికి డబ్బిచ్చి, ఇంటి ముందున్న మట్టి అరుగుమీద కూలబడ్డాడు జగన్నాధం. దృష్టికి కనిపించిన ప్రతి చీరె కుచ్చెళ్ళనూ రాధాదేవిగానే భావించసాగాడు. వాళ్లు ఈ ఇంటివరకూ రాకపోవటంతో నిరాశ చేసుకుంటున్నాడు....ఇది ఊరికి చివరి

ఇల్లు. ఇక్కడ రాధాదేవి యెలా వుండగలుగుతోందో? ఐనా ఆమె పెంపుడు తల్లి కదా ఇక్కడ వుండేది? రాధాదేవి చాలారోజులు ఈ ఇంట్లోనే గడిపి వుంటుంది. ఆ కారణంగానే ఇది తనకు పవిత్ర స్థలం!

నిమిషాలు యుగాలుగా దొర్లుతూన్నవి. ఇంతవరకూ యెలాగో ఆగగలిగిన తను, ఇక ఓర్చుకోలేని స్థితిలో కాలు కాలిన పిల్లివలె అటూ ఇటూ తిరగసాగాడు....సందు చివర గచ్చకాయ రంగుచీరె కనిపించింది....రాధాదేవయి వుంటుందా! నిదానంగా చూశాడు....కాదేమో? విధి తన ఓర్పును పరీక్షిస్తోంది....ఆ వచ్చే అమె రాధాదేవి ఐ వుండేందుకు వీల్లేదు. రాధాదేవి నడకే హంస నడక. సముద్ర తరంగాలవలె కదులుతూ వస్తూండాలి. ఆమె ఆకృతి, ఎత్తు, వొడ్డు, పొడుగు మొదలైనవి—యిటు వచ్చే వ్యక్తిలో ఆ పోలికలే లేవు. కాదనుకొని మళ్ళీ తన వలపు తలపుల్లోకి కొట్టుకొని పొయ్యాడు జగన్నాథం.

ఆమె వచ్చి వచ్చి యీ యింటిముందే ఆగింది. ఎవరై వుంటారా అని ఒక్క-క్షణం యెగాదిగా చూశాడు. బహుశా రాధాదేవి దాసీదై వుండొచ్చనిపించిం దతనికి.

....కాని ఆమె చిరునవ్వుతో, చేతిలోని పాలగ్లాసు కిందపెడుతూ నమస్కరించింది. ఏమిటీ! ఈమె—రాధాదేవి కాదు కదా? ఒక్క-క్షణంలో మనసులో రామ రావణయుద్ధం ఆరంభమైంది. ఈమె రాధాదేవి ఐవుండదని అంతరాత్మ పీకె నొక్కుతున్నాడు. మరి రాధాదేవి కాకుంటే తన కెందుకు నమస్కరిస్తుంది?

"రాధాదేవి యెక్కడున్నారు?" అన్నాడు అనుమానం తీరక.

"మీ కెదురుగా!" అందామె తీయని కంఠంతో.

సందేహం లేదు. ఈమే రాధాదేవి! విధి తనకు ఇంత కఠిన పరీక్ష పెడుతుందని యెన్నడూ అనుకోలేదు. ఆమెను ఒక్కసారి జాగ్రత్తగా పరిశీలించాడు.

చతురస్రమంగా వున్న మొహం, చెదలుపట్టిన గోడల్లే వున్న మశూచి మచ్చలు; ఆ వ్యక్తికి సంబంధించిన ముక్కూ, చెవీ, నోరూ అతికినట్లున్నవి కాని, వాటి కొక తీరే లేనట్లు వుంది. కళ్ళల్లో జీవకళ వుందికాని, దాన్ని మింగేస్తూన్న ముఖ కళ భరించలేనిది. పొట్టిగా, గున్నేనుగల్లే దొర్లుకుంటూ వచ్చిం దీమె. తనను నూతిలోకి తోసి, మరి పైకి లేవకుండా ఈ బరువుమీద వేసేందుకేమో?

కాళ్ళకింది భూమే కంపించింది. మూర్ఛ పర్యంతమై అతి కష్టంమీద నిలవ తొక్కుకొన్నాడు....తన హృదయంలోని రాధాదేవికీ, ఈమెకూ ఎక్కడా పోలిక లేదు. కష్టపడి ఉత్తరధృవం చేరాక, దక్షిణధృవం ఎంత దూరమో తెలిసినట్లయింది. ఈమెను—ఈ అనాకారిని తనెలా ప్రేమించగలిగాడు? అదంతా కలే ఐతే, తప్పు

– మా అమ్మాయికి "సోషలిజం" అని పేరు పెట్టాను!



కుండా అది పీడకలే ఐవుండాలి. ఆ పీడకలంతా కరిగిపోగలిగినా, నాయకీ నాయకులైన తా మిద్దరూ సజీవంగా మిగిలిపోవటమే శోచనీయం!

ఆమె దగ్గిరికి వచ్చి కదిపాక మళ్లీ వర్తమానంలోకి పడ్డాడు.

''ఎందుకలా వణికిపోతున్నారు? నేనే రాధాదేవిని!....లోపలికి రండి—'' అని చెయ్యి పట్టుకొని తీసికొనివెళ్ళి నులకమంచంమీద కూర్చోబెట్టింది. దుర్బలునివలె, నిస్సహాయునివలె తయారైంది అతని పని! కదలలేదు. మెదలలేదు. వందల వోల్టుల కరెంట్ ఇంకా శరీరంలో ప్రవహిస్తోంది.

''ఏమండీ! మాట్లాడరేం?—మీ దృష్టి వచ్చినందుకు నాకెంతో ఆనందంగా వుంది. నేను చెప్పలేదా—భగవానుగ్రహం వుంటుందని?'' అందామె.

ఇంతకుపూర్వం కూడా ఆ భగవానుడు దయామయుడనే తనూ భ్రమపడ్డాడు. కాని ఆ దయ వెనక దాగిన ఈ నిర్దాక్షిణ్యం సంగతేమిటి? తనకు దృష్టి నిచ్చింది యీ కురూపిని చూసేందుకేనా?

ఎలా అన్వయించుకోవాలన్నా ఇదంతా కుదరకుండా వుంది. ముందసలు మాట్లాడాలి—కాని ఏం మాట్లాడాలి? ఎలా మాట్లాడాలి? తన అంతరాత్మకు తాను జవాబు చెప్పుకోలేక పోతున్నాడు.

ఆమె తన భుజం పట్టుకొని కుదుపుతోంది. మూర్ఛిల్లటం ఒక్కటే తక్కువగా మిగతా లక్షణాలన్నీ జగన్నాధంలో ఆమెకు కనిపిస్తున్నవి. అతని మొహమంతా

స్వేదబిందువులతో నిండిపోయింది. అగ్నిపర్వతం పగిలి వెలువడేలాగుందా చెమటః లోని తెక తెకకు ఉడికిపోతున్నాడు.

రాధాదేవి పమిట చెంగుతో మొహం తుడిచి, మంచినీళ్లు పట్టింది. ఆ తరువాత విసనకర్రతో విసరసాగేక, జగన్నాధం మళ్లీ యీ లోకంలో పడ్డాడు.

"ఏమండీ—ఏమైందీ?—నాకు గాభరాగా వుంది—చెప్పండి. మాట్లాడండి ముందు—" అందామె ఆతృతతో.

జగన్నాధానికి బాగా తెలివి వచ్చినట్లయింది, మరొక్కసారి తన ఆరాధ్య దైవాన్ని చూడా లనుకున్నాడు. కాని వెగటేసి. షాక్ తగుబుతుందేమోనన్న భయం కలిగింది. ఐనప్పటికీ చూడకుండా వుండలేకపోయాడు. అనుమానం వేసి కళ్లు నలుపుకొని మరీ చూశాడు—అదే రూపు! మానసికంగా మార్పేమైనా వుండాల్సిందే కాని, భౌతిక నేత్రం చూసేదాంట్లో పొరపాటేమీ లేదని ఖచ్చితంగా తెలుస్తూనే వుంది.

రాధాదేవిలో కలిగిన సంచలనం చూస్తే జాలివేసింది. తనిలా ఎందుకు తలకిందు లయ్యాడో ఎలా చెప్పడం? పాపం ఏమనుకుంటుందో?

"ఏమండీ—మాట్లాడరూ?" అంది రాధాదేవి బతిమాలుతూ.

కళ్ళు మూసుకుంటే, ఆ మాటల మాధుర్యం, ఆ వ్యక్తిత్వపు గొప్పతనం తెలుస్తోంది. కాని తనకు దృష్టి వచ్చింది కనుక, కళ్లు మూసుకోగలగటం కుదరదు.

"ఏం లేదు—ఏదో గుర్తుకొచ్చి—" అన్నాడు.

"ఉండండి—వేడి కాఫీ తీసుకొస్తాను" అని ఆమె వంటింటివైపు వెళ్ళాక కాస్త ఊపిరి పీల్చుకోగలిగినట్లనిపించిం దతనికి.

రాధాదేవి ఇలా వుంటుందని తెలిసినట్లయితే, యీ ఊబినేలమీద తా నీ గాలి మేడలు సృష్టించుకునేవాడు కాదుగదా! తానే కాకుండా, ఈమెను కూడా ఎవరెస్టు శిఖరం ఎక్కించాడు. తను నమ్ముకొని, తనను ఆధారంగా చేసుకొని ఆమెను ఎత్తుకు వెళ్ళింది. తనిప్పుడు కిందికి దూకి భరాయించగలడు కాని, ఆమె—!

తలుచుకుంటే ఆశ నిరాశల మధ్య ఏర్పడిన యీ లోయను పూడ్చటం తనవల్ల అయేది కాదు. ఈ జీవితమంతా నిరర్థకమైనట్లయింది. తను జీవితంతో బేరమాడి గెలుచుకున్నాననుకున్నాడు. ఎంత పొరపాటు! చెల్లని నాణాన్ని గుడ్డిగా తీసుకున్నాడు- అంతే!

కనీసం జానకి ముందు రాధాదేవి అందం—అందం! అందమనే విషయంమీద ఆలోచిస్తూంటే, రాధాదేవికి చోటెక్కడ? హృదయపూర్వకంగా ప్రేమించిన ఆ జానకిని కాదని, మూర్ఖునివలె హృదయాన్ని అర్పించిన రాధాదేవి దగ్గరికి వస్తే, తన

హృదయం యింత బరువెక్కుతుందని ఎప్పుడూ అనుకోలేదు కదా! అసలు వస్తువు పీడను చూపి ఆ వస్తువు సౌందర్యాన్ని అంచనా కట్టిన ఫలితమిది!

జానకిలాటి సౌందర్యవతి హృదయం పాషాణం! రాధాదేవి హృదయం నవనీతమే కాని, పై మెరుగేమీ లేదు. తా నింతవరకూ నిజంగానే రాధాదేవి హృదయాన్నే ప్రేమించాడు: కాని యీనాడు "హృదయాన్ని ప్రేమించగలగటం" అసంభవం గానూ, కేవలం మతిభ్రమణంలాగూ కనిపించింది. లోకమేదో మనను మోసం చేస్తోందని వాపోతాం గాని, మనను మనం చేసుకునే మోసంలో, లోకం చేసేదాన్ని పోలుస్తే అదొక లెక్కలోకి రాదేమో?

కాదు—విధి తనను మోసం చేసింది. రాధాదేవికూడా మోసం చేసిందా? కావాలని చేసివుండదు....ఏమైతేనేం తనను తాను మోసం చేసుకునే అవకాశాలు ఏర్పడినవి. ఐతే ఇప్పటికీ మించిపోయింది లేదు. తను మోసానికి గురికావటమా, లేక యితరులను—రాధాదేవిని మోసంచేసి చేతులు దులుపుకోవటమా? ఈ రెంటిలో కళ్లున్న తనకు ఏది ఎన్నుకోదగ్గదో స్పష్టంగా కనిపిస్తూనే వుంది.

రాధాదేవిని అన్యాయంచేసి, ఒంటరిగా దిగవిడచి పొయ్యేందుకు మనస్సు అంగీకరించటం లేదు. ఒకనాడు యీ మనస్సే రాధాదేవిని మెచ్చుకుంది కదా! ఇంద్రధనుస్సులాటి యీ మనస్సును ఆధీనంలో ఉంచుకోగలిగిన శక్తి తనకు లేదు; దాన్ని తిట్టుకున్నప్పటికీ, ద్వేషించినప్పటికీ, తన సామర్థ్యం తెలిస్తే అది ఫక్కున మొహంలో నవ్వుతుంది. దీన్ని జయించేందుకు తాను యీ జన్మలో ప్రయత్నించటంకూడా వృధాయే!

పాపం—రాధాదేవి! ఆమె రూపానికి ఆమె కారకురాలు కాదు, కావలసిన రూపమే పొందగలిగినట్లయితే ప్రపంచంలో కురూపులు ఉండేవారు కాదు; అందగాళ్ళూ వుండేవాళ్ళు కాదు! ఎందుకంటే అప్పుడు సౌందర్యపుటంతస్తు ఊహలో విపరీతంగా పెరుగుతుంది! రూపానికి ఆమె బాధ్యత లేనిమాట నిజమే కాని, సౌందర్యారాధకుడుగా పెరిగిన తా నామెను ప్రియురాలిగా స్వీకరించేందుకు తన మన సొప్పదు. చూస్తూ చూస్తూ ఎలా గోతిలో పడగలడు? రాధాదేవికి జీవితాంతంవరకూ కృతజ్ఞుడుగా వుండగలడు. ఆమెను జీవితాంతంవరకూ పోషించనూ గలడు; భక్తితో ఆరాధించి, పూజించగలడు....కాని—ప్రేమించలేడు. ప్రియురాలిగా ఆమెను అంగీకరించలేడు!

ఈ విషయాలన్నీ ఆమెతో చెప్పట మెలా? తను సగం చచ్చినస్థితిలో పడ్డాడు... ఎలాటి నిరాశాసాగరంలో తను మునగానాం తేలానాంగా వున్నాడో, అమెను తన స్థితికే తీసికొని రావల్సి వుంటుంది. ఈ ప్రణయ పర్యవసానం, కన్నీరే నని ఎన్నడూ

అనుకోలేము కదా!

రాధాదేవి తత్వంకూడా జానకి తత్వంలాటిదే అయితే యెంత బాగుండు! కాదు. రాధాదేవికి సజీవహృదయం వుంది. ఆమెలో యెంత భూతదయ, జాలి వున్నవో. ఆమె ప్రణయంకూడా అంత బలవత్తరంగానూ, గాఢంగానూ వుంటుంది. ఆమె మన సారా నవ్వగలదు ; ఏడ్వగలదు. ఆమె హృదయం గాయపడితే, దాన్ని మాన్పేందుకు కాలచక్రం కూడా వెనుకాడుతుంది.

జానకిలాగు వందేళ్ల జీవితాన్ని వందరోజులుగా, దుబారాగా ఈమె ఖర్చుచేయ లేదు. జానకి ప్రతి విషయాన్నీ పైపైన తడివి చూడగలదే కాని, లోతులకువెళ్ళే శ్రమకూడా తీసుకోలేదామె. కాని రాధాదేవి యీ లోతుల్ని తెలుసుకునే తత్వం గలది. జానకి బాధను కానీ, ఆనందాన్ని కానీ తనకు కాకుండా యెవరికో సంబంధించినంత తేలిగ్గా అనుభవిస్తుంది. అందుకనే ఆమెలో తీవ్రమైన అనుభూతి లేదు. అంతలోనే తమకు తాము సరిజెప్పుకోగల తత్వం వున్నవాళ్లు ఒకరకంగా సుఖపడగలరు కూడాను.

తనను బాధిస్తూన్న సమస్యల్లా యిప్పుడేం చేయాలని! తన అయిష్టాన్ని రాధాదేవి మొహం ఎదుటనే చెప్పే సాహసం లేదు. లౌకికమార్గంలో డొంక తిరుగుడుగా చెప్పాలి. తనెంత నీచానికి వొడిగట్టాడో ఆ సంగతి రాధాదేవి ఒక్కతే గ్రహించి నంత మాత్రాన ప్రమాదం ఉండబోదు కాని, ఆ విషయం తనకూ తెలుసు. తన నైచ్యాన్ని తానే భరించాలి. ఆమెను గాయపరుస్తూ, తనూ గాయపడతాడు!

విధి తనపట్ల కాఠిన్యాన్ని వహించేందుందుకు యీ సంఘటనను ఎందుకు ఎన్నుకోవాలి? ప్రణయాన్ని పరిపక్వదశ వరకూ పెంచి, ఈ ఘాతాన్ని ప్రసా దించింది. తను ఆ ప్రమాదంలో బతికి బైటపడింది—యిప్పుడీ ప్రమాదాన్ని ఎదు ర్కొనేందుకేనా?

భౌతికనేత్రం ఎప్పుడైతే చూడగలుగుతోందో, అప్పుడే మనోనేత్రానికి గుడ్డితనం వచ్చింది—తనలో వున్న దివ్యత్వమల్లా కళ్లు రావటంతోనే మాయమైంది. మాన వత్వమన్నా మిగిలివుండవలసింది కాని ఒక ధృవంనుంచి, మరో ధృవానికి విసిరి వేయబడినట్లుగా, రాక్షసత్వం ఒక్కటే తనలో పేరుకొనిపోయింది.

ఇంతదూరం పరుగెత్తుకొని వొచ్చినందుకు తనను తను తిట్టుకున్నాడు. తన పొరపాటుకు తను బాధపడుతూనే ఆ శిక్షనంతనూ రాధాదేవి పరం చేయక తప్పేట్టు లేదు. జానకిని అంత తేలిగ్గా వొదిలించుకో గలిగాడు. కాని యీమెను విడనాడేం దుకు గొంతు తెగిన సన్న జీవంవలె అంతరాత్మ ఎందుకిలా గిలగిలా కొట్టు కుంటుంది?




జాగ్రత్తగా ఆలోచిస్తే—జానకి పైకి దేవకన్య, అంతర్యంలో రాక్షసి; రాధాదేవి పైకి రాక్షసల్లే కనిపిస్తే మాత్రమేం, అంతర్యంలో దేవత్వం వుంది—ఈ యిద్దర్లో ఎవర్నీ తాను వరించలేడు. ఒకచోట భౌతికనేత్రం తృప్తిపడితే, మనోనేత్రం అంగీకరించ లేదు; మరోచోట భౌతికనేత్రం అసంతృప్తితో వుంటే, మనోనేత్రం మెచ్చుకునే సావకాశం కూడా లేకుండా మూసుకొనిపోయింది!

ఎటూ తేల్చుకోకముందే ఆమె వేడి కాఫీ తీసుకొచ్చింది. కప్పు చేతికి అందివ్వకుండా, అలవాటు ప్రకారమేమో, తానే తాగించింది. ఇంత ఆదరణను, కరుణను వర్షించగల వ్యక్తి తనకీ ప్రపంచంలో ఎవరున్నారు?....కాని యిలాటి కురూపి కాకుండావుంటే రాధాదేవి శాశ్వతంగా తన హృదయాధిదేవత అయ్యేది కదా!

కొత్త అనుమానం వొచ్చింది. రాధాదేవికి తెలియదా, తను అందగత్తె కాదని? తెలిసే వుండొచ్చు. ఈ ప్రణయమంతా మొదలుపెట్టి, దానికి చిలవలు పలవలు కల్పించి, ఒక రమ్యహర్మ్యాన్ని నిర్మించే ఉద్దేశ్యంతోనే పునాదులకుగాను తను గోతులు తవ్వాడు; కాని ఆ గోతుల్లోనే ఆ ప్రణయాన్ని పూడ్చిపెట్టి గోరీ కట్టాల్సి వొస్తుందని అనుకోలేదు కదా! అంతా తనమీదుగా తిరగబట్టే ఆమె తన అందచందాల్నిగూర్చి ఆలోచించి వుండదు. ఆనాడు హృదయపూర్వకమైన పవిత్ర ప్రణయమే, ఈనాడు నీచాతినీచమైన దేహ సౌందర్యాన్ని కాంక్షించి, కామరూపి అయింది. తనేమీ చేయలేని అశక్తతతో బాధపడుతున్నాడు.

ఈ ప్రదేశంలో మరి నిలవలేడు ఒకపక్క ఆమె రూపానికి బాధపడుతూ తాను చూపే ఏవగింపునుకూడా గమనించకుండానే తనమీద అనురాగ సుధను వెదజల్లుతుం దీమె! ఈ రెండు అనుభూతుల మధ్యా నలిగిపోతున్నాడు ఏదో వాక సాకుమీద బె టపడటం మంచిదనిపించింది. చెప్పే సాకు కారణంగా ఆమెకు తనమీద ఆశ వుండటం ఆమెకు చిత్రవధలాటిది. కనుక కష్టమో, సుఖమో ఎదుర్కోవటమే మంచిది.

"రాధాదేవీ!.... నేను వెళ్ళిపోతున్నాను" అన్నాడు. ఆమె మొహంలోకి చూపే ధైర్యం లేక.

' ఇప్పుడే కదా వచ్చింది; అప్పుడే వెళ్ళిపోతానంటారేమిటి?.........నన్ను మరిచి పొయ్యారేమో ననుకున్నాను సుమండీ!" అందామె.

మరచిపోయినట్లయితే యింత బాధ వుండేది కాదు; తానూ, రాధాదేవీ కూడా బతికి బైటపడేవాళ్ళు.

"మీ రిక్కడ యింకా వారం రోజులన్నా వుండాలి. నా అతిధ్యాన్ని కాదనకండి."

శాశ్వతంగానే రాధాదేవి సమక్షంలో ఉండాలని వుంది. కాని ఎట్లా? ఏ దేవత కరుణించి, రాధాదేవికి సుందర రూపాన్ని యివ్వగలదు? లేక తన మనస్సు మార్చ గలదు? తన కా దేవత్వం చాలా దూరమై పోయింది.

"వచ్చినప్పట్నుంచీ అన్య మనస్కంగానే వున్నారు. కళ్ళొచ్చిన సంతోషమే లేదు. మిమ్మల్ని చూస్తుంటే నా ఉత్సాహం కూడా తగ్గిపోతోంది___"

ఎంత అమాయకురాలీమె! కళ్ళు వచ్చినప్పుడు తనెంతో సంతోషపడ్డాడు! ఇక ముందు కూడా గుడ్డివాడు కాదని ఆనందించవచ్చు....గుడ్డివాళ్ళను చూసి నవ్వనూ వచ్చు....కాని తన యీ చూపే జీవితానికే ఘోరమైన తావుగా పరిణమించింది. ప్రియునిలోని నిరుత్సాహాన్ని తగ్గించుకున్న పిచ్చిపిల్ల!

యీ నిరపరాధిని యెలా శిక్షించగలడు? ఆమె ఆశలనన్నిటినీ ఒక్కసారిగా ఎలా నీట కలపగలడు? ఇప్పుడు సందర్భాన్ని అనుసరించి ఆమెకు అన్యాయం చేసి తను బైట పడినప్పటికీ, తన యీ నైచ్యం జీవితమంతా తనను వెన్నాడుతుంది; ఈ కల్మషాత్మను తను భరించాల్సిందే! ఆ సంగతి తెలిసే కావాలని తను పొరబడు తున్నాడు.

రాధాదేవి ఎంత సుగుణరాసి ఐతేనేం గాక, తనకు అతీతురాలే! చందమామ ఎంత అందమైనదైనా, దానిలోని మచ్చకే ఆ ప్రాధాన్యం. గురిగింజలోని ఎరుపుభాగం. నలుపు భాగాన్ని యెంత మింగేయ గలిగినా, దాని నలుపును గూర్చే చర్చిస్తాం కదా!

గులాబి యెంత సువాసనతో, అందంగా ఉన్నా, దాని ముళ్ళ సంగతి పట్టించుకో కుండా ఉండలేం కదా....యీ వాతావరణంలో పెరిగిన తను, ఒక్కసారిగా రెక్క లుంటేనే కాని పైకి ఎగరలేడు.

"మీరేదో చాలా దీర్ఘంగా ఆలోచిస్తున్నారు.........చాలా బాధపడుతున్నారు కూడాను....ఏమిటో నాతో చెప్పరా?" అందామె; నేలమీద కూర్చుని, ప్రాధేయపడే ధోరణిలో.

త నిం కెవరితో చెప్పుకుంటాడు? ఆ విధికి చెప్పుకున్నా వినదు. తనకు తను చెప్పుకోవటమూ అయింది. ఇక మిగిలిందల్లా ఈమెకు చెప్పుకోవటమే!

"రాధాదేవీ!" అన్నాడు చెప్పేమాటలు ఎవరివో నన్నే ధోరణిలో. "నీవేం చేయదలచుకున్నావ్?"

ఆమె నవ్వి అంది: "వంట చెయ్యదలచుకున్నాను."

ఆ వ్యవధిలోనే తనూ నవ్వాడు. తనను నవ్వించి కవ్వించ గలదీమె! కాని ఆకర్షించలేదు. ఏం చేసుకోగలడు యీ సుగుణాలను? విధి అన్నిటినీ ఒక్కచోటే జేర్చదు కదా? సృష్టిలోని ఈ లోపాల్ని పూరించేందుకు కళాకారులు నానా అవస్థా పడుతున్నారేమో? కని ఆ 'కళ' లోపించిన తన జీవితం ఎంత భారంగా, ఘోరంగా తయారైంది!"

"రాధాదేవీ!....నేను అడిగేది అదికాదు....నీ భావి జీవితాన్ని గూర్చి—" అన్నాడు వణికిపోయే కంఠంతో.

ఆమె ముఖంలో ఆశ్చర్యం కనిపించింది. ఇదివరకే జరిగిన నిర్ణయం భూకంపం వల్ల నెర్రలిచ్చిన భూమివలె అయినట్లయింది.

"ఇక్కడి పనులింకా వారం పట్టొచ్చు...." అందామె. "తరువాత—" అని అతని ముఖంకేసి చూసింది.

"తరువాత—?' అన్నాడు అతను, ఆతృతతో.

"తరువాత....మీరే వున్నారు!"

ఆమెకు తను ఎప్పుడూ వుంటాడు; కాని తన కామె ఏమీ కాదా? మనసులో మాత్రమే ఉండిపొయ్యే ఒకానొక దివ్యానుభవం తాలూకు మధురమైన తలపు తనకు మాత్రమేనా?

"రాధాదేవీ!....నా సంగతి వదిలెయ్" అన్నాడు ఎలాగో.

మాటలు వెతుక్కోవాల్సి వస్తోంది.

ఆమె నిశ్చేష్టురాలయింది; మెల్లిగా తేరుకొని అతని ముఖంలోకి ప్రశ్నార్థకంగా

చూసింది. కొంత అర్థమై వుండొచ్చు. మిగతాది తేలిగ్గా వూహించి ఉండనూ వచ్చు. ఆమె జవాబు చెప్పలేక పమిటచెంగు చాటున ఏడ్వసాగింది.

"రాధాదేవీ!" అన్నాడు ఆమె తల నిమురుతూ. "ఎందుకు ఏడుస్తావ్?...చెప్పు... నాకు చెప్పవా?" బతిమాలాడు.

"ఈ సంగతి చెప్పేందుకేనా మీరు యింతదూరం వచ్చింది? .. ఒక కార్డుముక్క రాస్తే సరిపొయ్యేవి కదా?" అందామె.

ఈమెను చూశాక కదా, తన నిశ్చయాలన్నీ పటాపంచలైంది. కన్ను మూసి తెరిచే లోగానే ఎన్ని విపరీతాలు జరిగినవి! ఈ ఇంద్రజాలం వల్లనే అంతా తలకిందులైంది, జీవితం కన్న ఇంద్రజాలం ఇంకెక్కడ వుంది?

"నేనేం అన్నానని రాధాదేవీ!—"

"నా కా మాత్రం అర్థం కాలే దనుకున్నారా? నాకు తెలుసు—నేను అందగత్తెను కాదు. కురూపినే! కాని మీరు సహృదయులనీ, మానవులనీ అనుకున్నాను. మీ మాటలు నమ్మాను. నమ్మినందుకే చెడ్డాను....పోనిండి—నేను మీకు తగను. ఆ సంగతి నేనే చెప్పగలను....కాని-నాకు మీ పట్ల కలిగిన అనురాగమంతా, మీరు కల్పించిందే! నా వూహలకు రెక్క లిచ్చారు, నా ఆశలకు సౌధాల్ని కట్టారు. ఆ ఇచ్చిన వన్నీ యీ నాడు లాక్కుంటున్నారు; అవి మీ ఆస్తిపాస్తులే కనుక మీవి మీరు తీసుకెళ్ళటం న్యాయం....నన్ను నన్నుగా మిగిల్చారు—"

ఆమెకు, ఇంత హాని చేసిన తనను బాధించటమన్నా తెలియదేం? కఠినమైన పదాలే యీమెకు తెలియవేమో? హృదయం ఏంత సున్నితమైందో, మాటలు కూడా అంత మెత్తనివే! వరమీయని వేల్పుమీద అలిగి పూలతో కొట్టాలని ప్రయత్నించే పిచ్చి భక్తురాలివలె వుంది....తనకు జాలి కలుగుతోంది; కాని ఈ జాలి అనురాగంగా మారేందుకు యీ ప్రపంచంలో ఏదైనా మార్గ మున్నప్పటికీ, అది తనకు ప్రస్తుతం అందుబాటులో లేదు,

"రాధాదేవీ!....నేను పొరబడ్డాను—"

"ఔను. నావల్లనే పొరబడ్డారు....కాని యీ అంద చందాలను నేను కోరి తెచ్చుకోలేదు, మీరే జీవిత సర్వస్వమని నమ్ముకొన్నాను. మీరు చూపిన అనురాగం ముందు నేను చూపేది చాలా అల్ప మనిపించిందప్పుడు....కాని నాలో ఈ అనురాగమే కలగనట్లయితే, ఇది ఫలించలేదనే బాధ వుండేది కాదు. కొండమీది కెక్కించి, సుందరమైన దృశ్యాన్ని చూపించింది, ఆ కొండమీదినుంచి కిందికి తోసేందుకేనని ఇప్పుడు అర్థమైంది—"




తనలోని విరుద్ధ శక్తుల సంఘర్షణలో ఉచ్ఛాన్ని నీచం జయించిందని ఎలా చెప్పగలడు? నీచమని తెలిసి మనం చేసే, చేసి తీరవలసిన అనేక పనుల్లో యిదీ ఒకటి. ఆరు నూరు కానీ రాధాదేవిని తను స్వీకరించలేడు. న్యాయాన్యాయ విచక్షణలేక కాదు. ఆమెది న్యాయమే కావొచ్చు. కాని దాన్ని అసలు జరపట మంటే, తనకు తాను అన్యాయం చేసుకోవటమే కదా!

"రాధాదేవీ! ఇప్పుడు నేనేమీ చెప్పుకునేస్థితిలో కూడా లేను. నా తప్పు లన్నిటినీ క్షమించగల విశాలహృదయం నీకు ఉన్నదనే నమ్మకం నాకు వుంది."

ఆమె నవ్వింది; జీవితంలోని విషాదాన్ని మాటల్లో, కంఠస్వరంలో జోడించింది.

"క్షమించటమా?" అందామె, "ఎంత తేలిక! గాయపడిన హృదయాలనుంచి క్షమాభిక్షను యాచించటం ఈ నాడు కొత్తకాదు. ఐనా మీరేం తప్పుచేశారని? నేనే పొరబడ్డాను; నేను త్రవ్వుకున్న గోతిలో నేనే పడ్డాను—"

"రాధాదేవీ! నీవు సుఖపడాలనే నేను కోరుతున్నాను. నీకు డబ్బిస్తాను.... డబ్బుతో ప్రపంచంలో చాలా సుఖపడొచ్చు—"

ఆమె మండిపడింది. ఆమె మాటలకు అగ్నిశిఖలే జోడించ బడుతవని తనెన్నడూ అనుకోలేదు.

"ఔను.... ప్రపంచంలో డబ్బుకు అన్నీ దొరుకుతవి. మానవులు, మానవ

హృదయాలు, అనురాగాలు, ఆపేక్షలు అన్నీ లభ్యమౌతవి....అందులోనూ నేను మిమ్మ ప్రేమించానంటే, మీ డబ్బు చూసి....ఇవ్వాళ ఎలా అనగలుగుతున్నా రీ మాటలు? వేశ్యలు శరీరాన్ని అమ్ముకుంటారు; కాని నేను హృదయాన్నికూడా అమ్ముకునేటంత నీచురాలికింద కట్టారు....నా యీ విలువను తెలియ జెప్పేటందుకు ఎంత శ్రమ తీసుకున్నారు;''

ఆమె వెక్కి వెక్కి ఏడ్వసాగింది. సూర్య రశ్మికి కరిగే మంచుగడ్డకూ తన హృదయానికీ తేడా లేదు. కాని, మరో పక్క ప్రపంచం చూపే ఆశలకు, తన కొరకై వేచివున్న సౌఖ్యాలకు, కళాపూరితమైన మనస్సు కాంక్షించే సౌందర్యానికి లొంగిపొయ్యాడు. ఈమె తనను తీవ్రంగా గాయపరిచినా బాగుండు; అందువల్లనే నిరాకరించాననే ఆత్మ తృప్తిమిగిలేది.

''మీ రింకా ఇక్కడే వున్నారా?'' అందామె. ''మీరు వెళ్ళిపొండి. మీ రిక్కడ ఉన్నంతసేపూ నేను మొహం ఎత్తలేను. అనవసరంగా మీరు బాధపడతారు. నన్ను బాధపెడతా రెందుకు?....నాకు మీ డబ్బు అక్కర్లేదు. నేను బతకగలను.... వెళ్ళండి—''

జగన్నాధం తన ప్రయత్నం లేకుండానే లేచి నిల బడ్డాడు. కాళ్ళు వొణుకుతూన్నవి. చేయకూడని పని చేసేప్పుడు కలిగే కంపరం ఆరంభమైంది. కాని చేయక తప్పదనే అంతరాత్మ ఆజ్ఞ గదమాయిస్తోంది.

''వెళ్ళరా మీరు? నేను బతకటమన్నా మీకు ఇష్టంలేదా?'' అందామె.

ఒక్కసారి ఆ పరిసరా లన్నిటినీ కలయజూచాడు. తను కాదన్నట్లుగానే ఎలాగో బైటపడ్డాడు. ఏమీ తెలియటం లేదు, కాని శరీరాంగాలు అన్ని జాగ్రతల్నీ తీసుకొని జగన్నాధాన్ని రోడ్డెక్కించినవి.

స్టేషన్ చాలా దూర మనే ఆలోచనే లేదు. కాళ్ళు ముందుకు సాగుతూన్నవి. కాని మనసంతా రాధాదేవి కుటీరాన్నే పట్టుకొని వేళ్ళాడుతోంది. దాన్ని కూడా బలంగా లాగేందుకు కాళ్ళల్లో సత్తువ లేదు. కాళ్ళ కింది రోడ్డు జరిగి పోతోంది. అలా ఎంతసేపు నడిచాడో తెలియదు....ఎండ తీవ్రంగా వుంది. చాలా అలసటగా కూడా వుంది. ఒక చెట్టు కింద కూలబడ్డాడు.

సేద దీర్చుకుంటూండగా నిర్లక్ష్య పరిచా ననుకున్న ఆలోచనలు ఒక్కుమ్మడిగా మీద పడినట్లయినవి. భూతకాలంలో నుంచి తెంచుకొని వర్తమానంలోకి పడ్డారు.

''ఒరేయ్! నీచుడా!''

అదిరిపోయి చుట్టూ చూశాడు. ఎవ్వరూ లేరు. ఈ శబ్దాలు తనలోనుంచి అంత

రాత్మ పలుకుతోంది.

ఇంతకన్న దురన్యాయం వుందా? నిజంగా నీకు కృతజ్ఞత అంటే తెలుసా రాధాదేవి ముందు జానకి అల్పత్వాన్ని గ్రహించా ననుకున్నావే—అదంతా మరచి పోయ్యావా? నీకు ఏ ఆత్మబంధువు రాధాదేవి కన్న ఎక్కువ అనురాగంతో సేవ చేస్తుంది?....నీ కొరకై ఆమె దేవుణ్ణి సైతం ప్రార్థించి. కరగించి. వరం తెచ్చింది. నీకు కళ్లు రాకుంటే ఆ జానకి నిరాకరించి వుండేది కదా—కాని రాధాదేవి నీకు అండగా జీవితమంతా గడిపేందుకు సిద్ధపడింది. జానకి పరిస్థితుల్నిబట్టి, తన సుఖానికి అనుకూలంగా మారే తత్వం గలదనే కదా ఆమెను ద్వేషించింది. ఇప్పుడు నీవు జానకి కన్న అధికుడివి యెలా అయ్యావు? ఏ దుర్గుణాలనైతే యితరులలో చూపి అసహ్యంచుకుంటున్నావో, అవే దుర్గుణాలు నీలో వున్నప్పుడు వాటిని ద్వేషించవు. సరికదా. అంగీకరించి. వాటికి లొంగి. ఆరాధిస్తున్నావు. ఇంతకన్న దారుణం. ఘోరం వుందా?''

జగన్నాధం కొయ్యబారిపొయ్యాడు. తన అంతరాత్మ తన మీదనే తిరుగుబాటు చేస్తోంది. దాని శక్తికి తట్టుకోలేడు. బైటనుంచి వచ్చే విప్లవాలను ఎదుర్కో-గలడేమో కాని. తనలోనే సంఘర్షణనుంచి దూసుకోవటం ఎట్లా?

''ఆలోచించు—'' అంది అంతరాత్మ. 'ఆ ఉద్వేగమంతా తగ్గింది కనుక యిప్పుడు రెండోవైపు చూడు. నీకు దృష్టి రానట్లయితే ఏమయ్యేది? అప్పుడు రాధాదేవి కూడా నిన్ను నిరాకరించి వుంటే ఏమయ్యేవాడివి?....అనవసరంగా ఆమెను అక్కడే వదలి. నీవు చాటుగా. పిరికిపందవలె తిరిగి వచ్చావు. నీలాగే తన సుఖం తాను చూసుకోగల జాణ కాదు రాధాదేవి. నీలో వున్న నైచ్యమే ఆమెలోనూ వుంటే యింత బాధ పడేది కాదు. నీకు కళ్ళొచ్చినవంటే, వాటితో సరిగ్గా చూసి. న్యాయాన్యాయాల్ని తూచేందుకు. అంతేకాని చూడగలవు కనుక. చూస్తూనే ఎంత ఘోరానికైనా తలపడ మనా?''

జగన్నాధానికి బుర్ర తిరిగిపోతోంది. ఈ అంతరాత్మ ఇప్పుడు ఘోషించినట్లు, ఇంతకుముందు ఎందుకు యుద్ధారంభం చేయలేదు?

''ఇంతసేపూ ఏమయ్యావ్?'' అన్నాడు.

''ఏమయ్యాను—నీలోనే వున్నాను. గుడ్డివాడల్లే ప్రవర్తిస్తున్న నిన్ను చూస్తున్నాను. అప్పుడే మాట్లాడా లనుకున్నాను; హెచ్చరిద్దా మనుకున్నాను.... కాని నన్ను నోరు కదప నిచ్చావా? నా గొంతు పిసికావు....ఇప్పుడు నీలో శక్తి తగ్గింది కనుక. పీపట్టు వదిలింది....అందుకనే కాచి వడపోసిన సత్యాన్ని వెడల గ్రక్కుతున్నాను.

ఈ సత్యం చేదుగానే వుంటుంది. ఐతే వ్యాధికి దివ్యౌషధం లాంటిది.... నీవు మళ్ళీ నా గొంతు పిసికేదాకా నేను మాట్లాడుతూనే వుంటాను.''

జగన్నాధం చాలా సిగ్గుపడ్డాడు. తన అంతరాత్మకే ద్రోహం తలపెట్టాడు; ఇంకా నయం—అది చావలేదు! దాని వాక్కుల ఫలితంగా తనలో తిరిగి మానవత్వం ప్రవాహంవలె వచ్చిపడుతోంది.

కళ్లు మూసుకున్నాడు; మళ్ళీ ఆ బృందావనం, యమునాతీరం. రాధాదేవి దివ్య సౌందర్యం అన్నీ మనోఫలకంలో మెరిసినవి. గుడ్డితనంలో అందుకోగలిగిన ఈ మహోన్నత శిఖరాలు, కళ్ళు తెరిస్తే కరిగిపోతూన్నవి. తను నిజంగా గుడ్డివాడు గానే వుంటే యెంత బాగుండేది!

అప్పుడు రాధాదేవి తనను ఆరాధించేది; తానామెను కొలిచేవాడు. దివ్య ప్రణయం ఉభయుల్నీ కలిపి వుంచేది కాదా! ఇప్పుడు చేసిన ఈ అన్యాయం రాధాదేవికే కాదు, తనకు తాను చేసుకున్నాడు!

క్షణికమైన భౌతిక సౌందర్యం కోసం తనెందు కింత తహ తహ పడ్డాడు? రాధాదేవిలాంటి రత్నాన్ని దిగవిడిచి, ఇక్కడ ఈ దుమ్ముల్లో గాజు పెంకుల కోసం వెతకటం దేనికి? తనకు ఈ కళ్లు వచ్చినందుకు తనుపడే పొరపాటుగాక మరేమిటి? గులాబికి ముళ్లున్నవని దాన్ని ద్వేషిస్తున్నామా? చందమామలో మచ్చ వున్నదని దాన్ని మెచ్చుకోకుండా వూరుకుంటున్నామా?

ఇంత మారం వచ్చాక కాని తను చేసిన నేరం తెలియలేదు. జీవితంలో పొరబాటు చేసి, దాన్ని దిద్దుకునే అవకాశం లేకుండా ముందుకు సాగిపోవటమే జరుగుతోంది కాని అదృష్ట వశాత్తూ ఇప్పుడు తను వెనక్కు నడిచి, ఆ పొరపాటును సరిదిద్దుకో గలడు.

పాపం—రాధాదేవి యెంత తపన పడుతుందో; ఆ అమాయకురాలి మీద తనకు నిజంగా యెంతో జాలి కలిగింది. ఆ జాలిని అనురాగంగా మార్చ గలిగిన సమర్థత వున్న సజీవ అంతరాత్మ తనలో వుంది. ఇంతకన్న తనకింకేం కావాలి!

''ఇంకా చూస్తావేం—లే—వెళ్ళి రాధాదేవి కాళ్ళమీద పడి, ఆమె క్షమను అర్థించి, సాధించి, స్వీకరించు. ఇంకా ఆలస్యం చేస్తే యీ అవకాశం కూడా పోతుంది—'' అని హెచ్చరించింది అంతరాత్మ.

కొత్త శక్తులేవో శరీరంలో ప్రవేశించినవి. ఎంతో వుత్సాహంతో తిరిగి గ్రామం వైపు నడవసాగాడు

జీవితం యెంత విచిత్రమైంది! రాధాదేవిని స్వీకరిస్తే తన జీవితం ప్రమాదానికి

లోనవుతుందనే ఎచ్చివూహ భ్రమింప చేసింది కాని తను కోరని కనీసం వూహాం చని ప్రమాదాలు ఎదురవుతూంటే తనేం చేయగలడు? ఆ ప్రమాదాలు వాటంత టవే సర్దుకున్నవి సర్దుకోకపోయినా నామ మాత్రంగా తను అనుభవించే తీరవలసి వుండేది కదా!

ఒక్కొక్కళ్లు తెలిసివుండీ యీ జీవితాన్ని వృధాగా చాలా స్వల్ప విషయాలకు కూడా 'రిస్క్' చేయటం తనకు తెలుసు. గంటల తరబడి రైలులో కూర్చొని, తను దిగవలసిన స్టేషన్‌లో బండి ఆగుతుండగానే దిగి, రైలుకింద పడి చచ్చిన వాళ్ళను తను ఎరుగు!' ఒక్క నిమిషం ఆగలేక, నిండు ప్రాణాన్నే రిస్క్ చేసిన మనుషులు! వాళ్ళా నిమిషంలో సాధించేదేమీ లేదు. అదంతా తెలిసే తృణప్రాయంగా ప్రాణాన్ని బలిపెట్టారు!

కాని తను చేసే ఈ 'రిస్క్'కు అర్థం వుంది. రాధాదేవి అందంతో కాకున్నా హృదయంతో తనను సుఖపెట్టగలదు. ఈమె తనను అర్థం చేసుకోగలిగిన వ్యక్తి. అందమంటే ఏకో తను మనస్సులో వూహించుకొనేదే కాని, దీనికి కాల పాత్ర ఎక్కడ? అలాటిది ఎక్కడన్నా వున్నదనుకుంటే అందాన్ని గూర్చిన వివిధాభి ప్రాయాలు ఎందుకుంటవి?....ఇప్పుడు రాధాదేవి సౌందర్యం తనకు అసంతృప్తిగా వున్నప్పటికీ, తను మారగలడు; తప్పక మారుతాడు! ఆ మార్పును తీసుకొని రాగల సామర్థ్యం రాధాదేవికి వుంది. ఇప్పుడు మారలేదా?

ఇంకా నయం. క్షణంలో అంతా తలక్కిందులయ్యేది. చీకటి-వెలుగుల మధ్య వున్న ఆ సన్నని చార, జీవన్మరణాల మధ్య వున్న కనపడీ కనపడని సరిహద్దు గీత-వీటన్నిటిని తానిప్పుడు చూడగలుగుతున్నాడు. ఎటు కాస్త తూలినా ప్రమాదమే కదా! ఆ తూలటం వెంటనే నిలతొక్కుకోవటం జరిగింది.

మనసు వర్తమానం మీదినుంచి భావిమీదికి దూకింది. తిరిగి ఆ దాంపత్యం, స్వర్గ సౌఖ్యం, ఇల్లూ, వాకిలీ మొదలైనవన్నీ కళ్ళ ముందు మెరిసినవి. తాను వూహించి, అసంభవమనుకున్న ఆ భావి జీవితానికి తిరిగి పునాదులు పడి క్షణంలో రమ్యహర్మ్యం తయారైంది. ఇలాటి మనసును వుంచుకొని తనెందుకు భయపడటం?

మానవుడు విచిత్ర వ్యక్తి. సాధువైన జంతువుల్నే చంపి తింటాడు. వన్య మృగాల మాంసం రుచి లేదని కాదు; దాని రుచి తెలుసుకునే ప్రయత్నంలో, తన మాంసం రుచినే అవి తెలుసుకుంటవేమో నని భయం!....అదే విధంగా ఈ రాధా దేవిని, సాధు జీవిని తను నెత్తురు చుక్క కూడా కనిపించకుండా హత్య చేసేందుకు ప్రయత్నించాడు....కాదు, ఆ దుర్ఘటన పూర్తి కాకముందే సరిదిద్దుకోబోతున్నాడు.

ఊళ్ళో ప్రవేశించాడు. రాధాదేవి దగ్గిర వాలుదా మనే ఆతృత కలిగించే ఉత్సాహం తన కాళ్ళను చకచకా నడిపిస్తూంది.

అల్లంత దూరాన వుండగానే వీధి చివర ఇల్లేదో తగలబడు తోంది. అగ్నిశిఖలు పైపైకి పాకుతూన్నవి. దట్టంగా పొగ కమ్ముకుంటోంది. గాలికి ఎగిరివొచ్చే బూడిద అన్ని వైపులకూ పయనిస్తోంది. వాసాలు కాలి చిటికిన చప్పుళ్ళు వినిపిస్తూన్నవి....రాధాదేవి ఇల్లు కాదు కదా!

ఆ తలపు రాగానే జగన్నాధం పరుగెత్తసాగాడు. దగ్గిరవుతున్న కొద్దీ, రాధాదేవి ఇల్లేనని నిశ్చయమైంది. ఒక పక్క కంపరం ఆరంభమైంది. నిజానికి ఆ భయంలో కాళ్ళాడకుండ వలసింది; కాని ఆ భయమే అతనికి శరవేగాన్నిచ్చింది; రాధాదేవి ఏమైందో ననే భయ మది. మృత్యుదేవత వెంటాడి నప్పుడు పరుగెత్తే వేగ మది!

ఇంటి చుట్టూ చాలామంది జనం పోగై వున్నారు. కొంత మంది కుండల్తో నీళ్ళు పోస్తున్నారు. వాళ్ళ శ్రమ తగ్గించేందుకు అగ్నిదేవుడు దాదాపు తన పనిని పూర్తి చేసుకున్నాడు. ఆ సెగకు భయపడి, దూర దూరానికి జరుగుతున్నారు ప్రేక్షకులు.

జగన్నాధం బాణంవలె దూసుకొని జనంలోంచి ముందు కొచ్చాడు.

"రాధాదేవి.........రాధాదేవి.........ఎక్కడ?" అన్నాడు. ఊపిరి ఆడటం లేదు. ఆయాసంతో రొప్పుతున్నాడు.

"పాపం!—ఆ లోపలే ఉండిపోయింది!"

కళ్ళముందు ప్రళయమే కనిపించింది. జగన్నాధం ఆలోచించే స్థితిలో లేడు. ముందు, తన రాధాదేవిని, ఆరాధ్య దైవాన్ని రక్షిద్దామనే పిచ్చి భ్రమతో ముందుకు దూకుతున్నాడు. ఇది చూసి ఇద్దరు ముగ్గురొచ్చి, గట్టిగా, కదల కుండా జగన్నాధాన్ని పట్టుకున్నారు.

వాళ్ళ పట్టు వొదిలించుకు నేందుకు గుంజుకుంటూ "వొదలండి....నన్నొదలండి.. రాధాదేవీ!...." అని ఎలుగెత్తి అరిచాడు.

"బాబూ! లాభం లేదు.........ఆమెను రక్షిద్దామని మేమెంతో ప్రయత్నించాం.... బూడిదైపోయింది!" అని వాళ్ళు అతన్ని ఆపేందుకు ప్రయత్నించారు.

"పాపం! ఎంత మంచిది!" అన్నారు ఎవరో.

ఆమె మంచితనం తనకన్న బాగా తెలిసిన వాళ్ళీ ప్రపంచంలో లేరు. రాధాదేవి భౌతిక శరీరం కళ్ళముందే బూడిదయింది; ఆమె ఆత్మ పొగ రూపాన ఎగిరిపోతోంది. నిండు ప్రాణం తనకు బలయింది! ఇది హత్య ఐనప్పటికీ తను నేరస్థుడు కాడు! ఇంతకన్న ఘోరాన్ని తా నసలు వూహించ గలడా? ఆమె తనకు ప్రాణాన్నిచ్చింది.




ప్రతిఫలంగా తాను ఆమెకు మృత్యువును ప్రసాదించాడు. తనలోని మట్టిని బంగారం చేసిందామె; ఆమెలోని బంగారరాన్ని మట్టి చేశాడు తాను! ఇక ఆమె వికృత శరీరం తనకు కనిపించదు. దాంతో పాటే దివ్యత్వమున్న ఆమె ఆత్మకూడా శాశ్వతంగా ఈ లోకంనుంచి విరమించిది....ఈ కొద్ది కాల వ్యవధి, తన జీవిత పరిణామాన్ని ఎన్నింతలు పెంచి, ఎంత భారాన్ని కొని తేగలిగింది!

'భగవాన్!' అనుకున్నాడు జగన్నాధం. 'నాకు కళ్ళెందు కిచ్చావు? కళ్ళు లేనప్పుడే నేను సత్యాన్ని చూడగలిగాను. కళ్ళు వుంటే చూసే దంతా ఈ మిధ్య! ఈఘోరాన్ని చూసేందుకేనా నాకు దృష్టి నిచ్చింది?'

కాని భగవాన్ జవాబు చెప్పలేదు, ప్రపంచంలో జరిగే వాటన్నిటికీ కారణాలు చెప్పే తీరిక ఆయనకు లేదు. అనుభవించి తెలుసుకునేందుకే ఈ సంఘటనలు వస్తూంటవి....కళ్ళు వున్నప్పటికీ తను అంధుడే-శాశ్వతంగా!

జగన్నాధం ఎంత గుంజుకున్నా, తనను పట్టుకున్నవాళ్ళపట్టు వదిలించుకోలేక పోయ్యాడు. చూస్తూ చూస్తూ నిండు ప్రాణాన్ని బలిపెట్టలేని కరుణార్ద్ర హృదయులైన మానవ శక్తులు అతన్ని అడిమిపట్టివవి. అతని బాహ్య శక్తులు అలపి పోయినని. అలాగే ఆ పట్టుకొన్నవాళ్ళ చేతుల్లోనే మొదలు నరికిన అరటిచెట్టల్లే కూలిపోయ్యాడు!

—

డిశంబరు నెల

# భావపరిచయ పోటీ

బహుమానం రూ 10—00

## జెయిల్



ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి.

వ్యాఖ్య వచనంగా గానీ, పద్యంగా గానీ వుండవచ్చు. వచనంగా అయితే ఒక్క వాక్యంలోనూ, పద్యంగా అయితే నాలుగు పాదాల లోపుగాను వుండాలి. వ్యాఖ్య కార్డుపైననే వ్రాసిపంపాలి. కవరులో పంపినవి అంగీకరింపబడవు.

మాకుచేరిన వ్యాఖ్యలలోకెల్లా ఉత్తమంగా వున్నదానికే బహుమాన మివ్వబడును. బహుమతి నిర్ణయంలో సంపాదకునిదే తుదినిర్ణయం. ఉత్తర ప్రత్యుత్తరాలు లేవు.

వ్యాఖ్యలు మాకు నవంబరు 5 వ తేదీలోగా చేరాలి. యువ పాఠకులందరూ ఈ పోటీలో పాల్గొన వచ్చును. ప్రవేశరుసుములేదు.

# సుందర హర్మ్యం

* వైదేహి *



కొన్ని సంవత్సరాల శ్రమ ఫలితంగా, ఎమ్.బి బి.ఎస్. డాక్టరుగా, రోడ్డుమీద బస్సుదిగి ఎదురుగా కనిపిస్తున్న భవనంకేసి చూచాను. వంద ఎకరాల విస్తీర్ణంలో అధునాతన పద్ధతులతో, అందమైన అంతస్తులతో అలరారుతూంది ఆ భవనం. అది ఒక పట్టణంలోని ప్రభుత్వ హాస్పిటల్. అది హాస్పిటలా, మరేదైనా ఎస్టేటా అని కాసేపు ఆశ్చర్యాంబుదిలో నిలిచిపోయాను. దాదాపు అరకోటి రూపాయల వ్యయంతో నిర్మితమైన ఆ హాస్పిటల్ భవనం ఆ వూరికెంతో గర్వకారణం. అది ఆ వూరి పౌరులు చేసుకున్న పుణ్యమని మనసులోనే అభినందించాను. భవనంకేసి పరికించి చూస్తూ రోడ్డుకు రెండు ఫర్లాంగుల దూరంలో కనిపిస్తున్న దాని సింహద్వారంకేసి నడిచాను. అంబులెన్సులు, కారులు, రిక్షాలు, వగైరా వాహనాలు ఆ ఆవరణంలో వున్నాయి. అప్పుడు సమయం ఉదయం తొమ్మిది గంటలు. ఊరికి, ఉద్యోగానికి కొత్త. పరిస్థితు లెలావుంటాయో నన్న సంశయాత్మకమైన మనస్సుతో అడుగులేస్తున్నాను.

ఆ భవనంలోకి అడుగుపెట్టాను. మూడువైపులా ఎటు చూచినా ఫర్లాంగు

దూరం పొడవున వరండా, దాని కిరు వైపులా గదులు, ఒక్కొక్క గదిముందు ఆ గదిలో వున్న ఆఫీసరు పేరు సూచి స్తున్న బోర్డు గోడకు కొట్టబడివున్నాయి. ఇంత పెద్ద భవనంలోని ఉద్యోగులకంతా ఉన్నతాధికారిని నేను. అంటే హాస్పిటల్ సూపరిన్ టెన్ డెంటును. ఈ భావంతో నా హృదయం ఒకసారి పులకించింది. అంతలోనే అంతులేని భయం ఆవ హించింది. ఇంతమంది వ్యక్తులను, వారి అభిప్రాయాలను సమన్వయపర్చగల్గడం సామాన్యమా? నాలుగువైపులా పరికించి చూస్తూ ముందుకు నడిచాను.

వరండాలో ఒకప్రక్క ఒక విగ్రహం కనిపిస్తూంది. అక్కడ నిల్చునివున్న ఒక జవాన్ను పిలిచి "ఇది ఎవరి విగ్రహమని" అడిగాను.

"ఇది ఈ బిల్డింగ్ నిర్మాణానికి ఐదు లక్షలు దానమిచ్చిన మహానుభావునిది సార్. ఆయనే దీని కంట్రాక్టర్ గూడా" ఆ జవాను బదులిచ్చాడు.

"అలాగా. సరే. సూపరింటెండెంటు గారి గది చూపించు" అతన్ని అడిగాను నేను, విగ్రహం గురించి ఆలోచిస్తూ.

"అటువైపు వెళ్ళి అడగండి చెబు తారు. నాకు వేరే పనివుంది" అంటూ అతను మరోవైపుకు వెళ్ళిపోయాడు.

అతని నిర్లక్ష్యతకు నాకు కోప మొచ్చింది. అయినా తమాయించుకొని మరి రెండడుగులు వేశాను.

"బాబూ! కళ్ళడాక్టర్ వుండేదెక్కడ?" ఒక ముసలావిడ, తన కెదురుపడిన ఒక పాతిక సంవత్సరాల యువకుని అడుగు తూంది.

"ఏమో పోవమ్మా! ఏమీ తెలియని వాళ్ళంతా వచ్చి మమ్మల్ని విసిగిస్తూం టారు" అంటూ అతను వెళ్ళిపోతున్నాడు

"కాస్త చెప్పు నాయనా!" ఆ ముస లావిడ బ్రతిమలాడుకుంటూంది.

"ఇంకా ఎక్కువ మాట్లాడితే బయటికి నెట్టుతా జాగ్రత్త!" అని హెచ్చరిస్తున్నా డతను.

"ఒబ్బాయ్. ఇలా రా!" అన్నాను జోక్యం కల్గించుకుంటూ.

అతను ఆగి నాకేసి నిశితంగా చూచి "ఏం?" అన్నట్లు తలాడించాడు.

నేరో కట్ ప్యాంట్ వేసుకొని, ఫుల్ షర్ట్ సగానికి మడిచి, కొంచెం వెంట్రుకలు ముందుకు పడేలా క్రాపు దువ్వుకొని వున్నాడు. చేతిలో సిగరెట్ వెలుగు తూంది.

"నీ విక్కడ ఏం పని చేస్తున్నావు?" అడిగాను నేను.

"కాంపౌండర్ని" ధీమాగా చెప్పాడు ఆ యువకుడు, అదేదో కలెక్టర్ ఉద్యోగం లాగా.

"నీ పేరేమిటి?" మళ్ళీ ప్రశ్నించాను.

"నీకెందుకు?" అతను తిరిగి ప్రశ్నిం చాడు.

"అడుగుతున్నాను చెప్పు." ఈసారి

నా అధికారాన్ని గుర్తు తెచ్చుకుంటూ గట్టిగా అడిగాను.

"నువ్వెవ్వరివి? మహా దభాయిస్తున్నావు?" అతను అమర్యాదగా ఎదురు జవాబు చెప్పుతూ వెళ్ళి పోయాడు.

వెళ్ళుతున్న అతన్ని కాస్తంత గమనించి, ముందుకు నడిచాను. నా దృష్టి గదులముందు బోర్డుల మీద వుంది. ఎన్. జి వా క్లినిక్, ఐ సర్జన్, ఇలా వున్నాయి బోర్డులు. ఐ సర్జన్ బోర్డు చూడగనే ముసలమ్మ గుర్తొచ్చింది, వెను తిరిగాను. ఆమె ఇంకా కనిపిస్తున్న వారి నల్లా అడుగుతూనే వుంది. డాక్టర్లు, నర్సులు, కాంపౌండర్లు హడావుడిగా అటూ ఇటు తిరుగుతున్నారే గానీ, ఒక్కరూ ఆ ముసలమ్మకు జవాబు చెప్పడం లేదు. టిప్‌టాప్‌గా నర్సులు పరుగెడు తున్నారు.

నేను మళ్ళీ వెనక్కు నడిచి ఆ ముసలమ్మను తీసుకొచ్చి ఐ సర్జన్ ముందు వున్న క్యూలో నిల బెట్టాను.

ఆ వరండాలో అక్కడక్కడ బెంచీల మీద రోగులు, వారికి సహాయంగా వచ్చిన వారు కూర్చుని వున్నారు. చిన్న పిల్లల ఏడ్పులు, రోగుల బాధల తాలూకు మూల్గులు, అరణ్య రోదనంలా వినిపిస్తున్నాయి. డాక్టర్లు తమ విధి అన్నట్లు ఏదో చేస్తున్నారు. త్వర త్వరగా తమ పని ముగించుక వెళ్ళాలన్న తాపత్రయం వాళ్ళలో కనిపిస్తూంది. అందువల్లనే రోగుల బాధలను పూర్తిగా వినకుండనే ఏదో చీటి వ్రాసిచ్చి కాంపౌండర్ల వద్దకే నెట్టేస్తున్నారు డాక్టర్లు. నేను ఒక గదివద్ద నిల్చుని ఇవన్నీ గమనించ సాగాను. ఏవేవో మందు మాత్రలు, ఇన్‌జెక్షన్ ఒక రకమైనవి అందరికీ ఇస్తున్నారు, కాంపౌండర్లు, అందరు రోగులకు ఒకే రకమైన రోగమా? ఆశ్చర్య పడ్డాను.

వూర్కోలేక కాంపౌండరు వద్ద కెళ్ళాను.

"మీ రిస్తున్నమందులు కామన్‌గా వున్నాయి. కారణం?" అడిగాను.

"మా కర్మ. మమ్మల్నేం చెయ్యమంటారు. సరఫరా అయిన సరుకంతా తిరిగి బజారు చేరింది. అయినా మా కెందుకు లెండి? మీకేం కావాలో చెప్పండి" కాంపౌండరు అడిగాడు విసుగ్గా.

"ఏమీ అక్కరలేదు" అంటూ అక్కడినుండి వచ్చేశాను.

కొంతసేపు వెతకంగా సూపరింటెండెంటు రూమ్ కనిపించింది.

స్ప్రింగ్ డోర్ తెరుచుకొని లోనికి ప్రవేశించాను. ఎదురుగా ఒక వ్యక్తి కుర్చీలో కూర్చుని వ్రాసుకుంటున్నాడు.

"గుడ్‌మార్నింగ్" అన్నాను.

"వెరీగుడ్ మార్నింగ్" అంటూ తలెత్తి చూచాడాయన.

"అయామ్ కిరణ్ కుమార్ ఫ్రమ్ వైజాగ్" అని పరిచయం చేసుకున్నాను.

"ఓహో! యు. ఆర్, అపాయింటెడ్

హియర్, ఇన్ మై ప్లేస్. రండి రండి, కూర్చోండి" అంటూ లేచి కరచాలనం చేశాడాయన.

కొద్దిసేపు ఇద్దరం హాస్పిటల్ విషయాలు చర్చించుకున్నాము. నాకు వుండిన సందేహాలు కొన్నీ, తెలియని విషయాలు కొన్నీ ఆయన్నడిగి తెల్సుకున్నాను.

తర్వాత నన్ను ప్రతిగది వద్దకూ తీసుకెళ్ళి గదులను అందులోని స్టాఫ్‌ను పరిచయం చేసాడు. తరువాత ఆయన వద్ద చార్జీతీసుకొని రిలీవ్ చేశాను. ఆ సాయంత్రం టీపార్టీ ఫోటో వుండినవి.

మరురోజు పదిగంటలకు ఆఫీసు (హస్పిటల్)కు వచ్చాను. ఒక్కొక్కర్ నా గదికి వచ్చి నమస్కారాలు చేసి ఫైళ్ళలో సంతకాలు పెట్టించుకొని పోతున్నారు.

సాయంత్రం అయిదు గంటలు కొట్టింది. ఇక ఇంటి కెళ్ళదా మనుకొని లేచాను.

స్ప్రింగ్ డోర్స్ తెరుచుకొని వచ్చి నిలబడ్డాడు. నిన్నటి కాంపౌండరు. నేనతని కేసిచూడగానే, మౌనంగా నమస్కరించాడు. అతన్ని కొన్ని నిమిషాలు పరికించి చూచాను. అతను నేరస్థుడులా తలవంచు కున్నాడు.

"నీ పేరేమి?" అడిగాను నేను.

"తిరుపాలు సార్!" వినయంగా చెప్పాడు అతను. నిన్న అడిగిన అదే ప్రశ్నకు అతనిచ్చిన జవాబు తీరు వేరు. ఈ రోజు జవాబు తీరువేరు. ఈ రోజుల్లో మనుష్యుల హోదాకే విలువగాని వ్యక్తిత్వాలకు కాదు.

"నీ సర్వీసెంత?" మళ్లీ ప్రశ్నించాను.

"ఆరు నెలలు టెంపరరీగా వున్నాను సార్!" అతను తగ్గుస్థాయి గొంతుతో జవాబిచ్చాడు.

"అంతమాత్రానికే ఇంత మిడిసిపాటెందుకు? ఉద్యోగాన్ని విద్యుక్తధర్మంగా భావించాలి. అదేదో పెద్ద ఘనతగా అనుకొని, అహంభావంతో ప్రవర్తిస్తే ఎలా? వెళ్ళు. ఇకముందు హాస్పిటల్‌కు వచ్చేవాళ్ళలో మంచిగా ప్రవర్తించు" అంటూ రూమ్‌నుండి బయటికి వచ్చాను. అతను నా వెనుకగా నడిచాడు.

హాస్పిటల్ వాతావరణం ఆకళింపు చేసుకోను నాకు కొన్నిరోజులు పట్టింది. నా మనస్తత్వానికి అక్కడి పరిస్థితులకు పూర్తిగా విరుద్ధం. రెండూ ఉత్తర దక్షిణ ధృవాలకుమల్లే వున్నాయి. ఈ పరిస్థితులను నేను సమర్థించగలనా అనిపించింది.

హాస్పిటల్‌కు సంబంధించిన ప్రతి పనిలోనూ అవకతవకలు కనిపిస్తున్నాయి. రూపాయి ఎత్తు పనిలో సైతం కమీషన్. అంతేకాదు, హాస్పిటల్‌కు సరఫరా కాబడే ఖరీదైన మందులన్నీ తిరిగి మందుల షాపులకు చేరుకుంటున్నాయి. తత్ఫలితంగా రోగులకు నీళ్ళమందులు, అనా



యువ

రోగ్యానికి కాస్తంత ఎఱువు లభిస్తున్నాయి.

ప్రజలకు ఉచిత చికిత్సకు నియమింపబడిన ఆ సంస్థ డబ్బు ప్రజలందరిదీ గానీ, దాన్ని అనుభవించగల్గే అవకాశం, అర్హత ఏ కొద్దిమందికో మాత్రమే వుంటున్నది.

ఒకరోజు ఆఫీసులో కూర్చుని కాగితాలు చూస్తున్నాను. నా రూమ్ బయట వుండే జవాను ఒక విజిటింగ్ కార్డు తెచ్చాడు. అతనెవరో మెడికల్ రెప్రెజెంటేటివ్. లోనికి రావడానికి అనుమతిచ్చాను.

అతను లోనికి వచ్చాడు. నాకు ఎదురుగా వున్న కుర్చీలో కూర్చున్నాడు.

"నేను కొన్ని సంవత్సరాలుగా మీ హాస్పిటల్‌కు మందులు సరఫరా చేస్తున్నాను. ఈ సంవత్సరం మీరు కొత్తవారు. మీకు పరిచయం చేసుకోవాలని వచ్చాను" అతను చెప్పాడు.

"మంచిది. మీవద్ద మెడిసన్స్ రేట్ల వివరం వుంటే ఇవ్వండి" అడిగాను నేను.

అతను హాండ్ బ్యాగ్‌లోంచి ఒక లిస్టు తీసాడు.

"మీకు కమీషన్ బాగానే వుంటుంది లెండి" అన్నాడు వికృతమైన చిన్న నవ్వుతో, ఆ కాగితం నా కందిస్తూ.

అతని మాటతో నాకు తీవ్రమైన బాధ కల్గింది. ప్రస్తుతానికి ఏమీ అనకూడదని దాన్ని తీసిపెట్టుకున్నాను.

"సరే చూస్తాను. వెళ్ళిరండి" అని అతన్ని పంపించేశాను.

అతనిచ్చిన లిస్టునుండి మచ్చుకు రెండు మూడు మందుల పేర్లు డైరీలో నోట్ చేసుకున్నాను. సాయంత్రం ఆఫీసు వదలగానే బజారుకు వచ్చాను. ఒక మందులషాపుకెళ్ళి ఆ మాత్రల వెల అడిగాను. వారిచ్చిన వివరాలకు నా గుండె అదిరిపోయాయి. దాని వెల పదిహేను పైసలైతే, రెప్రెజెంటేటివ్ ఇచ్చిన లిస్టులో దాని వెల అరవైపైసలు.

"భగవాన్! మనిషిలో దురాశ ఇంతగా ప్రబలిపోయిందేం?" నాలో నేను ప్రశ్నించుకున్నాను. భగవంతుడుండేది మంచివాళ్ళ హృదయాలలోనట. ఆ మంచి హృదయాలు కలుషమయ్యేసరికి ఆయన ఎటో పారిపోయాడు.

మెడికల్ రెప్రెజెంటేటివ్ మరురోజు మళ్ళీ కనిపించాడు. ఇంకా ఏదీ నిర్ణయించుకోలేదని అతన్ని పంపించివేశాను.

హెడ్‌క్లార్క్ రాజాను పిలిపించాను.

"మిష్టర్ రాజా! మందుల కొనుగోలు విషయంలో మీ అభిప్రాయ మేమిటి?" అడిగాను నేను.

"ఆ విషయం మీరు స్వయంగా చూచుకోవడం మంచిది సార్" అన్నాడు రాజా.

"ఏం?" అడిగాను.

"ఇక్కడ ఏదీ ఒక సరైన పద్ధతిలో

మయ వ

జరగడంలేదు. ప్రతిదానికీ భాగస్తులు ఎక్కువ. ప్రభుత్వం సొమ్మంటే, సత్రంలో పోసే మంచినీళ్ళలా చూస్తారు వీళ్ళు. తర్వాత మీ ఇష్టం" రాజా చెప్పాడు.

ఆయన మాటలకు నాకు సంతోష మేసింది. నా భావాలకు సరిపడ గల్గిన వాడు ఒక్కడైనా వున్నాడు. ఆ రోజు నుండి రాజాతో మాత్రం ఆఫీసు విష యాలు చర్చించే వాణ్ని.

ఒక రోజు నా గదిలో కూర్చుని రాజాతో ఏదో మాట్లాడుతున్నాను. ఫామిలీ ప్లానింగ్ డాక్టర్ అక్కడి కొచ్చాడు. అతన్ని చూడగనే నా కాశ్చర్యమేసింది. అతని కళ్లు ఎఱ్ఱగా మండుతున్నాయి. ముఖాన వెంట్రుకలు నిర్లక్ష్యంగా పడి వున్నాయి. మనిషి తూలిపోతున్నాడు.

"గు....డ్....మా ర్నిం గ్ సార్? లోనికి రావచ్చా?" అతను తడబడే మాటలను బలవంతంగా కూర్చుకుంటూ మాట్లాడు తున్నాడు.

నేనే సమాధానమూ ఇవ్వలేదు.

"ఏం? డాక్టర్ మాట్లాడవు?" అత నలా అంటూ, వచ్చి యెదురుగా వున్న కుర్చీలో కూర్చుని తల నోట్ బుక్ మీదకు వాల్చేశాడు, నీరసంగా.

చదువు సంధ్యలు లేక, సంస్కార హీనుడై త్రాగి రోడ్డుమీద దొర్లే సామా న్యుడు, వున్నత చదువులు చదివి ఇలా ప్రవర్తిస్తున్న ఈ డాక్టరు కంటే హీనుడు కాదు. ఈనాడు దేశం దుర్భిక్షంగా మార డానికి, సోమరి పోతులై, మానవత్వం కోల్పోయిన ఈ మనుష్యులే కారకులు. రోజు రోజుకు నాకీ హాస్పిటల్ వాతా వరణం మీద రోత పుడుతోంది.

నిర్భాగ్యులైన రోగు లెందరో తమ రోగాలు నయమౌతాయన్న కొండంత ఆశతో, ఆ అందమైన భవనంలోకి అడుగు పెడుతున్నారు. కానీ వారికి తగిన ఆదరణగానీ వైద్య సదుపాయం గానీ లభించడం లేదు. ప్రభుత్వం హాస్పిటల్ మీద వినియోగిస్తున్న డబ్బు కేవలం బ్రతుకు తెరువుకు మాత్రమే గానీ, బ్రతికించడానికి కాదు.

ఒకరోజు హాస్పిటల్ ముందు రిక్షా దిగే సరికి పెద్ద అలజడిగావుంది. స్టాఫ్ అంతా ఏదో గుసగుసలాడు కుంటున్నారు.

నేను వెళ్ళి నా రూమ్‌లో కూర్చుని రాజాను పిలిపించాను.

"ఏమిటా అలజడి?" అడిగాను నేను.

"హాస్పిటల్‌కు ముందువైపున బార్ లైట్లు. చోకేలతో సహా ఎవరో దొంగి లించారు సార్!"

"ఎన్ని?" ఆశ్చర్య పడ్తూ అడిగాను నేను.

"పది సార్!"

"వాచ్ మెన్ ఏం చెబుతున్నాడు?"

"తన కేమీ తెలియదంటున్నాడు?"

"ఒకసారి ఇటుపిలవండి" అన్నాను నేను.

కొద్ది సేపట్లో వాచ్‌మాన్ నాముందు నిలబడ్డాడు.

"ఒకటా. రెండా? పదిలైట్లు నీకు తెలియకుండా ఏలా మాయమయ్యాయి" గట్టిగా దభాయించాను నేను.

వాడు మౌనం వహించాడు.

నేను ప్రక్కన్నే వున్న ఫోనుతీసు కొని పోలీసు స్టేషన్‌కు ఫోన్ చేశాను. ఒక అరగంట తర్వాత నలుగురు కాని స్టేబుల్స్‌తో ఎస్. ఐ. వేన్‌లో దిగారు. వారికి లైట్లుపోయిన ప్రదేశాన్ని చూపించాను.

"ఇందులో హాస్పిటల్ స్టాఫ్‌లో కొంతమందికి భాగముండాలి సార్." తన అభిప్రాయం తెలియ చేశాడు ఎస్. ఐ

పోలీసులు వాచ్‌మ్యాన్‌ను వేన్ ఎక్కమన్నారు.

"రక్షించండి బాబూ, రక్షించండి. వాటిని తీసింది నేను కాదు." అని వల వల ఏడ్వసాగాడు, అతను.

"మరెవరు?" తీక్షణంగా అతన్ని చూస్తూ అడిగాడు ఎస్. ఐ.

"వాడు బాబూ! తిరిపాల్. కాంపౌండర్ తిరిపాలు" అని నిజం బయట పెట్టాడు వాచ్‌మాన్.

వెంటనే తిరిపాలు కోసం కబురు పెడితే అతను ఆరోజు శలవు పెట్టినట్లు తెల్సింది. పోలీసులు వెన్‌లో తిరిపాలింటికి వెళ్లారు. అతనా సమయంలో దొంగిలించిన లైట్లను జాగ్రత్త చేస్తున్నాడు. అతన్ని రెడ్‌హాండడ్‌గా పట్టుకున్నారు పోలీసులు. కోర్టులో అతనిమీద కేసు బనాయించారు. నేరంఋజువైంది. కోర్టువారు అతనికి మూడునెలలు శిక్ష విధించారు.

మూడు నెలలుగడిచాయి. అతను మళ్ళా ఉద్యోగం కొసమని నా వద్ద కొచ్చాడు.

"ఇంత చేసి ఏముఖం పెట్టుకొని ఉద్యోగం కోస మొచ్చావ్?" కరువుగా అడిగాను నేను. అలాంటివ్యక్తులంతా నాదృష్టిలో దేశ ద్రోహులు.

"అలా అనకండి సార్! నాకు భార్యా ఇద్దరు పిల్లలు వున్నారు. వాళ్ళ నెలా బ్రతికించుకోను?" బ్రతిమలాడుకన్నాడు తిరిపాలు.

తిరిపాలు పరిస్థితికి నేను జాలి పడినా ప్రభుత్వ నిబంధనలు అతన్ని ఉద్యోగంలోకి తీసుకోను అనుమతించవు.

"ఈ విషయంలో నేనేమీ చెయ్యలేను తిరిపాల్" అన్నాను నేను.

"అతను నిజంగా భార్యా బిడ్డలను పోషించాలన్న బ్రతుకు భయం కలవాడయితే అలా ప్రవర్తించి వుండే వాడా!" నామనస్సులో అనుకున్నాను.

మరురోజు నేను నిద్ర లేవగానే విన్న వార్త "రాత్రి తిరిపాలు రైలు కింద పడి మరణించాడు." ఆ వార్తతో నాతల తిరిగి పోయింది.

"అతని చావుకు కారణం నేనా?" ఒక్క క్షణం నా మెదడాలోచించింది. "కాదు. ఎంత మాత్రం కాదు. నా విద్యుక్త ధర్మాన్ని నేను నిర్వహించాను. అతను చేజేతుల అతని జీవితాన్ని నాశనం చేసుకున్నాడు అంతే కాని అతని చావుకు కారణం నేనే మాత్రంకాదు." నన్ను నేను సమర్థించుకున్నాను. అలా నేను సమర్థించుకోగల్గాను. కానీ లోకాన్ని సమర్థించలేక పోయాను. ఆ వూరి ప్రాంతంలో నుండి వెలువడిన వార వార్తా పత్రికలలో విశేషంగా ప్రకటించబడిన వార్త

"డాక్టర్ నిర్దాక్షిణ్య చర్యవల్ల కాంపౌండర్ ఆత్మహత్య."

నాకు తల కొట్టేసినట్లైంది. నిజానికి నేను చేసిన నేరమేమిటి? అతను నేరం చేశాడు. చేసిన నేరానికి శిక్ష అనుభవించి, అవమానాన్ని భరించలేక ఆత్మహత్య చేసుకున్నాడు. కానీ లోకానికీ సంగతేం తెల్సు?

ఆ ఊళ్ళో పని చేయడానికి నాకు మనస్కరించలేదు. ఆ రోజే మెడికల్ సర్వీసెస్ డైరెక్టరుగారికి అర్జీ వ్రాసుకొని, అందులో నన్నేదైనా వూరికి ట్రాన్స్ఫర్ చేయమని కోరాను, వారం రోజులలోనే ట్రాన్స్ఫర్ ఆర్డర్సు, వాటితోపాటు నా రిలీవరు వచ్చారు. అతనికి చార్జీ అప్పగించి భయంకరమైన గుహనుండి బయటపడ్డంతగా సంతోషించాను.

"ఒక చిన్న దొంగతనం చేసినంత మాత్రాన పోలీసులకు పట్టించి, ఉద్యోగం లోంచి తీసేయించాలా? అలా అయితే హాస్పిటల్‌లో వున్న ప్రతి ఉద్యోగీ దొంగే. అందర్నీ పట్టించలేకపోయారా?" త్రాగుబోతు డాక్టర్ నిష్ఠూరంగానైనా నిజం చెప్పాడు.

"ఏ దొంగనైనా నేను పట్టించలేదు. దొంగతనం చేసినవారు ఏనాటికైనా పట్టుపడతారు. సాటి మానవుడైన పోలీసుచేత కాకపోయినా, అజ్ఞాతవ్యక్తి అయిన భగవంతునిచేత. ఇందులో నా ప్రమేయం ఏదీ లేదు" అని స్థైర్యంగా చెప్పి హాస్పిటల్ బయటికి వచ్చాను.

"అయామ్ వెరీ సారీ టు మిస్ యు సార్!" అన్నాడు రాజా భారమైన మనస్సుతో.

మౌనంగా అతనిచేయి నొక్కి వచ్చి రిక్షా ఎక్కాను. రోడ్డుమీదకొచ్చి, ఆ భవనంకేసి చూచాను. దూరంనుండి చూస్తే అందంగా కనిపించే ఆ భవంతిలోకి అడుగెట్టితే కల్గేది అసహ్యం, ఆవేదన.

అందమైన అత్తిపండులో పురుగులను సృష్టించిపెట్టిన భగవంతుని విచిత్ర సృష్టి మానవాతీతమైనది.

———




రూమ్ నెంబరు సిక్స్టీ సెవెన్‌లో ఇన్విజిలేషన్ చేస్తున్నారు శ్యామలా, రామారావూ.

హాలంతా కలయ దిరిగి ప్రతివిద్యార్థినీ పరిశీలనగా చూసి వచ్చి కుర్చీలో కూర్చుంది శ్యామల—గుమ్మం దగ్గర నుంచుని హాలంతా పర్యవేక్షిస్తున్నాడు రామారావు.

మొట్ట మొదటి బెంచీలో లేత నీలం రంగు చీర కట్టుకుని పరీక్ష రాస్తున్న అమ్మాయి శ్యామల దృష్టిని ఆకట్టుకుంది. ఆ పిల్ల నాజూగ్గా, కొంచెం నీరసంగా కనిపిస్తున్నది. 'ఆడపిల్లలు మరీనూ — పరీక్షలముందు తెగచదివి ఇలా తయారౌతారు,' అనుకుంటూ, తను చదువుకునే రోజులు గుర్తుకొచ్చి చిన్నగా నవ్వుకున్నది శ్యామల.

ఆపిల్ల మెళ్లో నల్లపూసలూ, కాళ్ళకు మట్టెలూ వున్నై. "ఓహో అయ్యగారు చదువుకో వస్తున్నారు! ఇంకేం మెట్రిక్ పరీక్షకు వచ్చింది" అనుకుంది శ్యామల.

అంతలో అమ్మాయి టేబిల్ మీదికి ఒరిగిపోయింది. 'అరెరె' అంటూ ఒక్క ఉదుటున ఆమెను సమీపించారు శ్యామలా, రామారావూ. కూజాలోంచి నీళ్లు వంపుకుని వెళ్ళి ఆమె మొహంమీద చల్లి సేద తీర్చింది శ్యామల.

"నే నిక్కడుంటాన్లెండి. మీరు ఆమెను లేడీస్ వెయిటింగ్ రూముకి తీసుకెళ్ళి కాస్త కాఫీ అదీ ఏమన్నా ఇప్పించండి" అన్నాడు రామారావు.

నెమ్మదిగా ఆ పిల్లను వెయిటింగ్ రూముకు నడిపించుకుని వెళ్ళింది శ్యామల. కాస్సేపటికిగాని మాట్లాడలేక పోయిందా పిల్ల.

"రాత్రి అన్నం తిన్నావా అమ్మా? పోనీ పొద్దునే టిఫిన్? ఏదీ తినలేదు గమో? ఆ మొహమె చెప్తోందిలే. ఖాళీ కడుపుతో పరీక్ష రాయటానికి వచ్చావా? మంచి దానివే" అంటూ ప్యూన్ చేత కాఫీ టిఫిన్ తెప్పించి పెట్టింది శ్యామల.

"వద్దండీ. నాకేం వద్దు" అంటూ [illegible] తిరగించా పిల్ల.

కానీ శ్యామలముందు అలాంటి మొహమాటాలేం పనికిరావు. తినేవరకూ ఊరుకోలేదు—వెంటనే పరీక్ష హాలుకి తీసుకు వెళ్ళింది మళ్ళీ.

"మీ మేలు మర్చిపోలేను. నాకు యెంతో సాయంచేశారు. దిక్కూమొక్కూలేని ఈవూళ్లో స్వంత అక్కలా ఆదుకున్నారు" అంటూ రెండు చేతులూ యెత్తి దణ్ణం పెట్టింది ఆపిల్ల పరీక్ష పూర్తవగానే.

"ఇవాళ లేచిన వేళమంచిది. అయితే-అయాచితంగా ఒక చక్కని చెల్లెలు దొరికింది. ఇంతకూ నీపేరేమిటమ్మా?" అని అడిగింది శ్యామల నవ్వుతూ.

"కామేశ్వరి" అన్నదా పిల్ల.

"బావుంది. నాపేరు శ్యామల. నువ్విప్పుడు మాఇంటికి రావాలమ్మాయి! అమ్మకు చూపించాలి నిన్ను" అంటూ ఆపిల్ల మాటకు అవకాశ మివ్వకుండా రిక్షా బేరమాడేసింది శ్యామల.

రిక్షాలో ఒకరి విషయాలు మరొకరు తెలుసుకున్నారు. శ్యామల మధ్య తరగతి అమ్మాయి. కష్టపడి చదువుకుని బి. ఏ. పాసై, కాలేజీలోట్యూటరుగా ఉద్యోగం చేస్తున్నది. ఇంటికి తనేపెద్దది. మిగతా పిల్లలెవరూ తండ్రి చేతికి అందిరాలేదు. అంతా చదువుకుంటున్నారు. నెల జీతం చాలక కటకట లాడే ఆకుటుంబానికి శ్యామల ఉద్యోగం గొప్పరిలీఫ్ ఇచ్చిందనే చెప్పాలి.

కామేశ్వరీ వాళ్ళది దగ్గరలోనే రాంపాలెమని ఒక పల్లెటూరు. ఏదో కొంత తినా గుడవా వున్నవాళ్ళే. అయిదారెకరాల మాగాణివుంది. వాళ్ళకక్కడ పాడీపంటా స్వంత ఇల్లూ వున్నాయి. కామేశ్వరి తర్వాత ఇద్దరే పిల్లలు. వయసులో రెండు మూడేళ్ల తేడావుంటుంది శ్యామలకీ కామేశ్వరికీ.

"మీ వారు ఏ వూళ్ళోవుంటారు? చదువా? ఉద్యోగమా?" అని అడగనే అడిగింది శ్యామల.

"ఉ—ఉద్యోగం చేస్తున్నారు కలకత్తాలో' అంటూ చటుక్కున తల వంచేసుకున్నది కామేశ్వరి.

"ఓహో—ఎంత సిగ్గు!" అని నవ్వుకున్నది శ్యామల.

ఆ రోజు బలవంతం చేసి తమ ఇంట్లోనే వుంచేసింది కామేశ్వరిని. ఎందుకోగాని ఆ పిల్ల అంటే అమితమైన ఇష్టం ఏర్పడిపోయిందామెకి.

చదువుకుని ఉద్యోగం చేస్తున్నా గర్వం, ఆడంబరం, అహంభావంవంటి గుణాలేమీ లేకుండా గలగలా నవ్వుతూ, నవ్విస్తూ, నిష్కల్మషంగా వుండే శ్యామల కామేశ్వరి మనసులో హత్తుకు పోయింది.

ఆ స్నేహం బలపడి, వారానికొక ఉత్తరం రాసుకోకపోతే తోచని స్థితికి వచ్చారిద్దరూ.

కామేశ్వరి మెట్రిక్ పాసైంది.

ఆసందర్భంలో శ్యామల రాంపాలెం

కూడా వెళ్ళి ఎంజాయ్‌చేసి వచ్చింది. కామేశ్వరితో, ఆమె కుటుంబంతో—ఆ పల్లెటూరును దృష్టిలో పెట్టుకుని, కష్టపడి ఒక చిన్న కథ రాసి కాలేజీ మాగజైనుకి ఇచ్చింది కూడాను.

మెట్రిక్‌తో చదువు ఆపేద్దామనుకున్న కామేశ్వరి, శ్యామల ప్రోత్సాహంతో పీయూసీ పరీక్షకు కూడా కట్టింది.

తన సెబ్జెక్ట్‌లో కొన్ని ఎస్సేలురాసి, ఇతర లెక్చరర్ల దగ్గర్నించీ మరికొన్ని ఎస్సేలు సంపాదించి పంపించింది శ్యామల—"ఈ సారి పరీక్షలకు వచ్చి నప్పుడు మా ఇంట్లోనే వుండాలి" అని షరతు ఒకటి పెట్టింది పైగా.

కామేశ్వరి తండ్రి ఆమెను తీసుకు వచ్చి శ్యామలా వాళ్ళింట్లో దిగవిడిచి వెళ్ళేడు. శ్యామల తండ్రితో మాట్లాడాడు. ఇరు కుటుంబాలకూ బంధుత్వం వున్న దన్న సంగతి ఒకటి బయట పడింది అయనరావడంవల్ల.

శ్యామల పర్యవేక్షణలో పరీక్షలు తృప్తికరంగా రాసింది కామేశ్వరి.

ఆ మర్నాడు కామేశ్వరిని తీసుకుని శ్యామలా ఆమె చెల్లెళ్ళూ తమ్ముళ్ళూ సినిమాకు వెళ్ళారు.

వచ్చిడాబా మీద అమ్మ పరిచి వుంచిన పక్కల మీద వాలారు. 'రామారావు బావున్నాడురా' అంటే 'రాజనాలయాక్షణ బావుందిరా' అనుకుంటూ కబుర్లు చెప్పు కుంటూ నిద్ర పోయారు పిల్లలు.

తెల్లవారితే కామేశ్వరి రాంపాలెం వెళ్ళి పోతుంది.

"కామూ! నేనొక కథ చెప్తాను వింటావా?" అని అడిగింది శ్యామల. ఓ-వెయ్యి కథలు చెప్పినా వింటా. కథలంటే నాకు చచ్చేంత ఇష్టం" ఉత్సాహంగా అన్నది కామేశ్వరి.

చిన్నగా నిట్టూర్చి మొదలు పెట్టింది శ్యామల. "అనగా అనగా ఒకమధ్య తరగతి కుటుంబం-రివాజు ప్రకారం అందులో ఇద్దరు ముగ్గురు పెళ్ళి కెదిగిన ఆడపిల్లలు. పెద్దపిల్ల తల్లిదండ్రులకు బరువుగా, గుండెల మీద కుంపటిలా బతుకుతున్నది. ఉద్యోగం చేస్తున్నదనుకో అయినా ఆడబ్బు ఏమీ మిగలదు. 'తర్వాత ఈ పిల్ల బతుకేంగావాలి?' అని తల్లి దండ్రులు ఒకటే మథన పడుతున్నారు. కట్నం గుమ్మరించందే ఆడపిల్ల పెళ్ళి ఎట్లా అవుతుంది చెప్పు ఈరోజుల్లో.

ఈ పరిస్థితుల్లో, తనేం చెయ్యాలో తెలియక, తండ్రి యాతన చూడలేక ఆపిల్ల........"

ఆపేసి గుటక వేసింది శ్యామల.

"ఆపిల్ల? ఏం చేసిందక్కా? ఏం చేసింది? ఏ ఆత్మహత్యేనా....చేసుకో బోలేదుగద—" ఆదుర్దాగా అడిగింది కామేశ్వరి, "లేదు చెల్లాయ్! ఆత్మ హత్యకు సాహసించలేదు. కానీ ఆత్మ హత్యా సదృశ్యమైన పని చేసిందమ్మా" బరువుగా వుంది శ్యామల కంఠం.

ఎమిటక్కా అది? త్వరగా చెప్పు-ప్లీజ్ అంటూ ఆత్రంగా ఆమె చేతులు పట్టుకుంది కామేశ్వరి

'రెండో పెళ్ళివాడిని చేసుకోవటానికి నిశ్చయించుకుంది రెండో పెళ్ళంటే వయస్సు ముదిరినవాడని కాదు ముప్పై మూడు ఏళ్ళు వుంటాయి. అంతే మనిషి ఒక మోస్తరుగా వుంటాడు—కానీ.... కానీ....ఆగిపోయింది శ్యామల.

ఆమె కనుకొలకుల్లో నీళ్ళు.

"అక్కా...."

కామేశ్వరి చేతులు శ్యామల భుజాల చుట్టూ అల్లుకున్నాయి.

"ఏమిటి చెల్లాయ్! కంట నీరు పెడుతున్నావు? నీకేమమ్మా శుభమా అంటూ కాపరానికి పోబోతున్నావు! అప్పుడు చిలకా గోరింకల్లా నువ్వూ మీ వారూ.... ఎప్పుడైనా ఉండబట్టలేక నాబోటిది చూడటానికొస్తే 'ఎవరు నువ్వు?' అని అడుగుతావేమో కదూ?" అంటూ వాతావరణం సంతోషంగా మార్చడానికి ప్రయత్నించింది శ్యామల.

"అక్కా! అక్కా!" అంటూ ఏదో చెప్పాలని ప్రయత్నించి—చెప్పలేక అల్లాడిపోయి—శ్యామల భుజంమీద వాలి బావురుమన్నది కామేశ్వరి.

"ఏమైందమ్మా! అరె—నన్ను మర్చిపోతా నన్నాననా ఏడుస్తున్నావు? అనసులే పొరపాటైపోయింది. నాకు తెలుసులే, నువ్వు ఏన్నెప్పుడూ మర్చిపోవని. ఛీ—ఇంక ఊరుకోవాలి మరి' అంటూ కళ్ళు తుడిచి ఓదార్చింది శ్యామల అంతేగాని కామేశ్వరి దుఃఖానికి కారణం తెలుసుకోలేకపోయింది

కాసేపు నిశ్శబ్దంగా వున్నాక—

"ఇంత చదువుకున్నదానివి ఈ పెళ్ళికి నువ్వెందుకు ఒప్పుకున్నావు? నీ తెలివంతా ఏమైంది?" అని అడిగింది కామేశ్వరి.

"గత్యంతరం లేక—రెండు మూడు సంబంధాలు చూశారు నాన్న ఆ మధ్య. అధమపక్షం అయిదువేలైనా కట్నమిచ్చి, ఆడబడుచు లాంఛనాలిచ్చి వెండి కంచం, వెండి చెంబు, పట్టుబట్టలూ—అయినా ఇవ్వాలన్నారు. అంతా కలిపి పదివేలవుతుంది. ఇదిగాక పెళ్లి ఖర్చు, నాన్న ఎక్కణ్ణించి తెస్తారు? మిగతా పిల్లల గతేమిటి?

పైగా చిత్రమేమిటో తెలుసా? ఆ వరమహాశయులు కనీసం గ్రాడ్యుయేట్లు కూడా కాదు—కట్నంమటుకు కావాలి. పిల్ల మంచితనం, తన సౌశీల్య ప్రాభవం చేత ఇరువంశాలూ వెలిగించగల నేర్పు—అఖ్ఖర్లేదు. డబ్బువస్తే చాలు. వాళ్ళ ఒంట్లో రక్తమాంసాలూ, వాళ్ళ మనస్సులో లజ్జాభిమానాలూ—మృగ్యమేమో మరి.

పోన్లే, వాళ్ళ గొడవెందుకు గాని ఇతనికి కానీ కట్నంకూడా అఖ్ఖర్లేదు. ఈ మాట నా చెవుల్లో అమృతం పోసినట్లయింది. వెనకా ముందూ ఆలోచించా లన్పించలేదు. ఆలోచించినా ప్రయోజన



యువ




మేమిటిలే.

నువ్వింందాక ఏమన్నావు కామేశ్వరీ! చదువుకుని ఉద్యోగంచేసే పిల్లవి. ఇలాంటి పెళ్ళికి ఎందుకు ఒప్పుకున్నానని కదూ. ఇప్పుడు తెలీదులే నీకు. ఉద్యోగం చేస్తున్నదాన్ని కనకనే ఒప్పుకున్నాను. స్వతంత్రంగా బ్రతకగల నేనే ఈ సాహసం చెయ్యకపోతే. ఇంకొకళ్ళకి ప్రమాదం వస్తుంది అనవసరంగా—అలా ఆశ్చర్యపోకమ్మాయి! తర్వాత తెలుస్తుందిగా. కాస్త సస్పెన్స్ ను ఎంజాయ్ చెయ్యి.

ఒక్కమాట కామేశ్వరీ! సుఖంకోసం ఆశపడి నే నీ పెళ్ళి చేసుకోవటల్లేదు. ఈ కర్తవ్యపాలన, ఈ అసిధారావ్రతం నాకు తప్పవు....'' అన్నది శ్యామల తీవ్ర భావావేశంతో.

''నాకు మతిపోతున్నదక్కా! నువ్వు తొందరపడి ఒక నిర్ణయానికి రావనే నమ్మకం నాకున్నది. అయినా ఎందుకో భయంగా గందరగోళంగా వుంది. కోపం తెచ్చుకోనంటే నేనొక మాట చెప్తాను వింటావా?'' అని అడిగింది కామేశ్వరి.

''చెప్పు.''

''మా నాన్న మీకు డబ్బు సాయం చేస్తారేమో అనుక్కుంటాను. పోనీ అప్పుగానే అనుకో. అన్నివిధాలా నీకు ఇష్టమైన పెళ్ళికొడుకును చూసి చేసుకుంటే సరి—

నవ్వి, ''ప్చ్ ఇలాంటి ఆలోచనలేం లాభంలేదు కామేశ్వరీ. నేను పూర్వజన్మ కర్మనూ, భగవంతుణ్ణీకూడా నమ్ముతాను. దేవుడు దేన్ని ప్రసాదిస్తే అదే నాకు చాలు—అన్నట్లు పెళ్ళి రహస్యంగా జరగాలిట, ఎవ్వర్నీ, చివరికి నిన్నుకూడా పిలవటానికి వీల్లేదు'' అంటూ దిండులో

తలదూర్చింది శ్యామల

*                    *

పెట్టెముందు కూర్చుని బట్టలు సర్దుతున్నది శ్యామల. గబుక్కున భుజాల చుట్టూ చేతులు పడేటప్పటికి ఉలికిపాటుతో కెవ్వుమంది.

"అబ్బ! ఎంత ఖంగారో? నేనేలే" అన్నాడు ప్రతాప్ ఆమెకింకా దగ్గరగా జరిగి నవ్వుతూ.

"ఓహ్! మీరేనా? యీదాలాపంగా వున్నా కదూ? ఉలిక్కిపడ్డాను" అంటూ దూరంగా జరిగికూచుంది శ్యామల.

అతని నొసలు ముడిపడ్డాయి.

"ఏమిటి శ్యామా! నీ ముఖావం అసలు? పెళ్ళైనప్పట్నించీ నన్ను తప్పించుకునే తిరుగుతున్నావ్" అని అడిగాడు.

"నేనా? ఛ—ఈ దేశ ధర్మం ప్రకారం నాకు మీరు పూజ్యులు—నా ఇహలోకానికీ పరలోకానికీ కూడా మీరే గదా ఆధారం—" అన్నదామె నవ్వుతూనే.

ఆ నవ్వు వెనక కసి, క్రోధం, పగ, అసహ్యం దాగివున్నాయని అతనికి తెలియలేదు. సరికదా "నువ్వు చాలా బాగా నవ్వుతావ్ శ్యామా! నీ పెదవులు చాలాచాలా బావుంటై—ఎంత బావుంటయ్యో చెప్పనా?" అంటూ మళ్ళీ దగ్గరగా జరిగా డతను.

"చెప్తురుగాని తొందరపడకండి. పొయ్యిమీద కూర మాడిపోతున్నట్లుంది" అంటూ గబుక్కున లోపలికి పరిగెత్తింది శ్యామల.

ఆమె వెనకే వంటింట్లోకి వెళ్ళాడు ప్రతాప్, నిరుత్సాహాన్ని అణుచుకుంటూ.

"శ్యామా! వంట తొందరగా చేసెయ్—పిక్చర్‌కు పోదాం—ఇవాళ ఏం వంక చెప్పినా విన్పించుకోనమ్మాయ్. నువ్వే చెప్పు అసలు. కొత్తగా పెళ్ళైన భార్యాభర్తలు ఇలాగేనా వుండేది? ఒక సరదా, షికారూ ఏం అక్కర్లేదా? చదువుకున్న పిల్లవుకదా. అంత నిరుత్సాహం ఎందుకు నీకు? నీకంటే ముసలివాళ్ళు నయం. పెళ్ళికి ముందు నేనెన్ని కలలు కన్నానో తెలుసా నీ గురించి. మనిద్దరం రతీ మన్మథుల్లా వుందామనుకున్నాను. కానీ నువ్వో. ఒట్టి జడపదార్థానివి తయారైనావు! సరే—వంట అయిపోవచ్చింది కదా. చక్కగా—మంచి చీర కట్టుకొని తయారుకా. ఓ—మాటల్లో పడి చెప్పటం మర్చిపోయాను. "నీకివాళ ఏం తెచ్చానో చెప్పుకో చూద్దాం" అని అడిగాడు అతను హడావుడిగా.

"ఏమో—డబ్బుగల మారాజులు—ఏం తెచ్చినా తేగలరు" అన్నది శ్యామల నిర్లిప్తంగా.

"అదే—ఆ ఆముదం తాగిన మొహమే పెట్టొద్దన్నాను. చూడు ఈ చీర బావుందా? నీకు బావుంటుందన్పించికొన్నాను" అంటూ ఒక ప్యాకెట్ ఆమె చేతికిచ్చాడు ప్రతాప్.

లేత గులాబీరంగు చీర, అరచేతి

వెడల్పున పాలపిట్ట రంగు జరీఅంచుతో మెరిసిపోతున్నది.

స్త్రీ సహజమైన ఉత్సుకతతో ఆమె కళ్ళు మెరిసాయి క్షణకాలం. మళ్ళీ మామూలుగా అయిపోయింది. "ఇప్పుడింత ఖరీదుపెట్టి చీర దేనికి?" అన్నది నెమ్మదిగా. ఆమె గుండెలో ఒకసారి గర్వమూ మరోసారి దుఃఖమూ పోటీ పడుతున్నై.

నీరు గారినట్లయిపోయాడు ప్రతాప్. శ్యామల పద్ధతి అతనికి అర్థం కావడం లేదు. భర్త తనంతట తాను చీర తెస్తే భార్య అట్లాగేనా ప్రవర్తించేది? తన కెందులోనూ లోటు చెయ్యలేదే. ప్రాణంగా చూసుకుంటున్నాదే—కానీ ఎంత చేసినా ప్రయోజనం కన్పించటం లేదు శ్యామల నవవధువులా వుండట ల్లేదు. సరే కాలక్రమాన మారక పోతుందా? అని నెమ్మదిగా ఉత్సాహం తెచ్చుకున్నాడు.

"ఇప్పుడెందుకా? సినిమా కెళ్ళబోతున్నాం గనక. ఊఁ లే మరి తొందరగా ఈ చీర కట్టుకురా. టేబిల్ మీద పూలపొట్లం పెట్టాను. పెట్టుకో—అప్పుడెలా వుంటావో తెలుసా? బంగారు బొమ్మలాగ వుంటావు" అన్నాడు.

శ్యామలకు నవ్వొచ్చింది.

"ఇప్పుడు తోలుబొమ్మలా వున్నానన్నమాట. ఏ బొమ్మయితే నేమండీ—జీవం లేకపోయాక" అంటూ అక్కణ్ణించి లేచి వెళ్ళిపోయింది.

నాలుగురోజుల తర్వాత.

చీరలూ, నగలూ, పువ్వులూ, స్వీట్స్ మొదలైన వేవి తెచ్చినా శ్యామలను సంతోషపెట్టటం జరగదని తెలుసుకున్న ప్రతాప్ కొత్తగా వెలువడిన రెండు మంచి పుస్తకాలు కొనుక్కువచ్చాడు.

చెక్కిట చెయ్యి చేర్చుకుని ఏదో ఆలోచిస్తున్నది భార్య. ఆమె మొహం చూస్తే ఎంతో అలసటగా వున్నట్లు తెలుస్తున్నది.

నెమ్మదిగా వచ్చి, ఆమె మొహాన్ని రెండు చేతుల్లోకి తీసుకుని ఆప్యాయంగా నుదురు ముద్దుపెట్టుకుని "ఎందుకు శ్యామా! అలా వున్నావ్—నాకు చెప్పవా? ఎంతసేపూ మన సంసారం గురించి నా తాపత్రయమే తప్ప నీకేమీ పట్ట దెందుకని? కాసేపు సరదాగా మనిద్దరం కబుర్లు చెప్పుకోవాలనీ, కష్టసుఖాలు మాట్లాడుకోవాలనీ అనిపించ దెందుచేత? నిన్ను సుఖపెట్టాలని ఎంత ఇదై పోతున్నానో తెలుసా? నీ మొహంలో చిరునవ్వు చూడాలని ఎంత ఎదురుచూస్తున్నానో తెలుసా?" అన్నాడు ప్రతాప్, బాధను అణుచుకుంటూ.

ఇంక ఉండబట్టలేకపోయింది శ్యామల. గబుక్కున అతని ఒళ్ళో తల వాల్చుకుంది. ఆమె కంటివెంట నీళ్ళుబికాయి.

"ఛ—ఛ—నే నేమన్నానని అంత బాధపడుతున్నావ్ శ్యామా!" అంటూ

ఆప్యాయంగా ఆమె ముంగురులు సవ
రించా డతను

"మీ రన్నందుకు కాదండీ

కళ్లు తుడుచుకుంటూ అని అక్కణ్ణించి
వెళ్లిపోయింది శ్యామల.

ప్రతాప్ నిట్టూర్చి విసుగ్గా బయటికి
నడిచాడు.

ఆరాత్రి అన్నాలదగ్గిర—

"ఇదేమిటి పచ్చడి వదిలేశావేం?
అదేమి అన్నంతినట మసలు. ఇంకా స్త
కూర తిను. ఇంత కొంచాగ్గా తింటావు
గనకనే అంత సన్నగా వున్నావు. ఇహ
నించి ఈ పద్ధతేం కుదరదమ్మాయ్. నేను
చెప్పినట్టు వినాల్సిందే" అంటూ గంభీ
రత నటిస్తూ భార్యకు మరింత వడ్డిం
చేశాడు ప్రతాప్.

అతని చిలిపితనానికి చిన్నగా నవ్వింది
శ్యామల.

"వినకపోతే ఏం చేస్తారు?" అని
నెమ్మదిగా అడిగింది.

"ఏం చేస్తానా? ఓయ్ అమ్మడూ!
నేను నీ మొగుణ్ణి. తలుచుకుంటే ఏమన్నా
చెయ్యగలను" చాలా సీరియస్ పోజు
ఎరువు తెచ్చుకున్నాడతను.

"అవును—నిజమే. నిన్ను వదిలేసి
మరొకర్ని చేసుకోనుకూడా చేసుకో
గలరు. అలా భార్యలను వదిలేయటం
తమరికి నల్లేరుమీద బండినడకే నాయె"
అన్నదామె.

దెబ్బతిన్నట్టు చూశాడు ప్రతాప్.

అంతలోనే తెలివి తెచ్చుకుని
'శ్యామా!' అన్నాడు ఆదుర్దాగా

'చెప్పండి—మీకు మీ మొదటిభార్య
ఎందుచేత నచ్చలేదు? ఆవిడను ఎందుకు
వదిలేశారు? అపారమైన మీ అనురాగాన్ని
పొందే అదృష్టానికి ఆవిడెందుకు నోచుకో
లేదు?" సూటిగా ప్రశ్నించింది.

అతని మొహం ధుమధుమలాడింది.

"ఇప్పుడదంతా ఎందుకు లెద్దూ. ఊఁ
అన్నం తిను ముందు" అన్నాడు.

"కాదు. చెప్పాలి.'

"నాకు పదకొండో ఏట చేశారు పెళ్లి.
తెలిసీ తెలియని వయస్సు—అయినా
పెళ్లివద్దని గట్టిపట్టు పట్టాను. చివరికి
ఏడ్చి గోలపెట్టాను. కానీ బలవంతాన
పెళ్ళిచేశారు. ఆ క్షణంలోనే నేను ప్రతిజ్ఞ
చేసుకున్నాను. మళ్లీ ఎప్పుడూ ఆ పిల్లతో
ఆడుకోననీ—దాని మొహం ఇంక చూడ
ననీ—చిన్నప్పట్నించీ నాకు పట్టుదల
ఎక్కువ."

"అంత బలవంతాన ఎందుకు చేశారు
మీకు పెళ్ళి?"

"ఆఁ ఎవరో ముసలావిడ చస్తోం
దిట. దగ్గిర సంబంధమే ఇది, మా పెళ్లి
చూస్తేగాని ఆవిడ ప్రాణం పోదుట.
నోట్లో వేలుపెట్టుకుని చీకుతూ కూర్చుంది
పెళ్లిపీటలమీద ఆ పిల్ల. నాకు బాగా
గుర్తు—ఛ-ఛ—నా కసహ్యం వేసింది.
వాళ్ళ పంతం వాళ్ళు నెగ్గించుకుంటే నా
పంతం నేను నెగ్గించుకున్నాను. పెళ్ళ



యువ



య్యాక ఆ వూరే వెళ్ళలేదు. ఆ పిల్ల మొహం మళ్లీ చూడలేదు.

"ఆ! మళ్ళీ ఆమెను చూడనేలేదా?" ఆశ్చర్యంగా అడిగింది శ్యామల.

"లేదు—నాకు చాలా చిన్నప్పట్నించీ చిత్రమైన ఊహలుండేవి. నేను పెద్దవాడినై గొప్ప చదువులు చదవాలనీ, బాగా చదువుకున్న అమ్మాయిని ప్రేమించి, ఆదర్శవివాహం చేసుకోవాలని తపన పడే వాడిని. చివరికా పల్లెటూళ్ళో పదకొండేళ్ళన్నా నిండక ముందరే సొంత మేనమామ కూతుర్ని అర్జెంటుగా పెళ్లి చేసుకున్నాను పైగా అయిదురోజుల పెళ్ళి. నాకు ఎంత ఆఘాతం కల్గించిందో ఈ సంఘటన ఆలోచించుకో శ్యామా! నన్ను అర్థం చేసుకోవటానికి ప్రయత్నించు—కులభేదం లేదు. విధవావివాహం కాదు—ఆఖరికి యుక్తవయస్కులమైనా కాదు. ఏమిటోలే అదంతా జరిగిపోయిన గొడవ. ఇప్పుడా పీడకలను తల్చుకోవద్దు అసలు" అన్నాడతను ఉద్విగ్నచిత్తుడై.

"బావున్నై, మీ కారణాలు. ఒక ఆడపిల్ల జీవితం నాశనం చెయ్యటానికి ఇవి కారణాలా? ఇంతకూ ఆ పిల్ల ఇప్పుడు బాగా చదువుకున్నదేమో—మంచి సౌందర్యవతి అయిందేమో—నాకంటే ఆమే బావుందేమో ఒకవేళ. ప్చ—మీ దురదృష్టం — పోనీ ఫొటో అయినా చూశారా?" అని అడిగింది శ్యామల.

"లేదు—చూడలా కానీ ఏం చదువుకుని వుండదని గ్యారంటీగా చెప్పగలను. ఆ కుటుంబ మంతేలే — పరమ సనాతనం" అన్నాడు ప్రతాప్.

"ఏమైనా గానీ-ఆమెకూడా మనిషే-ఆమెదీ మనసే. అందరిలాగే ఆ ప్రాణికీ కోరికలుంటాయి. ప్చ్—మీ పట్టుదలకు ఆ అమాయకురాలి జీవితాన్ని బలిచేస్తారా? ఏమండీ—తనేం తప్పు చేసిందని ఈ శిక్ష? ఈ క్షోభ? పాపం" అన్నది శ్యామల ఆర్తితో.

"పోదూ—పల్లెటూరు మొద్దు—బాధ కూడా తెలుసేమిటి తనకి?" అన్నాడతను తేల్చి పారేస్తూ.

"పట్నవాసం వారికిగాని బాధ తెలియ దన్నమాట. పల్లెటూరివాళ్ళంతా పట్టి గొడ్లు. ఏం? '

"అబ్బ! నన్ను మాట్లాడించకు. ప్లీజ్—దాని మాటలేం ఎత్తకు నా దగ్గిర—" అంటూ వెళ్ళి పడుకున్నాడు ప్రతాప్.

"సరే—ఎత్తనుగానీ—ఆమె పేరు మటుకైనా చెప్పండి" అన్నది శ్యామల అతని వెనకే వెళ్ళి.

"ఎందుకు పేరు?" దుప్పటి తొల గించి, కళ్ళు చికిలించి అడిగాడు ప్రతాప్.

"ఉట్టినేనండీ — కుతూహలం!" అంటూ నవ్వింది శ్యామల.

"కామేశ్వరి గాబోలులే. ఇంకా నయం చాముండేశ్వరి అని పెట్టలేదు. మరీ ఘోరంగా వుండేది" అంటూ దుప్పటి ముసుగు పెట్టుకున్నాడు అతను మళ్ళీ.

ఒక్క_క్షణం ఆమె మెదడంతా మొద్దు బారిపోయింది. ఆమె మనస్సునిండా "కామేశ్వరి" అనే పేరు నిండిపోయింది.

"ఏమో ఏ కామేశ్వరో? తనేనని ఏమిటి?" అనుకుంటూ గబగబా లేచి పాత ఫోటో లన్నీ వెతికింది. కానీ ప్రతాప్ మొదటి పెళ్ళిఫొటో ఎక్క_డా కన్పించలేదు.

మర్నాడంతా ఆలోచించింది.

ఆవిషయం తెలుసుకోవాలంటే ఒక్క_టే ఉపాయం కన్పించింది. భర్త వచ్చేవేళ్టికి చక్క_గా అలంకరించుకుని కూచుంది. మొహంలో ప్రసన్నతాదృష్టి. పెదవులపై కళవనే చిరునవ్వు—అలం రించింది. ఒక విధమైన ఉత్సాహంతో, ఒక విధమైన పట్టుదలతో—ఆమె తేలి పోతున్నది నేలమీద నిలవకుండా—

ఆఫీసునించి వచ్చిన భర్తకు ఆప్యా యంగా సేవచేసింది మనస్ఫూర్తిగా. ముగ్ధుడైపోయినాడతను. "ఏమి నా అదృష్టం. ఇన్నాళ్ళకి నా ఇల్లాలి మొహంలో ఇంత జీవకళ చూశాను" అన్నాడు ఆమె చెక్కి_లి నొక్కు_తూ—

చిన్నగానవ్వి "మీరు మరీనూ—" అన్నది పరవశించిపోతూ—శ్యామల

"నిజం- శ్యామా! ఇవాళ ఎలా వున్నావో తెలుసా? దేవకన్యలా వున్నావు ఎప్పుడూ నువ్వింత హుషారుగావుంటే ఎంత బావుంటుంది శ్యామా! నీ అందం నన్ను వివశుణ్ణి చేస్తున్నది. నీ హుషారు నన్ను నిలవనీయడంలేదు. ఉద్యోగం మానేసి ఇరవైనాలుగు గంటలూ అలా నిన్ను చూస్తూ కూచోవాలన్పిస్తున్నది" అన్నాడతను.

శ్యామల హృదయం జివ్వుమన్నది. అతని కౌగిట్లో ఒక్క_క్షణంపాటు మరే

విషయమూ గుర్తుకు రాలేదు. "ఇతడు నా భర్త. భర్తనించి ఇంత అనురాగాన్ని నోచుకున్నాను. ఓహో— నాకీ ఊహ చాలు. ఈ మధురస్మృతే నా భవిష్యజీవితానికి ఆలంబనం—" అనుకుంటూ పరవశమై పోయిందామె.

"చెప్పు శ్యామా! అస్తమానం నా దగ్గరే వుండాలన్పించటం లేదా నీకు?" ఆశగా, లాలనగా అడిగాడు ప్రతాప్.

"ఎందుకన్పించదండీ! ఎంతగానో అనిపిస్తుంది. నే నొక్కదాన్నే నా భర్త అనురాగాన్ని అనుభవించాలని, ఇంకేస్త్రీ కూడా మనమధ్యకు రాకూడదని— కానీ...."భరించలేని ఆవేదనతో గిలగిల లాడి పోయిందామె—

"అర్థమైంది శ్యామా! నీ భయం. ఆమెవల్ల నీకే అపకారమూ జరగదు. నిశ్చింతగా వుండు. పిచ్చిపిల్లా! ఇందుకా ఇన్నాళ్ళూ నీబాధ." అన్నాడతను.

"ఎలా నిశ్చింతగా వుండనండీ. విడాకు లివ్వలేదు గదా మీ కుటుంబ గౌరవానికి భంగం కలుగుతుందని, చట్టరీత్యా నేరమనీ, మీ ఉద్యోగం పోతుందనీ నన్ను రహస్యంగా పెళ్ళిచేసుకున్నారాయెను. సకల బంధువుల సాక్షిగా మీరామె మెళ్ళో తాళికట్టారు. న్యాయానికి ఆమే మీభార్య—నేను కేవలం—కేవలం—ఉంపుడు........"

"ఛట్" అంటూ ఆమెనోరు మూసేశాడు ప్రతాప్.

"సాక్ష్యానికి బంధువులు లేకపోవచ్చు. కానీ నా మనస్సున్నది— పంచభూతాలున్నాయి నువ్వు ముమ్మాటికి నా భార్యవి. నువ్వే నాభార్యవి" ఆర్తితో నిశ్చయంతో అంటూ ఆమె చేతిలో చెయ్యి వేశాడు.

"కానీ....ఆవిడే మన పెళ్ళిసంగతి తెలిసి ఇక్కడికివచ్చి తనస్థానం—ఆక్రమించు కుంటానంటే....నాగతి?....నేను మాట్లాడకుండా తప్పుకోవలసిన దాన్నే గదా—" అన్నదామె—

"అఖ్ఖర్లేదు. నేను నీపక్షమే నంటున్నాగా- నాకిష్టం లేదంటూంటే బలవంతాన కాపరం చెయ్యమంటుందా? నీకు తెలీక భయపడి పోతున్నావుగాని—వాళ్ళకెవరికీకూడా అంతసాహసం లేదు. వుంటే మన పెళ్ళికి ముందే జాగ్రత్త పడేవాళ్ళు. ఎంత అమాయకురాలను కున్నావ్—అయినా ఎక్కడో కృష్ణా జిల్లాలో మారుమూలకు గ్రామమైన రాంపాలెంలో వున్న వాళ్ళకి కలకత్తాలో మనసంగతేం తెలుస్తుంది" అన్నాడతను.

దీర్ఘంగా నిశ్వసించింది శ్యామల. ఆమె గుండె ఆర్తితో మూలిగింది. ప్రేమతో కొట్టుకుంది.

"అనుకున్నంతా అయింది తను ఆక్రమించింది కామేశ్వరిస్థానాన్ని అన్న మాట ఆ అమాయకురాలి జీవితానికన్న మాట తను ఎసరు పెట్టింది." అని గిల గిలలాడింది.

భర్త మీది ప్రేమ ఒక్కక్షణంపాటు ఆమెను ఊపిరాడనీయలేదు — అతన్ని

వదులుకోవటానికి ఆమె మనస్సూ, శరీరమూ ఏకమైససేమిరా ఒప్పుకోవటం లేదు.

అతిప్రయత్నం మీద తనను తాను సంబాళించుకుని "అయినా పెళ్ళికి ముందే తెలుసునుగా—ఈ చెల్లి కాకపోతే ఇంకో చెల్లి. ఎవరైతేనేం అన్యాయానికి బలైపోతోంది. ఆ చెల్లిని కాపాడాలనేగదా ఈ పెళ్ళికి వప్పుకుంది. పెళ్ళిమీద మోజు కొద్దీ కాదాయె. కాకపోతే సంఘానికి తను వివాహితగా కనిపించాలి. మెళ్ళో మంగళసూత్రం ప్రీకి శ్రీరామరక్ష— వెళ్ళి మళ్ళీ ఉద్యోగంలో జాయిన్ కావాలి. జీవితంలో ఒక మంచి పని. ఏ ఆడదీ చెయ్యని త్యాగం—చేసిన తృప్తే చాలు శేష జీవితాన్ని గడపటానికి— ఇంతదూరం వచ్చి ఇప్పుడు వెనకాడ కూడదు. ఎలాగైనా సరే—కామేశ్వరి జీవితం కళకళలాడాలి. ఇందుకే గాబోలు పెళ్ళిసంగతి చెప్తుంటే ఆపిల్ల అలా ఏడ్చింది" అనుకుంది. దీర్ఘంగా నిశ్వసించింది.

ఆ మర్నాటి సాయంత్రం—

ప్రతాప్ వచ్చేటప్పటికి టేబిల్ ముందు కూర్చుని ఏదో రాసుకుంటోంది శ్యామల.

మెల్లిగా వెళ్లి ఆమె కళ్లు మూసాడతను.

"మీరా? వచ్చేశారా అప్పుడే—చాలా పెందలాడి వచ్చారు గదూ—" అంటూ గాభరాగా విడిపించుకుని—రాస్తున్న కాయితం ఉండచుట్టేసి, జాకెట్లో దాచేసింది శ్యామల.

"ఏమిటది? ప్రేమలేఖా?" నవ్వుతూ అడిగాడు తను.

"ప్రె—ప్రేమలేఖ—మీకెలా తెలుసు" అంటూ గాభరాగా పెదవి కొరుక్కుని, గబగబా లోపలికి వెళ్లి ఆ కాయితం దాచేసి వచ్చిందామె. కానీ మామూలుగా వుండలేకపోతున్నట్లు కన్పించింది.

ఆరాత్రి ఆమె నిద్రపోయాక వెదికి వెదికి ఎలాగైతేనేం ఆమె పెట్లో చీరల మడతల్లో సంపాదించాడా కాయితాన్ని— ప్రతాప్.

కళ్ళు అగ్నికణాలు వర్షిస్తుండగా చదివాడు.

డియర్ రావ్!

ఈ మధ్య నీ దగ్గిర్నించి ఉత్తరాలు రాకపోతే ఖంగారుపడ్డాను. నువ్వు ఇంత ప్లాన్‌లో వున్నావని నాకేం తెలుసు మరి? నిన్న నీ ఉత్తరం ఎంతో సంతోషం కలిగించింది. వెంటనే చింపేశాన్లే— భయపడకు. నన్ను నీ దగ్గిరికి వచ్చెయ్యమంటావా? ఎంత శుభవార్త రాశావు? కానీ నాకు చాలా భయంగా వుంది ప్రతాప్‌ను తప్పించుకురావటం ఎట్లాగా అని— అయినా ఏదో వంక దొరక్కపోదులే— నీకోసం....తప్పు తప్పు మనకోసం ఈ మాత్రం సాహసం చెయ్యకపోతే ఎలాగా? మళ్లీ నీతో జీవితం—ఓహ్! ఎంత సంతో....ఉత్తరం సగంలోనే ఆగిపోయి వుంది.

పళ్ళు బిగబట్టాడు ప్రతాప్—

గబుక్కున వెళ్లి "ఇదేమిటి?" అని

అడిగారు శ్యామలను లేపి ఉత్తరంవైపూ అతనివైపూ మార్చిమార్చి చూపి "అదా ఉత్తరం" అన్నది శ్యామల జంకకుండా. ఆ ఉత్తరం భర్త చూడాలనే గదా ఆమె తాపత్రయం.

"ఎవడీ రావు?" అతని గర్జన.

"నా బాయ్ ఫ్రెండ్."

ఆమె చెంప ఛెళ్ళుమన్నది.

ఇంకేం మాట్లాడాలో తోచలేదతనికి—ఒక్కక్షణం అటూ ఇటూ పచారుచేశాడు.

"ఎంత మోసం—ముందు నా ఇంట్లోంచీ బయటికి నడు" అన్నాడు ఆగ్రహం వెల్లువికి రాగా.

"ఇందులో మోసమేమిటి? కొన్ని కారణాల వల్ల నాకు మీరు నచ్చలేదు. సరిపోలేదు? అయినా ఎదురుగావున్నాను గనక నా సంగతి తెలిసింది మీకు. అక్కడ పల్లెటూళ్ళో తమరి ఇల్లాలు ఇలా ఎంతమందితో....

"షేర్కుయ్" మళ్లీ ఆమె చెంప ఛెళ్ళుమంది.

"ఆమె పేరెత్తటానికైనా అర్హత లేదు తెలుసా నీకు? నా బుద్ధి గడ్డి తిని.... నిన్ను తెచ్చి నెత్తి కెక్కించుకున్నా గానీ. ముందు వెళ్లి కామేశ్వరిని తీసుకువస్తాను. అందకత్తె కాకపోయినా ఫరవాలేదు. నీ లాంటి పిచరాలుమటుకు కాదు. సుగుణవతి—శీలవతి. మా అమ్మకు కోడలే కాదు, మేనకోడలుకూడా. తనకి అన్నీ మా అమ్మ పోలికలే వచ్చాయని విన్నాను. నీ తళుకు బెళుకుల కిహ మోసపోను. ఇంక ఆలస్యం చెయ్యను. కామేశ్వరిని క్షమించమని అడుగుతాను" అన్నాడతను.

ఒక్క ఉదుటునవచ్చి అతని కాళ్ళను చుట్టుకున్నది శ్యామల. ఆమె శరీరం ఒణుకుతున్నది. కళ్ళు వర్షిస్తున్నాయి.

"మీకు తెలీదు. నేను మిమ్మల్నెంత ప్రేమిస్తున్నానో, మీరు చూసిన ఆ ఉత్తరం అబద్ధం. ఎలాగైనా సరే మీరు నన్ను విడిచిపెట్టి కామేశ్వరిని తీసుకొచ్చుకోవాలని అలా చేశాను. కానీ ఇప్పుడు నేనే మిమ్మల్ని విడవలేక పోతున్నానండీ—ఈ గుండెకోతను భరించలేకపోతున్నాను" అని మనస్సులోనే అగ్గగలాడిందామె.

"ఏమండీ! మంచిపని చేస్తున్నారు. నన్ను మర్చిపోయి మీరూ, కామేశ్వరీ హాయిగా వుండండి" అంటూ ఏడిచింది. కాళ్ళు వదలలేదు.

"ఆ సంగతి నువ్వు చెప్పక్కర్లేదు. నాకు తెలుసు—ఇంక నేను పొరపాటు చేస్తానా. నా కామేశ్వరిని పువ్వుల్లో పెటి కాపాడుకోనూ—వదులు ముందు—ఛీ—" అంటూ విదిలించుకోబోయాడు. అర్ధ మూర్ఛావస్థలో అలాగేవుండిపోయిందామె.

"చెప్తుంటే—నీక్కాదూ!" అంటూ ఒక్క నెట్టు నెట్టా డతను. వెళ్లి గడప మీద పడింది శ్యామల "అమ్మా!" అని అరుస్తూ—

* *

ఏమిటక్కా! పరుపుమీదనించీ కింద పడ్డావా? అయ్యో—ఏమిటింకా కలవ

రిస్తున్నావు? అమ్మకోసమా? సినిమానించి వచ్చాకకూడా ఆవిడను చూసావుగదమ్మా పదిన్నరకి ఇప్పుడు టైము మూడైం దేమో—ఇంతలోనే విరహమా అమ్మ కూఫీ ఇంతసేపు అమ్మను చూడకుండా వుండలేని పెద్దమనిషివి రేపు పెళ్లి ఎలా చేసుకుంటున్నావ్? కాస్త చెప్పమ్మా! బావగారి దగ్గిర కూర్చుని 'ఊం అమ్మ కావాలీ అని ఎడుస్తావా? ఎగతాళిగా అంటూ శ్యామల భుజాలు పట్టుకుని కుదిపింది కామేశ్వరి

గబుక్కున కళ్లు తెరిచింది శ్యామల ఎదురుగా కామేశ్వరి అప్పుడే వచ్చేశావా? అన్నది ఆదుర్దాగా

నే నెక్కడికి పోయా నక్కా—రావడానికి? ఎడ్డూరంగా అడిగింది కామేశ్వరి

కళ్లుబాగా తెరిచి లేచికూచుని మెళ్ళో వున్న ఒంటిపేట గొలుసువేపు చూసింది శ్యామల

"ఏమిటక్కా!" చిత్రంగా అడిగింది కామేశ్వరి

'అదికాదు—మంగళసూత్రాలు

"మంగళ సూత్రా లా? భలేదానివే కలలో చేసుకున్నావా పెళ్ళి? ప్చ్—పాపం—తొందరపడకు మరి ఆ ముహూర్తమూ త్వరలో వచ్చేస్తోందిగా అంటూ నవ్వింది కామేశ్వరి

ఆనందాతి శయంతో ఒక్కసారి వెలిగిపోయింది శ్యామల మొహం కామేశ్వరి బుజాలుపట్టుకుని దగ్గిరికి మరీ దగ్గిరికి లాక్కుని నిజంగానా? చెల్లీ! నాకింకా పెళ్లి కాలేదా? ఎంత అదృష్టం—'

అంటూ కౌగిలించుకుంది

ఏమిటిది! నే నమ్మా కామేశ్వరిని—కాబోయే బావగార్నికాదు కొంచెంగా అన్నదా పిల్ల

ఊరుకో—నే నతన్ని పెళ్లిచేసుకో బోవటల్లేదు బాబోయ్—అజన్మ బ్రహ్మచారిణీగా నైనా వుంటాను గానీ ఇలాంటి వాడిని పెళ్లిచేసుకుని—తర్వాత ఆ మానసిక యాంతన నేనుపడలేను అంతత్యాగం ఊహించుకోవటానికి బాగానే వుంటుంది. కానీ అమ్మో నిజజీవితంలోనే—నావల్ల కాదు పతిదానం నేను చెయ్యలేను నేనే కాదు ఏఆడదీ చెయ్యలేదు అంతకంటే ఈ బతుకే నాకు హాయి రేపొద్దున్నే నాన్నకు చెప్పెయ్యాలి ఈ పెళ్ళివద్దని

శ్యామల మాటలను నోరు తెరుచుకుని వింటోంది కామేశ్వరి

తర్వాత ఆశ్చర్యం నటిద్దువుగాని ముందు నీసంగతి చెప్పు నువ్వు పీయూసీ అయ్యాక ఏం చేస్తావు? బియ్యే చదువు తావా, అని అడిగింది శ్యామల

చదవనను కుంటాను—అయనా—అబ్బ—అదే నక్కా మీ మరిదిగారు నాన్నకు ఉత్తరం రాశారు తొందర్లోవచ్చి నన్ను తీసుకువెళ్తానని—నిన్ను విడిచి అంతదూరం వెళ్లాలిగదా అని ఏడుపొచ్చింది ఇందాక అని సిగ్గుపడుతూ శ్యామల ఒళ్ళో తల దాచుకున్నది కామేశ్వరి




పదేళ్ళ క్రితం జానకికి పదిహేనేళ్ళు. అంటే ఇప్పుడిరవై యిదో ఏడు నడుస్తున్నదన్నమాట. క్షమించండి—జానకి ఇప్పుడు పేరు మార్చుకున్న సినిమా తార. సినిమా తారల వయసు నిర్ణయించటానికి వేరే గణితం వుంటుందని వేరే చెప్పాలా? జానకి ఇప్పటి పేరా? చాలా అనవసరం, నా మాట నమ్మండి.

ఇప్పుడు జానకికి కులం లేదు. కాని పదేళ్ళ క్రితం ఆవిడ వేశ్య. అంటే అప్పటికింకా వృత్తిలో ప్రవేశించలేదనుకోండి. ఆపని కూడా జరిగి ఉండవలసిందే—ఆవిడ మేనమామ రాహువల్లే అడ్డుపడకుండా వుంటే. ఆయన—అంటే ఆ మేనమామ—సంస్కర్త, చాలామందికి పెళ్ళిళ్ళు చేయించాడు జానకికి కూడా చేయించేవాడే—చచ్చిపోకుండా వుంటే!

తన శిక్షణ కిందా, రక్షణకిందా వుంచి జానకిని మేనమామ ఉద్ధరింతా మనుకుంటే జానకి ఆయనకు తెలియకుండా,

ఒక కొంటెపని చేసింది. అది జానకి మొదటి ప్రణయం. వెంకటేశ్వర్రావు కూడా అది మొదటిప్రణయమే. మొదట చూపులు కలియటం దగ్గర్నించీ వీడుకోలు నిట్టూర్పుల వరకూ ఈ ప్రణయగాధ జానకి ఆధ్వర్యంక్రింద ఆమె వేసిన పట్టాలమీదే నడిచింది. కాని ఈ సంగతి వెంకటేశ్వర్రావు ఎరగడు ఆఖరువరకూ అతను తన ప్రణయం ఫలించటానికి కారణం తన ధైర్య సాహసాలే నను కున్నాడు. ఆ విశ్వాసంతోనే అతను తనను అభినందించు కున్నాడు; తన మాయలో పడినందుకు జానకినిచూసి ప్రేమ పూర్వకంగా జాలిపడ్డాడు. టోగంపిల్లను ప్రేమించిన తన ఔదర్యానికి తనకే ఆశ్చర్యం వేసింది. ఇంతటితో తను గొప్పకథలో నాయకులతోటివాడై పోయి నట్టుగా భావించాడు.

అయితే ఇతర విషయాల్లో మాదిరి గానే ప్రణయం సలక్షణంగా ఉండటానికి పూర్వానుభవం అవసరం. ఈ పూర్వాను భవం మన కాముకు లిద్దరిలోనూ చాలా లోపించింది. అందుచేత ఈ ప్రణయంలో రసికత్వం కంటె ఉద్రేకమూ, ఆనందం ఆవేదనా అతిశయించటం జరిగింది. అందుకు క్రెడిట్—ఆ విషయం ఇద్దరికీ తెలియదు.

కాలక్రమాన ఇద్దరూ అనుభవజ్ఞులైనా మనుకోండి. జానకి వృత్తిలోకి దిగక తప్పలేదు; ఎంత జాగ్రత్తమనిషి అయి నప్పటికీ వెంకటేశ్వర్రావు పరస్త్రీనిచూడక మాననూ లేదు. కాని ఇద్దరికీ మొదటి ప్రణయం మరుపు రాలేదు. జరిగింది జరిగినట్టు జ్ఞాపకం పెట్టుకున్నారని కాదు— అట్లా జ్ఞాపకం పెట్టుకుంటే ఏప్రణయమూ బాగుండదు. అందుచేత మరవదగిన అంశాలు సంపూర్ణంగా మరిచి, మిగిలిన కథ బహుశ్రద్ధగా జ్ఞాపకంవుంచుకున్నారు. కాకపోతే ఏమిటంటే జానకికంటె వెంక టేశ్వర్రావు తన మొదటిప్రణయాన్ని జాస్తిగా స్మరించేవాడు; ఎక్కువగా ఆరా ధించేవాడు; తరవాత ఎక్కువగా నిట్టూర్చే వాడు. "నీకోసం దిగులుపడి చచ్చి పోతాను!" అని అన్న జానకి మాటలు అతని చెవుల్లో మోగుతున్నట్టే ఉండేవి.

మేనమామ చచ్చిపోయిన తరవాత జానకి తన తల్లి దగ్గిరికి వెళ్ళి పోయిన కొత్తలో, వెంకటేశ్వర్రావు తన ప్రణయ కథ ముగిసిందని గుర్తించ లేదు. ఈ నాటకానికి నాందిప్రస్తావనలు మాత్రమే అయినవనీ అసలు నాటకమంతా ముందే వుందనీ నమ్మాడు. ఇప్పుడు పడినతెర మళ్ళీ లేవటానికి అంతరాయంగా సంఘమూ, ఆచారాలూ, మూఢవిశ్వాసాలూ మొదలైన వెన్నో వున్నవని అతనికి తెలియకపోలేదు కాని ఎప్పుడో, ఎట్లాగో, ఇవన్నీ తొలిగిపోయి ఈ తెర మళ్ళీ పైకి లేచి అసలు నాటకం ప్రారంభ మవుతుం దనే అతని భ్రమ.

ఆ భ్రమ యథార్థమైంది. మళ్ళీ జానకి




వెంకటేశ్వర్రావూ కలుసుకున్నారు. ఇది కేవలమూ ప్రమాదవశాన జరిగిన పునస్సంధానం కాదు. ఒకరినొకరు కలుసుకోబోతున్న సంగతి ముందుగా ఇద్దరికీ తెలుసును. ఆ కారణంచేత తమ పాత ప్రణయకథను ఇద్దరూ స్మరించారు. ఒకరికోసం ఒకరు ఎక్కువైన ఆత్రంతో ఎదురుచూశారు కూడానూ.

కాని తీరా కలుసుకునేటప్పటికి ఇద్దరికి అనుకున్న వికారాలు కలగలేదు. ఒకరికళ్ళ కొకరు కొత్తగా కనిపించారు. నిజానికి ఈ మార్పు వాళ్ళ స్వరూపాల్లో కలిగినది కాదు. అది అట్టే చెప్పుకోదగిన మార్పుకాదు. జానకి విడిగాకూడా కొద్ది మేకప్‌మీదవుండటమూ, లిప్‌స్టిక్ వుపయోగించటమూ అభ్యసించింది. అది మినహాయిస్తే జానకి దాదాపూ పదేళ్ళకిందటి జానకే. ఈ పదేళ్ళలోనూ వెంకటేశ్వర్రావుకు అధికంగా సంక్రమించిందల్లా ఒక చత్వారపు సులోచనాల జోడూ. అతిక్షౌరంవల్ల బిరుసెక్కి నలుపుకు తిరిగిన గడ్డమూనూ.

ఆ మార్పు మనుష్యుల్లో లేదు. వాతావరణంలో యేర్పడ్డది. జానకి నటించిన రెండుమూడు చిత్రాలూ వెంకటేశ్వర్రావు చూసి కొద్ది ప్రయత్నంతో ఆమెను క్షమించగలిగాడు. జానకి జీవితంలో తటస్థించిన ఈ శోచనీయాంశం తనకూ జానకికీ వున్న సంబంధాన్ని యేవిధంగానూ బాధించ దనుకున్నాడు. కాని జానకి కళ్ళబడ్డ మరుక్షణమే ఆమె సినిమా తారత్వం పెడేలున నుదుటిన తగిలి నట్టయింది. అసమర్థపు తారే కానివ్వండి. జానకి తారకావటానికీ, మొహానికీ పెదవులకూ

రంగుపూసు కోవటానికీ వెంకటేశ్వర్రావు అభ్యంతర పెట్టలేదు. అతన్ని హింసించింది ఆమెహోదా. ఆవిడ వాలకం. ఆవిడ చుట్టూ వున్న వాతావరణం. చుట్టూ రకరకాల మగవాళ్లు, కొందరు ఆవిడను సంతోషపెట్టటమే, ఆవిడ తమవంక చూసేటట్టు చెయ్యటమే జీవితాశయమన్నట్టు శ్రమపడుతున్నారు. ఆవిడ నోటివెంట చిన్నకోరికవస్తే జనం తొక్కిసలాడుతూ ఆమె పనిచెయ్యటానికి పరుగెత్తుతున్నారు. తను చక్కని సోఫా మీద—స్టూడియో ప్రాపర్టీయే ననుకోండి —కూర్చుని యితరులు నిలబడి వుంటే తనకేమీ పట్టనట్టూ, ఇంతమందిని ఉద్ధరించటానికి యేలోకంనించో దిగి వచ్చినట్టూ ప్రవర్తిస్తున్నది.

ఇది సహించటం చాలా కష్టమయింది వెంకటేశ్వర్రావుకు. తను ప్రేమించిన వ్యక్తికీ, ఈ రంగుల బొమ్మకూ ఏమిటి సాపత్యం? తన కోసం దిగులుపడి చచ్చిపోయే జానకి ఇట్లాగేనా వుండేది?

తననుగురించి జానకికూడా ఇట్లాగే భావిస్తున్నదని వెంకటేశ్వర్రావు కలలో కూడా భావించలేదు. అతను కనిపించగానే తన గుండె ఎట్లా జల్లుమనేదీ, అతనితో ఏకాంతంకోసం తన మనస్సు యెంత పరితపించేదీ. అది లభ్యమైపోయేదాకా ప్రతిక్షణమూఎట్లా యుగంగాతోచేదీ వైన వైనాలుగా ఊహించుకుంది జానకి. అతని సమక్షంలో తనని ఆదరించబొయ్యే ముగ్ధత్వం ఊహించుకుని నవ్వుకుంది కూడాను. తను ప్రేమించిన వెంకటేశ్వర్రావు అమాయకుడు. వెనకటి ప్రణయ కథలో తను గీసిన గీతవెంబడే నడిచిన వాడు. తన మాతృత్వాన్ని సమగ్రంగా తృప్తిపరచినవాడు. ఇటీవల అతను రెండు నవలలు రాశాడు ఆ నవలలు చదివి వెంకటేశ్వర్రావు ఇట్లా అయిపోయినాడే అని చింతించింది కాని, జానకి కొద్ది ప్రయత్నంతో అతన్ని క్షమించగలిగింది. ఆ నవలలను అతను నిర్లిప్తుడై రాసిఉంటా డనుకున్నది. అవి అతనిలో చెప్పుకోదగిన మార్పేమీ తెచ్చి ఉండ వనుకున్నది.

అతను రాసిన నవలతాలూకు ఫిలిం రైట్సు కొని అందులో నాయికగా తనను ఎన్నుకున్నారని తెలిసినప్పుడు జానకి ఒకవిధంగా సంతోషించింది. అతను నవలరాసిన కించిత్తు దోషమూ తను అందులో పాత్రధారణ చెయ్యటంవల్ల సమసిపోతుందని ఆమె హృదయంలో ఒక అస్పష్టవిశ్వాసం ఉండింది.

కాని తీరా ఎదట పడేటప్పటికి అతను కాకపోయినా, అతని చుట్టూవున్న వాతావరణం చాలా కొత్తగా కనిపించింది జానకికి. ప్రొడ్యూసరూ, ఇతర పెట్టుబడిదార్లూ అతన్ని గొప్ప చెయ్యటమూ, అతని నోటవచ్చే ప్రతి అభిప్రాయాన్నీ అతిశ్రద్ధతో వినటమూ, తమ కష్టసుఖాలు అతనితో సవినయంగా చెప్పుకోవటమూ



యువ

చూసి యేమనుకోవాలో తెలియలేదు జానకికి.

"ఈ ముష్టినవల రాసినందుకు ఇతని కింత పలుకుబడా?" అనుకున్నది జానకి. సరిగా ఆ సమయాన్నే వెంకటేశ్వర్రావు "ఈ ముష్టివేషాలు వేసినందు కీమనిషి కింత బ్రహ్మరథమా?" అనుకుంటున్నాడు ఆమెను గురించి.

ఎవరో వచ్చి కవిగారినీ, తారనూ పరస్పరం యెరుకపరిచారు. ఇద్దరూ ఒకరినొకరు పూర్వం ఎరగనట్టే నటించారు. ఇద్దరికీ ఒకటే ఆలోచన—ఒకటే భయం కలిగింది। "ఇకముందు—అంటే ఈ కొత్తగా అయిన పరిచయం ముదిరిన కొద్దీ—ఒకరితో ఒకరు ఎట్లా ప్రవర్తించాలి?" అతిశ్రద్ధతో ఒకరినొకరు తప్పించుకు తిరగసాగారు—జానకీ వెంకటేశ్వర్రావులు. సామాన్యంగా సినిమా లైనులో స్త్రీపురుషులు మాట్లాడుకునేటంత స్వేచ్ఛగాకూడా ఇద్దరూ మాట్లాడుకోవటం లేదు.

వెంకటేశ్వర్రావు తన నవలను నాటకంగా మార్చటంలో నిమగ్నుడై వున్నాడు. (ఈ నాటకం స్టేజికి పనికి రాకుండా రాస్తే సినారియో అనిపించుకుంటుంది.) ముందుముందు రిహార్సల్సు నడిపే బాధ్యతకూడా అతనిమీదే వుంది.

అప్పుడప్పుడూ వెంకటేశ్వర్రావుకు లేనిపోని ఆలోచనలు వస్తూవుండేవి; తను ప్రయత్నంచేస్తే ఈ జానకిని మళ్లీ తన ప్రియురాలుగా మార్చవచ్చునేమో। జానకిని తప్పించుకు తిరగటంమూలాన జానకిని గురించిన ఆలోచన మరింత జాస్తి అయినట్టు కనపడేది. మధ్యమధ్య వెర్రిసంతోషం కలిగేది—జానకి తన కథకు కథానాయికగా నటిస్తున్నదని. ఆవిడ గొప్పతార అనికాదు సుమండీ—అతని వెనుకటి ప్రియురాలు కనక. మనలోమాట—అసలు ఆ నవలలోవున్న నాయికానాయకులు జానకీ వెంకటేశ్వర్రావులే। అనగా, క్రియకు జానకి వేస్తున్నది తనవేషమే।

ఈ విధంగా తన మనస్సు మెత్తబడే చిహ్నాలు కనిపించినప్పుడల్లా వెంకటేశ్వర్రావు "జానకి తను గొప్పతార అయినందుకు పట్టరాని అతిశయంతో విర్రవీగుతూ వుంటుంది।" అని నిశ్చయం తెచ్చిపెట్టుకునేవాడు.

జానకి మనస్సుకూడా అప్పుడప్పుడూ మెత్తబడేది. ఒక్కసారి అతను ఒంటరిగా చిక్కితే। కసికొద్దీ అతని రెండు బుగ్గలూ కొరికి అయినాసరే అతన్ని వెనకటి వెంకటేశ్వర్రావును చెయ్యటానికి వీలవుతుందేమో।

"అయినా అతను పెద్దవాడై కూర్చున్నాడు. అందరితోనూ దబాయించి మాట్లాడతాడు. 'నా కిది ఇట్లా ఉండాలి. అది అట్లా వుండటానికి వీల్లేదు" అంటాడు. తనకే సాహసంలేదు అట్లా మాట్లాడేటందుకు. అతనికి తప్పకుండా

వల్లమాలిన అతిశయం ఎక్కుఉంటుంది!'' అనుకునేది జానకి.

వెంకటేశ్వర్రావు తనతోకంటె ఇతర ఆడవాళ్ళతో ఎక్కువ ఆప్యాయంగా మాట్లాడటం గమనించి జానకి అందులో నటన ఎంత వుందో కనిపెట్టడానికి ప్రయత్నించేది. ఆవిడ తనతోకంటె ఇతర పురుషులతో మాట్లాడేటప్పుడు చాలా ఉల్లాసంగా వుండటం చూసి అసూయ పడకుండా వుండాలని వెంకటేశ్వర్రావు విశ్వప్రయత్నం చేసేవాడు.

రిహార్సలుసు ప్రారంభమైనై. జానకిని బాగా తోమవలసి వస్తుందని ముందుగానే నిర్ణయించుకున్నాడు వెంకటేశ్వర్రావు. దానికి రెండు కారణాలు: మొదటి సంగతి—జానకికి నటించటం రాదు. ఆ తరవాత—ఆమె ఇప్పటి స్థితిలో తన వెనకటి ప్రకృతిని చిత్రించనూ లేదు. తను క్రూరంగా ఆమెచేత ఒక్కొక్క వాక్యమే వంద వందసార్లు అనిపించినట్టూ, ఆమె అనలేక పోయినట్టూ ఊహించుకున్నాడు. ఆదృశ్యం ఊహించుకుంటేనే అతని హృదయం కరిగిపోయింది "జానకీ, జానకీ! నీపాత్రను నువే నటించలేనంతగా మారిపోయినావా?" అని తనలో తనే అనుకున్నాడు. అట్లా అనుకున్న తర్వాత కళ్ళవెంట నీరుకూడా కారింది. అట్లాగే నిద్రపోయినా డతను.

అయితే జానకి రిహార్సలు ప్రారంభించే టప్పటికి వెంకటేశ్వరరావు ఊహలన్నీ తారుమారయినై. ఆవిడ తను మొదటి స్పీచ్ చెప్పి ఆపిన పావు నిమిషంవరకూ ఎవరూ నోరు కదల్చలేదు. ఆ నిశ్శబ్దంలో ఎవరో గౌరవపూరితమైన స్వరంతో, చిన్న గొంతుతో "బ్యూటిపుల్!" అన్నారు. అటుమీదట "అది బాగా లేదు. ఇంకో విధంగా అను!" అనటానికి వెంకటేశ్వర్రావుకు గుండె లేకపోయింది.

ఆనాటి రిహార్సలు ఆఖరువరకూ అట్లాగే నడిచింది. జానకి చెప్పవదానికి చమ్పలేదు. ఆమె ఉచ్చారణను సంస్కరింతా మనుకున్నా, ఎట్లాసంస్కరించాలో వెంకటేశ్వర్రావుకి తెలియలేదు. రిహార్సలు పూర్తి అయి నటీనటులంతా అవతలికి వెళ్ళినతరవాత ఎవరో అన్నారు; "తెలుగు దేశంలో పుట్టి పైకి రాలేకుండా వుంది కాని నిజంగా జానకి ఎటువంటిఆర్టిస్టు!"

వెంకటేశ్వర్రావు కీమాట చెవిన పడగానే కారం రాచినట్టయింది.

"ఆవేశం ఎవరైనా బాగానే చెయ్యవచ్చును. నేను ప్రత్యేకించి ఆపాత్రను అంత సహజంగా పోషించాను. ఇంకా ఆ రెండో నాయిక పాత్ర నటించడం కష్టం!" అన్నా డతను.

"హేమలత ఆ వేషాన్ని తగలేసేటట్టే ఉంది!" అన్నారు మరొకరు. ఈ ముక్కకూడా వేంకటేశ్వర్రావుకు బాధ కలిగించింది. అతను ఇని రోజులనించీ తన ఆదరాన్ని ఈ హేమలత మీదనే

అవకాశం వుంటుంది. జానకికి మంచి పబ్లిసిటీకూడా అవుతుంది. ఈ ఏర్పాటు అందరికీ నచ్చింది. జానకికికూడా నచ్చింది—కొత్త కాంట్రాక్టు రాసిన మీదట.

కాని ఇంతటితోనైనా కష్టాలు గట్టెక్క లేదు. ఈసారి శ్రమయివ్వటం మొదలు పెట్టినవాడు హీరో—చెవిపోటు తగ్గగానే తలనొప్పి బయటపడ్డట్లు ఇదివరకల్లా హీరోను గమనించినవా రెవరూ లేరు. హీరోయిన్ బెడద తీరిపోగానే హీరో బెడద పట్టుకున్నది.

జరిగిన మార్పులకే నొచ్చుకుంటున్న ప్రొడ్యూసర్లు హీరోను మార్చటానికి సాహసించలేక అసంతృప్తిగా ఆ హీరో తోనే పని ప్రారంభించారు. నాలుగు రోజుల షూటింగు జరిగింది. రషెస్‌వేసి చూసుకున్నారు.

"మీ టాకీ పాడయితే హీరో మూలం గానే పాడు కావాలి!" అన్నాడు వెంక టేశ్వర్రావు.

"వావొచ్చిపడ్డది. ఏమిటీ దారి?" అనుకున్నారు ప్రొడ్యూసర్లు, వాళ్ళలో వాళ్ళు.

"నేను వేసినా ఈ వేషం ఇంతకంటె బాగుండును!" అన్నాడు వెంకటేశ్వ ర్రావు.

వెంకటేశ్వర్రావుగారే హీరో వెయ్యా లన్నారు ప్రొడ్యూసర్లు.

"నేను మాటవరస కన్నాను!" అని అతను గోలెత్తినా వాళ్లు వినిపించుకో లేదు. వెంకటేశ్వర్రావు బలవంతాన ఆమోదించాడు. కాని ఆమోదించినందు కతనికి పశ్చాత్తాపం అణుమాత్రమైనా కలగలేదు.

"జానకిపక్కన వేషం వెయ్యటానికి నేను ఆత్రపడుతున్నానా?" అని అతను తన్ను తాను ప్రశ్నించుకుని అటువంటి దేమీ లేదని నిశ్చయించుకున్నాడు.

ఈ కొత్త మార్పుతో రిహార్సల్సు మొదలుపెట్టారు. ముందు జానకి వేస్తున్న రెండో నాయిక తాలూకు దృశ్యాలు రిహార్సు చేశారు. బాగానే నడిచినై. అవి షూట్‌చేసి చూసుకున్నారు. తృప్తికరం గానే వుంది.

కాని ప్రణయఘట్టం రిహార్సల్సు వచ్చే టప్పటికి జానకి చిత్రంగా ప్రవర్తించటం మొదలుపెట్టింది. ముక్కలు చెబుతుంటే ఆమె గొంతు అర్చుకుపోతున్నట్టయింది. ఉచ్చారణ చెడిపోయింది. మొహాన భావం సరిగా లేదు. అదృష్టవశాత్తూ జానకిని గమనించటంలో పడి వెంకటేశ్వర్రావుకు రిహార్సలు సమయంలో ముచ్చెమటలు పోసిన సంగతి ఎవరూ చూడలేదు.

"బుద్ధితక్కువై తీసుకున్నాను యీ వేషం!" అనుకున్నాడు వెంకటేశ్వ ర్రావు—తన గదిలో దీపమైనా వెలిగించ కుండా కూర్చుని.

జానకి తలుపు తెరచి లోపలికి తొంగి చూసి "వెంకటేశ్వర్రావుగారూ!" అని

అవకాశం వుంటుంది. జానకికి మంచి పబ్లిసిటీకూడా అవుతుంది. ఈ ఏర్పాటు అందరికీ నచ్చింది. జానకికికూడా నచ్చింది—కొత్త కాంట్రాక్టు రాసిన మీదట.

కాని ఇంతటితోనైనా కష్టాలు గట్టెక్క లేదు. ఈసారి శ్రమయివ్వటం మొదలు పెట్టినవాడు హీరో—చెవిపోటు తగ్గగానే తలనొప్పి బయటపడ్డట్టు ఇదివరకల్లా హీరోను గమనించినవా రెవరూ లేరు. హీరోయిన్ బెడద తీరిపోగానే హీరో బెడద పట్టుకున్నది.

జరిగిన మార్పులకే నొచ్చుకుంటున్న ప్రొడ్యూసర్లు హీరోను మార్చటానికి సాహసించలేక అసంతృప్తిగా ఆ హీరో తోనే పని ప్రారంభించారు. నాలుగు రోజుల షూటింగు జరిగింది. రషెస్‌వేసి చూసుకున్నారు.

"మీ టాకీ పాడయితే హీరో మూలం గానే పాడు కావాలి!" అన్నాడు వెంక టేశ్వర్రావు.

"వావొచ్చిపడ్డది. ఏమిటీ దారి?" అనుకున్నారు ప్రొడ్యూసర్లు, వాళ్ళలో వాళ్ళు.

"నేను వేసినా ఈ వేషం ఇంతకంటె బాగుండదు!" అన్నాడు వెంకటేశ్వ ర్రావు.

వెంకటేశ్వర్రావుగారే హీరో వెయ్యా లన్నారు ప్రొడ్యూసర్లు.

"నేను మాటవరస కన్నాను!" అని అతను గోలెత్తినా వాళ్ళు వినిపించుకో లేదు. వెంకటేశ్వర్రావు బలవంతాన ఆమోదించాడు. కాని ఆమోదించినందు కతనికి పశ్చాత్తాపం అణుమాత్రమైనా కలగలేదు.

"జానకిపక్కన వేషం వెయ్యటానికి నేను ఆత్రపడుతున్నానా?" అని అతను తన్ను తాను ప్రశ్నించుకుని అటువంటి దేమీ లేదని నిశ్చయించుకున్నాడు.

ఈ కొత్త మార్పుతో రిహార్సల్సు మొదలుపెట్టారు. ముందు జానకి వేస్తున్న రెండో నాయిక తాలూకు దృశ్యాలు రిహార్సు చేశారు. బాగానే నడిచినై. అవి షూట్‌చేసి చూసుకున్నారు. తృప్తికరం గానే వుంది.

కాని ప్రణయఘట్టం రిహార్సల్సు వచ్చే టప్పటికి జానకి చిత్రంగా ప్రవర్తించటం మొదలుపెట్టింది. ముక్కలు చెబుతుంటే ఆమె గొంతు ఆర్చుకుపోతున్నట్టయింది. ఉచ్చారణ చెడిపోయింది. మొహాన భావం సరిగా లేదు. అదృష్టవశాత్తూ జానకిని గమనించటంలో పడి వెంకటేశ్వర్రావుకు రిహార్సలు సమయంలో ముచ్చెమటలు పోసిన సంగతి ఎవరూ చూడలేదు.

"బుద్ధితక్కువై తీసుకున్నాను యీ వేషం!" అనుకున్నాడు వెంకటేశ్వ ర్రావు—తన గదిలో దీపమైనా వెలిగించ కుండా కూర్చుని.

జానకి తలుపు తెరచి లోపలికి తొంగి చూసి "వెంకటేశ్వర్రావుగారూ!" అని






వ్యర్థపరుస్తూ వస్తున్నాడు.

ఒకవారం గడిచేటప్పటికి హేమలత వల్ల రెండో కథానాయిక పాత్ర నెగ్గదని నౌకర్లకు కూడా రూఢి అయిపోయింది.

"కవిగారూ, మీరు కాస్త సినారియాలో మార్పు చెయ్యండి. రెండో నాయికను మొదటి నాయికగా చేసి, ఆ వేషం జానకి కిద్దాం!" అన్నారు ప్రొడ్యూసర్లు.

"జానకి మాత్రం ఆ వేషం చెయ్యగలుగుతుందా?" అన్నాడు వెంకటేశ్వర్రావు.

"అయ్యయ్యో! అట్లా అనకండి. జానకి చెయ్యలేని వేషంలేదు!"

ఒక రోజల్లా కూర్చుని వెంకటేశ్వర్రావు ఒక వేషం వుంచి మరో వేషం తగ్గించాడు. జానకీ హేమలతా పాత్రలు మార్చుకున్నారు. హోదాలు మాత్రం యథాప్రకారమే - జానకి మొదటినాయిక.

క్రొత్తపద్ధతిన రిహార్సలు ప్రారంభించారు. జానకి ఈ కొత్తపాత్ర తాలూకు ముక్కలు మహా ముచ్చటగా అనసాగింది. ఇతర నటులు ఆమె నీసారి వెనకటికన్నా కూడా అభినందించసాగారు. మూలిగే నక్కమీద తాటిపండు పడ్డట్టు ఈ రిహార్సలులో హేమలత తన ముక్కలు మళ్ళీ జగచెయ్య సాగింది. వెంకటేశ్వర్రావు గొడ్డలి దెబ్బ తిన్నట్టు కుంగిపోయినాడు.

తన సహజమైన పాత్ర హేమలత వాత పడి ఇట్లా చట్టుబండలయింది!

జానకిమీద అతనికి అప్రయత్నంగా గౌరవం పుట్టుకురాసాగింది.

ఆమె నటించిన చిత్రాలు బాగుండక పోవటానికి కారణం పూర్తిగా జానకి కాదేమో. నిజానికి టాకీల్లో నటించడం కంటె ముఖ్యమైనవి లక్షాతొంభై ఉన్నై. తను నిజానికి తొందరపడి విమర్శించా డేమో!....ఏమయినా జానకికి అతిశయం ఉన్నమాట నిజం. ఈ జానకి తన జానకి కానిమాట నిజం!

వెంకటేశ్వర్రా విట్లా భావించటానికి ఒకటే సమర్థింపు - జానకి మారకపోతే తనని చూడగానే తన చేతుల్లోకి ఎందుకు ఉరకలేదూ? ఈ జానకి పదేళ్ళక్రితం ఇన్ని రోజులు తనకు సమీపంగా ఉండి కూడా యేమీ చెయ్యకుండా నిగ్రహించుకో గలిగేదేనా?

జానకికి కూడా వెంకటేశ్వర్రావు మీద నానాటికీ గురి కుదురుతున్నది. వెనక నవల చదివినప్పు డనిపించలేదు కాని అతను రాసిన సంభాషణల్లో పాత్రయొక్క ప్రకృతి ఎంత చక్కగా ఇమిడి ఉంది! ఒక్క రోజులో రెండు పాత్రలనూ ఎంత చక్కగా కిందు మీదు చేసేశాడు? ఏ మాత్రమైనా పట్టిస్తున్నదా!... ఏమైనా అత నిప్పుడు తన వెంకటేశ్వర్రావు కాడు. ఇత నిప్పుడు పెద్దవాడై నాడు. వాళ్ళంతా అతని చుట్టూ ఎట్లా మూగుతారు! ఆ సినారియో చూసుకుని ఏమి మురుస్తున్నారు! కనకనే అత నిట్లా మారిపోయినాడు. లేక పోతే ఇన్ని రోజులు తనని ఇంత నిర్లక్ష్యంగా చూడగలుగుతాడా? వెనకటి మాదిరిగా ఇప్పు డితన్ని దూరాన ఉంచి బాధించి, అట్లా చేసినందుకు వడ్డీకింద మరింత గాఢంగా అతన్ని రొమ్ము కదుముకోవటం తన కిప్పుడు సాధ్యమవుతుందా?

మరొకవారం గడిచింది. హేమలత ఈ పాత్రకూడా నిర్వహించలేదని తేలిపోయింది.

'ఏమండీ, కవిగారూ! ఆ వేషం మరి కొంచెం తగ్గించి చూడండి!'' అన్నారు ప్రొడ్యూసర్లు.

వెంకటేశ్వర్రావు తోక తొక్కిన తాచల్లే లేచాడు. ఇది దౌర్జన్యమన్నాడు. ఇప్పటికే తన కథ చాలా భాగం తగలబడి పోయిందన్నాడు.

''ఎక్కడైనా పాత్రలకోసం మనుష్యుల్ని మార్చుకుంటారు కాని మనుష్యులకోసం చక్కని కథను తగలేసుకోరు. ఇట్లా కథను ధ్వంసం చెయ్యదలిస్తే నా కింత డబ్బిచ్చి ఇంత శ్రమ పడటం దేనికి?'' అన్నాడు వెంకటేశ్వర్రావు.

ఈ ముడి విప్పటానికి ఒకటే ఉపాయం తోచింది అంతమందికీ కలిసి—అదేమిటంటే, మొదటి సినారియో ప్రకారమే టాకీతీస్తూ రెండువేషాలూ జానకికే ఇవ్వటం. కొంత ట్రిక్ ఫోటోగ్రఫీకి




చెప్పింది—తన పక్కన సరిగా నటించటం తనకు సాధ్యం కాదని! తనను వెనకటి మాదిరిగా ప్రేమించకపోతే మానె, తనమీద అంత పగపట్టాలా? ఆమె మీద కోపం తెచ్చుకోటానికైనా తనలో త్రాణ లేకపోవటం కనిపెట్టి అతను ఆశ్చర్యపడ్డాడు. తన మనస్సుకు పక్షవాతం వచ్చినట్టయింది.

అతను ఇంచుమించు కంపిస్తున్న గొంతుతో, "నామీద నిజంగా నీ కంత అసహ్యమా? కొంత ఉంటుందని నేనూహించాను కాని" — ఇంతకు పైన మాట్లాడలేక పోయినాడు. పరధ్యానంగా ఇసకలో సున్నాలు చుట్టి చెరిపేస్తున్న జానకి చటుక్కున తలయెత్తి, అతనికేసి ఆశ్చర్యంతో చూసింది. ఆ ఆశ్చర్యం అరక్షణంలో కోపంగానూ, మరుక్షణమే ఆవేదనగానూ మారింది.

"అసహ్యమా? నాకు మిమ్మల్ని చూస్తే అసహ్యమా? మగవాళ్ళేం మాట్లాడితే చెల్లదు? మీ మనస్సులో నన్ను చూస్తే అసహ్యం కనక నేను కూడా అంతే ననుకుంటారు. మీ కెదురుగా నిలబడి ఆమాట లనాలిపి వచ్చేటప్పటికి నా కడుపులోనించి చెప్పరాని యేడుపు పుట్టుకొస్తున్నది. నేనేం చేసేది? ఎప్పుడెప్పుడో జరిగినవన్నీ తలపుకొస్తున్నై.... అదంతా దేనికిలెండి! నేనీ వేషం వెయ్యను. మీరే వాళ్ళతో చెప్పి కాస్త పుణ్యం కట్టుకోండి—ఇంకేమీ చెయ్యకపోతే చెయ్యకపోయినారు." అన్నది జానకి.

మగవాడు అంత మాటపడి ఊరుకోగలడా? వెంకటేశ్వర్రావు తను ఏమి చెయ్యటానికైనా సిద్ధమేనని రుజువు చెయ్యటానికిగాను జానకిని దగ్గిరికి తీసుకొని ఆమె మొహంమీది రంగును తనివితీరా ముద్దుపెట్టుకున్నాడు.

"ఊరుకోండి, ఎవరన్నా చూస్తారు!" అన్నది జానకి—కేవలమూ అతనికి ప్రోత్సాహమిచ్చే సదుద్దేశంతో మాత్రమే,




వర్షం జోరుగా కురుస్తోంది. సాయంత్రం అయిదు గంటలు దాటింది. ఆఫీసు నుంచి ఇంటికి అని బయలుదేరిన భాస్కరం బస్సుస్టాపు చేరేలోపల విపరీతమైన వర్షం మొదలుపెట్టింది. గబగబా పరుగెత్తుకుంటూ వెళ్లి ఎదురుగావున్న హోటల్ వరండాలోకి దూరాడు.

చూస్తూ ఉండగానే వర్షం చాలా పెద్దదైపోయింది. అంత వర్షంలోనూ తను ఎక్కవలసిన పదమూడవ నంబరు సిటీ బస్సు రానూ వచ్చింది, అంత వేగంగానూ వెళ్లిపోయింది. బహుశ ఎక్కేవాళ్లు లేరనో, లేకపోతే ఈ వర్షంలో వచ్చి యెవరూ యెక్కరనో!.....పోనీ,... తను ఉన్నాడుగా బస్సు ఎక్కటానికి.

తనవన్నీ పిచ్చి ఆలోచనలు! తన కోసం బస్సు ఆగుతుందా? తనేమన్నా అంతటి గొప్పవాడా? కనీసం ఒక రాజకీయ నాయకుడన్నా కాదే!....అయినా, రాజకీయ నాయకులకి ఈ బస్సులు ఎక్కే ఖర్మ వాళ్ళకేం పట్టింది. వాళ్లకి విమానాలు, స్పెషల్ రైళ్లు, ఎంబాసిడర్ కార్లూ వగైరాలన్నీ వాళ్ళ సొంతమే అయినప్పుడు.

“ఏమైతేనేం! తను ఎక్కే బస్సు వెళ్ళిపోయింది. మళ్లీ బస్సు ఎప్పటికి వస్తుందో! “వెధవ వర్షం ఇప్పుడే రావాలి.” తిట్టుకుంటూ అక్కడే నిలబడ్డాడు భాస్కరం.

“కడుపులో ఆకలివేస్తోంది అందులో తను నిలబడ్డది హోటల్ వరండాలో. హోటల్‌లో చేసిన వంటకాలన్నీ వంచి వాసన వస్తున్నాయి ఆ వాసనకి భాస్కరం ఆకలి ఇంకా యెక్కువైంది.

“అయినా, తనకి బస్సు అంది, గదికి పోయి, హోటల్‌కి తిండికి వెళ్ళేటప్పటికి ఏ తొమ్మిదో అవుతుంది. అప్పటిదాకా యీ ఆకలి భరించటం తనవల్ల కాదు.” అనిపించింది భాస్కరానికి.

హోటల్ లోపలికి వచ్చికూర్చున్నాడు భాస్కరం. బయట అంత వర్షం కురుస్తున్నా, హోటల్‌లో జనం బాగానే ఉన్నారు.

కూర్చున్న తరువాత, ఒక అయిదు నిముషాలకు సర్వర్ వచ్చాడు భాస్కరం

దగ్గరకి.

"ఏం కావాలి సార్?" సర్వర్ అడిగాడు.

"ఏం ఉన్నాయి వేడిగా?" భాస్కరం అడిగాడు.

"ఇడ్లీ, ఉప్మా, మసాలా దోసే, పూరీ...." ఇంకా ఏవో చెప్పాడు సర్వర్.

కావాల్సినవి చెప్పి, చుట్టుపక్కల చూస్తూ కూర్చున్నాడు భాస్కరం.

టేబుల్సు శుభ్రం చేసేవాళ్లు, వచ్చిన వాళ్ళకి సర్వు చేసేవాళ్లూ, టిఫిన్లు తింటూ కబుర్లు చెప్పుకునేవాళ్లు, హోటల్లో ఆ గది సందడిగా ఉంది.

బయట ఇంకా వర్షం కురుస్తూనే వుంది. సర్వర్ తెచ్చిన టిఫిన్ తిని, బిల్లు ఇచ్చి, ఒక ఇరవై పైసలు టిప్పుకి వది లేసి నెమ్మదిగా బయటికి వచ్చాడు.

బయట వరండాలో నిలబడ్డాడు భాస్కరం. బస్సు ఇంకా రాలేదు. పోనీ, ఆటోరిక్షాలో వెళ్దాం అన్నా, అదీ లేదు. కనీసం రిక్షాకూడా లేదు ఆ చుట్టు ప్రక్కల.

జేబులోంచి సిగరెట్టుపెట్టె తీసుకుని, సిగరెట్టు వెలిగించుకుని, ఆలోచిస్తూ నిలబడ్డాడు ఆలోచనలలో ఇందాక, తను తిన్న టిఫిన్ గుర్తుకు వచ్చింది. టిఫిన్ రుచిగా బాగానే ఉంది. కడుపు నిండింది. ఇంక రాత్రికి భోజనంకూడా అక్కర లేదు అనిపించింది భాస్కరానికి.

"అయితే...., తను చాలా తిన్నాడు. మరి, అరవై రెండు పైసలే బిల్లు వేశా డేమిటి?! ఆశ్చర్యం వేసింది, భాస్కరానికి. తను చాలా తిన్నాడుగా....తిన్న వన్నీ గుర్తుచేసుకుని, లెక్క చూసు కుంటే, ఒకరూపాయి తనే వాళ్ళకి ఇవ్వాల్సి వచ్చాడు. మరి....ఇదేమిటి?! అరవై రెండు పైసలే బిల్లులో వేయిం చాడు సర్వర్:...." ఆలోచించుకుంటూ ఉంటే ఇంకా ఆశ్చర్యం వేసింది భాస్కరానికి.

సర్వర్ పొరపాటున తక్కువవేశాడు. తనూ అప్పుడు చూసుకోలేదు. ఒక్క రూపాయి తేడా వచ్చింది. తనే ఒక రూపాయి హోటల్‌వాళ్ళకి ఇవ్వవలసి వచ్చాడు.

"ఎలా....?" కాసేపు ఆలోచించాడు.

"పోనిద్దూ" అని ఫస్ట్లీ అనుకుని కాసేపు ఊరుకున్నాడు, భాస్కరం.

కానీ...., అతని మనసు ఎందుకో అలా ఊరుకోవటానికి సమాధానపడ లేదు. అతనికున్న కనీసపు మానవత్వం భాస్కరాన్ని ఊరుకోనివ్వలేదు.

"పొరపాటున సర్వర్ తక్కువ బిల్లు వేశాడు. కానీ....తెలిసికూడా తను ఊరు కోవటంలో అర్థం ఏముంది?

.. వాళ్లే తనకి రూపాయి ఇవ్వవలసి వస్తే, తను ఊరుకునేవాడా?....వెంటనే వెళ్లి తెచ్చుకునేవాడు. మరి అటువంటిది, అన్యాయంగా ఆ రూపాయి తను ఉంచు కుంటే, తనకి ఏం జరుగుతుంది?

తను ఏదో ప్రిన్సిపుల్డ్‌గా బ్రతకాలని, ఆనెస్టీగా ఉండాలని తన కోరిక, తన జీవితలక్ష్యంకూడా. వాటిని ధ్యేయంగా పెట్టుకుని తను జీవితం గడపాలని అనుకున్నాడు.

అటువంటిది, మరి ఈ చిన్న విషయంలో అశ్రద్ధచేస్తే....

తను ఎవరో ఆ సర్వర్‌కి, హోటల్ మానేజర్‌కికూడా తెలియదు. ఈ రోజున తను ఆ రూపాయి ఎగవేసినా, తనని అడిగేవాళ్లు లేరు. ఎందుకంటే, వాళ్లు ఎవరికి తక్కువ బిల్లు వేశారో....అంత మందిలో ఎవరని వాళ్ళకి తెలుస్తుంది?

"అవునూ, కాదూ" అనే ఆలోచనలలో సతమతమైన భాస్కరానికి, అన్యాయం చెయ్యటానికి అతని మనసు సరిపుచ్చుకో బుద్ధికాలేదు.

తను అన్యాయంగా బ్రతకలేదు. తనకి చేతనైనంతవరకూ, యెదుటివారికి హాని కలిగించనంతవరకూ తన లక్ష్యాన్ని వదులుకోలేదు.

వాళ్ళ డబ్బు వాళ్ళకి ఇచ్చివేస్తే తన మనసుకి శాంతి ఉంటుంది అనిపించింది భాస్కరానికి.

* *

వెళ్లి కౌంటర్ దగ్గర నిలబడ్డాడు భాస్కరం అయిదు నిముషాలు. తనకు సర్వ్‌చేసిన సర్వర్ కనిపించలేదు. అక్కడ కూర్చునివున్న మానేజర్‌తో అన్నాడు. "ఇందాక, మీరు ఇచ్చిన బిల్లులో ఒకరూపాయి తక్కువ వేశారు. తీసుకోండి" అని జేబులోంచి ఒక రూపాయి తీసి, అక్కడ బల్లమీద పెట్టాడు.

ఏమీ అర్ధం కానట్టుగా ఒక్కనిముషం భాస్కరం ముఖంవంక చూశాడు మానేజరు.

చిన్నగా నవ్వాడు భాస్కరం, అతని వాలకం చూసి, "ఇందాక, నేను వచ్చి టిఫిన్ తిన్నాను. ఆ బిల్లులో మీరు ఒక రూపాయి తక్కువ వేశారు. తీసుకోండి" మళ్లీ అన్నాడు.

ఆశ్చర్యంనుంచి నెమ్మదిగా తేరుకున్నాడు మానేజరు. "మీరు యెంత మంచివారండీ! మీ అంత సిన్సియర్‌గా యెవరుంటారండి యీ రోజుల్లో....దొరికిందే చాలు కదా అని తీసుకుపోతారు.

మా సర్వర్లకి మరీ పొగరెక్కువైంది. ఇలా రోజుకి యెంత డబ్బు పోతోందో. మీలాగా ఎవరు తిరిగి యిస్తారండీ." చాటంత ముఖం చేసుకుని మేనేజరు భాస్కరం ఇచ్చిన రూపాయి డ్రాయరులో వేసుకుంటూ వుండగా, భాస్కరానికి సర్వ్‌చేసిన సర్వర్ వచ్చాడు కౌంటర్ దగ్గరకి.

భాస్కరాన్ని చూసి చిరునవ్వు నవ్వాడు.

"ఏం సార్?" సర్వర్ పలకరించాడు భాస్కరాన్ని.

"ఏం లేదోయ్. ఇందాక నువ్వు బిల్లు




తప్పు వేశావు. ఒకరూపాయి తక్కువ వేశావు. నేను ఇక్కడే బస్సుకోసం నిల బడి ఆలోచించుకుంటే గుర్తువచ్చింది. ఆ రూపాయి ఇచ్చిపోదామని వచ్చాను'' అన్నాడు భాస్కరం సిగరెట్టు వెలిగించు కుంటూ.

"నిజంగానా సార్ ?!" ఆశ్చర్యం గానూ, కొద్దిగా భయంగానూ అడిగాడు సర్వర్.

"నిజమేనయ్యా' నవ్వాడు భాస్కరం చిన్నగా.

"నిజంగానా'' అని అడుగుతున్నావా? పైసాకి పనికిరానివాళ్ళకికూడా ఉద్యోగాలు కావాలి. పొట్ట పొడిస్తే అక్షరం ముక్క రాదు, ఒక లెక్కరాదు. రోజుకి ఎంత మందికి ఇట్లా చేస్తున్నావు? వారు మంచి వారు కాబట్టి తిరిగి ఇచ్చారు. అలా ఎంత మంది ఇస్తారు?'' సర్వర్ మీద తీవ్రంగా కేకలు వెయ్యటం మొదలుపెట్టాడు మానేజరు.

బిక్కముఖం వేసుకుని భయంగా నిలబడ్డాడు సర్వర్.

"పొరపాటైంది. క్షమించండి" భయంగా అన్నాడు.

"కోప్పడకండి అతన్ని పాపం. ఏదో పొరపాటు'' అని, భాస్కరం బయలుదేరి వచ్చాడు.

మరో పావుగంటకి బస్సు వచ్చింది. "అమ్మయ్య'' అనుకుంటూ బస్సులో ఎక్కి, తన గదికి చేరుకున్నాడు.

* *

హాయిగా అనిపించింది భాస్కరానికి.

జరిగింది తలుచుకునేటప్పటికి. మనసుకి తృప్తిగా అనిపించింది. "తను ఇవ్వాళ ఒక మంచి పనిచేశాడు. ఆనెస్టీని నిలబెట్టు కున్నాడు" అనుకున్నాడు.

"అసలు, మనిషికి, జంతువుకు తేడా మెదడు. అమూల్యమైన మనిషిజన్మ ఎత్తాక, మెదడు వున్నాక, మంచీ, చెడుని గురించి ఆలోచించ గలగాలి. తెలియక ఎన్నో పొరపాట్లు చేసినా, తెలిసినంత వరకూ, చెయ్యగలిగినంతవరకూ మంచిగా నీతిగా ప్రిన్సిపుల్డ్‌గా, ఆనెస్టీగా ఉండ గలిగితే ఎంత బాగుండు!

"ప్రతి మనిషీ అలా ఆలోచిస్తే ఎంత బాగుండు! కానీ....వాళ్ళు అలా ఆలో చించకనా! చాలామంది అనుకుంటారు. 'ఎవరు అడుగుతారులే' అనే ధీమా! కానీ, అవతలి మనిషి ఎంత బాధ పడ తాడో, వాళ్ళు ఎంత నష్టపోరారో అని అనుకోరు. ఒకవేళ అనుకున్నా, శ్రద్ధ చూపరు కొంతమంది.

తను ఈ రోజున ఒక మంచి పని చేశాడు. లేకపోతే ఒకరూపాయి నష్ట పోయేవాడు ఆ మేనేజరు. అలాంటి అన్యాయపు డబ్బు ఉంచుకుంటే, తనకి ఏం జరుగుతుంది?

ఇలాగే, తను జీవితాంతం ఎవరినీ బాధపెట్టకుండా, మంచిగా, ప్రిన్సిపుల్‌గా బ్రతికితే అంతే చాలు, ప్రిన్సిపుల్స్, ఆనెస్టీ తన జీవితానికి ఊపిరి, ప్రాణం. ఆ రెండూ లేకపోతే, తను బ్రతక లేడు"....ఏవో ఆలోచించుకుంటూ నిద్రకి ఒరిగిపోయాడు భాస్కరం.

* *

నెలరోజులు గడిచిపోయినాయి.

ఆరోజు సాయంత్రం ఆఫీసునుంచి బయటపడి బస్సుస్టాపుదగ్గర నిలబడ్డాడు భాస్కరం.

బస్సు ఇంకా రాలేదు సిగరెట్టు వెలి గించుకుందామని జేబులో చెయ్యిపెట్టి చూసుకుంటే సిగరెట్టు లేదు.

పక్కనేవున్న కిల్లీకొట్టుకి వెళ్ళాడు సిగరెట్టుకోసం, కొట్టుదగ్గర ఒకమనిషి నిలబడివున్నాడు. ఒక్క నిముషం అతని వంక ఎగాదిగా చూశాడు. అతన్ని ఎక్కడో చూసినట్టుగా అనిపించింది. చిరిగిపోయిన చొక్కా, పెరిగిన గడ్డం, తైలసంస్కారం లేని జుట్టు, అన్నిటి కంటే....నీరసంగా, రెండు రోజుల క్రితం ఎప్పుడో అన్నం తిన్నట్టుగా పీక్కుపోయిన ముఖం. "ఎక్కడ చూశానా?" అని ఆలోచించుకుంటూ ఉండగా,....

"ఏం సార్, అలా చూస్తున్నారు? గుర్తుపట్టలేదా?" అన్న అతని పలక రింపుతో తేరుకుని, చిరునవ్వు నవ్వాడు భాస్కరం. "ఆ...., నువ్వు అజంతా హోటల్‌లో సర్వర్‌వి కదూ!"

"అవును సార్, నేనే" నవ్వాడు అతను.

"అవునూ...., మరి ఏమిటి యీ

వేషం?! ఇక్కడ ఎందుకు ఉన్నావు? అక్కడ పనిచెయ్యటం లేదా?'' అతని వాలకం చూసి, ఏమీ అర్థంకాక, ఆశ్చర్య పోతూ అడిగాడు భాస్కరం.

''లేదు సార్, ఇప్పుడు నేను అక్కడ పనిచెయ్యటం లేదు'' బాధగా అన్నాడు.

''ఎందుకని?''

''ఆరోజు మీకు తక్కువ బిల్లు వేశా నని, కేకలేసి, నన్ను పనిలోనుంచి తీసి వేశాడు మానేజరు.''

''ఇదేమిటి?....అయినా నేను ఇచ్చే శానుగా రూపాయి?''

''అదే సార్, మీరు ఇవ్వటమే వచ్చింది. మీరు ఆ రూపాయి యివ్వ కుండా ఉంటే, ఆ మేనేజరుకి తెలిసేదీ కాదు. నా ఉద్యోగం పోయేదీ కాదుసార్.

మీరు ఆ రూపాయి ఇచ్చి వెళ్ళి పోయిం తరువాత, నన్ను చాలా తిట్టాడు మేనేజరు. ''రోజుకి ఇలా యెంతమందికి ఇస్తున్నావో. ఎన్ని రూపాయలు పోతు న్నాయో, లేకపోతే తక్కువబిల్లు వేయించి నువ్వే తీసుకుంటున్నావో ఎవరికి తెలుసు? నువ్వు ఉంటే, ఇంకా మాకు దండగ. ఈరోజునుంచి పనిలో ఉండొద్దు వెళ్ళిపో'' అని పంపించివేశాడు మేనేజరు నేను యెంత బ్రతిమిలాడుకున్నా, పొరపా టైంది అని యెంత ప్రాధేయపడినా విని పించుకోలేదు సార్ ' దాదాపు కళ్ళవెంబడి నీళ్ళతో చెప్పాడు సర్వర్.

భాస్కరం దా దా పు మూగవాడై పోయాడు కాసేపు. కాస్త తేరుకుని ''అయితే ఇప్పుడు ఏం చేస్తున్నావు?'' అడిగాడు.

''ఏంలేదు సార్, ఎక్కడా పనిదొర కటం లేదు. రెండు రోజులనుంచి తిండి లేదు. నా భార్యా, ఒక కొడుకు, మా అమ్మ, మా చెల్లి అంతా పస్తులే, రెండు రోజులనుంచీ ' తల ఒంచుకుని బాధ పడుతూ అభిమానంగా చెప్పాడు.

''ఎంతపని జరిగింది? ...ఇలా జరుగు తుందని నేను ఊహించలేక పోయా నయ్యా.'' అతని పరిస్థితికి బాధపడుతూ అన్నాడు

''వస్తాను సార్. స్టేషన్‌కి పోతు న్నాను. రెండు రూపాయలు కూలీ ఏ దైనా దొరికితే! ఈ పూటైనా తిండి తింటాము'' అన్నాడు అతను.

''ఉండు ...ఇదిగో, ఈ రెండు రూపా యలు తీసుకో.' జేబులోనుంచి రెండు రూపాయలు తీసి ఇచ్చాడు భాస్కరం.

''ఎందుకు సార్?''

''ఎందుకేమిటి? ఈ పూట అన్నం తినండి.''

''వద్దుసార్, ఈ రెండు రూపాయ లతో ఈ పూట గడుస్తుంది. తరువాత....? ....కష్టపడాలి. అంతే ఊరికే వచ్చే సొమ్ము తీసుకోలేను సార్....క్షమించండి. మిమ్మల్ని కాదన్నందుకు. వస్తాను సార్'' వెళ్ళి పోయాడు అతను.

బాధ పడ్డాడు భాస్కరం.

"అవును తన లాగే అతనికి ప్రిన్స్ పుల్స్ ఉన్నాయి. కష్టపడి సంపాయించు కుంటే తప్ప, ఊరికే వచ్చే సొమ్ముని తీసుకోలేదు" అనిపించిది భాస్కరానికి.

"కాని .... ఈ రోజున దయతలచి అతనికి రెండు రూపాయలు ఇవ్వటం కంటే, అరోజున తను కాస్త ఆలోచించి, తను ఆరూపాయి ఆమేనేజరుకి ఇవ్వ కుండా వుంటే, ఆ సర్వర్ బ్రతుకు తెరువు ఈ రోజున ఇట్లా వుండేదికాదు. అతను ఈరోజున ఈ స్థితిలో వుండే వాడూ కాదు,

తన ప్రిన్స్‌పుల్స్ కోసం, తను తన ఆనెస్టీని నిలబెట్టుకోవటం కోసం, ఒక మనిషి బ్రతుకు తెరువును బలి తీసుకున్నాడు.

"తన మూలంగా అతను తిండి లేక బాధపడు తున్నాడు. ఒక విధంగా, తనే అతనికి తిండి లేకుండా చేశాడు.

"అలా అని....తను ఏమన్నా తప్పు పని చేశాడా? అంటే, తన ప్రిన్స్‌పుల్స్, తన ఆనెస్టీ, ఎదుటివారి జీవితాన్ని బలి కోరుతాయా,"

అంటే...., మనిషికి కనీసపు మంచి గుణాలు వున్నా, వాటి విలువ ఎంత వరకో....!?

"నిజానికి, తన ఆత్మతృప్తి కోసమే అయినా, ముక్కుకు సూటిగా ఒక మంచి పనిచేస్తే, అది ఇంకొకళ్ళ బ్రతుకు తెరువును నాశనం చేసింది." అంటే.... ఈ లోకంలో దేనికి విలువ?

మంచికా....?....చెడుకా....? అసలు ఇంతకీ ఏది మంచి?....ఏది చెడు? తన ఏం చేసి వుండాల్సింది? తను ఒక రూపాయి తక్కువ ఇచ్చినట్టు ఎవ్వరి తెలియకపోయినా, "ఇదిగో, నువ్వు ఈ తప్పుపని చేశావు అని ఎవరూ వేలెత్తి చూపించక పోయినప్పటికి, 'అరె, పొర పాటున చెల్లించవలసిన దానికంటే, తక్కువ డబ్బు చెల్లించానే' అని తెలుసు కున్నప్పుడు, తనకూ ఒక ఆత్మ అనేది వుంది కాబట్టి, తనకి తను 'తెలిసీ తప్పు చేయకూడదూ' అని అనుకుని, చెల్లించ వలసిన ఆరూపాయ చెల్లించి వేయటం తప్పా....?

"లేక పోతే, ఎవరు అడుగు తారులే అని మెదలకుండా వెళ్ళిపోవటం ఒప్పా ....? అలా డబ్బు చెల్లించకుండా వెళ్ళి పోయి ఉన్నట్లయితే, ఆసర్వరు ఉద్యోగం నిలిచేదేమో కానీ, తన ఆత్మను ఎట్లా తృప్తి పరచుకో గలగటం?

ఉన్నవే ఈ రెండు మార్గాలు. మరి ఇందు ఏది చేసి ఉండవలసింది?

తన ఆత్మ తృప్తికోసం చేసిన ఒక చిన్న మంచి పనివల్ల, ఊహించుకో లేనంతగా ఇంకొక వ్యక్తికి అపకారం జరిగిందీ అంటే మరి దేనికి విలువ?

ప్రిన్స్‌పుల్స్, ఆనెస్టీ, న్యాయంలాంటి మంచి సుగుణాలకా? లేకపోతే అవినీతి, అన్యాయం, దగా, లంచగొండి తనం.... వీటికా? మంచిగా బతకటానికి ఏదికావాలి?

ఆలోచనలలో నుంచి తేరుకునే టప్పటికి, భాస్కరం ఎక్కే బస్సు కాస్తా వెళ్ళిపోయింది!

---




"ఆమె ఈ బండికి వొస్తుందని నీకెట్లా తెలిసింది?" అని శాస్త్రిని అడిగాను. అప్పుడు ఆరుగంట లవుతుంది. బొంబాయినుంచి రైలు వొచ్చే టైం. నేనూ, శాస్త్రి ప్లాటుఫారం మీద నుంచొని మాట్లాడుకుంటున్నాం.

"ఇవ్వాళే వైరిచ్చింది' అన్నాడు శాస్త్రి. ఆమె శాస్త్రి స్నేహితురాలట. ఆమె ఈ బండికి వొస్తుందని చెప్పి నన్ను వెమ్మట పెట్టుకొచ్చాడు శాస్త్రి.

శాస్త్రి ఆమెని గురించి చెప్పిన మాటల్నిబట్టి ఆమె విచిత్రవ్యక్తి అని పించింది నాకు. "బలే మనిషి బలే మనిషి" అంటాడు శాస్త్రి. ఏమడిగినా "నువ్వే చూస్తావుగా" అంటాడు. "ఏమోనబ్బా. నాకు చెప్పటం చాత గాకుండా వుంది మన సంఘంలో యిటు వంటి మనిషి ఉండదు. ఒచ్చే సంఘంలో ఆడవాళ్ళు యిట్లా వుంటారేమో! ఇప్పుడు రష్యాలో యేమన్నా వున్నారేమో!" అంటాడు.

"అయితే ఆమె భర్త యేం చేస్తుంటాడు?" అని అడిగాను. ఆమెని గురించి యింకా యింకా తెలుసుకోవాలనిపిస్తూ వుంది నాకు.

"ఏదో చేస్తూనే వుంటాడు లాగుంది. ఆమె మాట్లాడితే "కామేశ్వరుడు అటు వంటివాడు, ఇటువంటివాడు ఎంత చలాకీగా వుంటాడనుకున్నావ్" అని చెపుతూ వుంటుంది."

"భర్తంటే చాలా ప్రేమ కాబోలు."

"ఆమెకు మొత్తం నలుగురు పిల్లలు. వొక మొగపిల్లవాడూ ముగ్గురు ఆడ పిల్లలూ' అన్నాడు శాస్త్రి కొంటెగా.

నిజంగా ఆమెకు పిల్లలనేటప్పటికి నా మనస్సు కలుక్కుమంది. మిగిలిన ఆడ వాళ్ళకుమల్లే ఈ బలే మనిషికూ్కడా పిల్లలా? ఎందుకనోగాని ఈ భావాన్నే నేను భరించలేకపోయాను.

ఇంతలో "అదిగో రైలు ఒస్తూ వుంది." అన్నాడు శాస్త్రి. ఆ మాటకి నా హృదయము దడదడ కొట్టుకుంది.

అకస్మాత్తుగా ప్లాట్‌ఫారానికి చలనం కలిగింది. ఇద్దరు ప్రయాణీకులు ప్లాట్‌ఫారం అంచునుంచి సామాను సర్దుకొని దూరంగా నుంచున్నారు ఒక ముసలమ్మ మూటనొకచేత్తో, మనమణ్ణి ఒకచేత్తో పట్టుకొని నిలబడింది. ఒక రైతు నుంచున్న వాడు నుంచున్నటుగానే హడవిడి పడుతున్నాడు. కాసేపు కర్రని పటూ, పట్టని కర్రా అనుకున్నాను.

రైలు ఆగీ ఆగటంతోనే "మూడో తరగతి" అని జ్ఞాపకం చేశాడు [illegible] శాస్త్రి. ఆమె ఎప్పుడూ మూడో తరగతి

లోనే ప్రయాణం చేస్తుందిట. ఆమెకు ఒంటరితనం గిట్టదట. అందుకని జన సమ్మర్దంగావున్న మూడో తరగతి చూచి అందులో ప్రయాణం చేస్తుందిట. ఆమెకు ఎంత యిరుగ్గా వుంటే అంత సరదాగా వుంటుందట! నాకు ఆమెను వెతకాలని వుంది గాని కాళ్ళాడక అక్కడే దిక్కులు చూస్తూ నుంచున్నాను.

అది చిన్న స్టేషను. ఎక్కువమంది దిగరు.

"అదిగో దిగుతూవుంది" అని గార్డు పెట్టెవైపుకి చూపిస్తూ అన్నాడు లక్ష్మణ శాస్త్రి.

నేనూ చూశాను. నాకు కనబడలేదు!

"హల్లో"—యెదురుగా వొస్తున్న ఒక వ్యక్తితో కరస్పర్శచేస్తూ అన్నాడు లక్ష్మణశాస్త్రి. ఆ వ్యక్తి ఓవర్ కోటులో వుంది. చేతిలో తోలుసంచి వుంది

"మీరు రారనుకున్నాను" అంటు న్నాడు.

"అదేమిటి? ఎందుకు అలా అనుకోవటం?" అంటున్నది.

ఆ ఓవర్ కోటులోవున్న వ్యక్తి ఆమే అని అప్పుడు నాకు తెలిసింది. మామూలు స్త్రీ ఆకారంకోసం వెతుకుతున్న నా చూపులు ఓవర్ కోటులోవున్న ఆమెను పట్టుకోలేక పోయినయ్. నేను మళయాళంలో వున్నప్పుడు ఇటువంటి అవస్థ లోనే వుండేవాణ్ణి. గూడకట్టు కట్టుకొని తుండుగుడ్డ భుజాన వేసుకునే ఆ స్త్రీలు నా కంటికి ఎప్పుడూ పొరపాట్నయినా స్త్రీలుగా కనిపించే వాళ్లుకారు ఇప్పుడూ ఆ దుర్గతే పట్టింది.

లక్ష్మణశాస్త్రి అంటున్నాడు—"అపేక్ష వున్నచోటే భయం కూడా వుంటుంది. మీరు రావాలనే అపేక్షతోపాటు, మీరు రారనే భయం కూడా ఎక్కువైంది."

ఆమె నవ్వి, "కామేశ్వరుడూ ఇట్లాగే మాట్లాడుతాడు" అంది.

ఆమె భర్తపేరు ఎత్తేప్పటికి లక్ష్మణ శాస్త్రి కించపడి టాపిక్ మార్చటానికి ప్రయత్నించాడు. నన్ను పరిచయం చేస్తూ, "ఇతడు శరశ్చంద్రబాబు నాకు పరమ స్నేహితుడు. కథలు రాస్తూ వుంటాడు. సినిమాలతో సంబంధం వుంది....మంచి...."

ఆమె లక్ష్మణశాస్త్రి చేతిని వొదలకుండానే నన్ను ఎగాదిగా చూచి, "మీ కథలు కొన్ని చదివాను. మీ కథలే బాగుంటై" అంది ఆమె శాస్త్రి యింట్లో దిగింది!

ఆ రాత్రి నిద్రపట్టకపోవటంవల్ల తెల్లవారి కొంచెం ఆలస్యంగా లేచాను. త్వరగా కాలకృత్యాలు తీర్చుకొని ఆమెను చూట్టానికి లక్ష్మణశాస్త్రి ఇంటికి వెళ్దామా వొద్దా అని ఆలోచిస్తూ కూర్చున్నాను. ఇంతలోకి లక్ష్మణశాస్త్రి వొచ్చాడు. "ఒకసారి మా యింటికి రావోయ్. ఆమె పిలుచుకు రమ్మన్నది" అన్నాడు.

"ఎందుకు?" అని అడిగాను. లోపలకి వెళ్దామని వుంది. ఆమె పూరికేనే

పిలుస్తూ వుందని తెలుసు. అయినప్పటికీ అప్రయత్నంగా అలా అడిగేశాను.

లక్ష్మణశాస్త్రి నన్ను విచిత్రంగా చూచి, కాసేపు ఆగి, "సరేలే, రా" అన్నాడు నేను బయల్దేరాను.

మేము వెళ్ళేటప్పటికి లక్ష్మణశాస్త్రి స్నేహితులూ, వూళ్లో కుర్రవాళ్ళు కొంత మంది వున్నారు. ఆమె వాళ్ళ మధ్య కూర్చొని కబుర్లు చెబుతూవుంది. నన్ను చూచి, "ఏమండీ, పిలిస్తేగాని రావొద్దను కున్నారా?" అని నవ్వుతూ అడిగింది.

"మా వాడికి ఆడవాళ్ళనిచూస్తేసిగ్గు" అన్నాడు.

అంతా నవ్వారు, ఆమెమాత్రం చిన్న పుచ్చుకుంది. కారణం నాకు బోధపడలేదు గాని, ఎందుకోబాధపడుతున్నట్టు మాత్రం స్పష్టంగా కనిపించింది. అదైనా కాసేపే! మళ్ళీ యధాప్రకారం అందరితోనూ కులాసాగా కబుర్లు చెప్పటం మొదలు పెట్టింది. తన అనుభవాలు, కథలు కథ లుగా వర్ణించి చెప్పింది. చివరికి "మీకు నా కున్న అనుభవంలో పదోవంతు కూడా లేదు" అంది.

"నిజమే, 'అందరూ అంగీకరించారు. "కాబట్టి వయస్సు మాట ఎట్లావున్నా మీ అందరికీ నేను తల్లిని" అంది.

ఈ మాట మా మధ్య పిడుగుపడినట్లు పడింది. కొందరు సిగ్గుపడి తలవొంచు కున్నారు. కొందరు వెకిలినవ్వు నవ్వారు. కొందరు తెల్లబోయారు.

నాకు యింకొక లోకంలో ఉన్నట్లు వుంది. ఆమెమాత్రం వీటిని గమనించ నట్లు యధాప్రకారం మాట్లాడుతూనే వుంది. అందరినీ ఒకే మోస్తరుగా పలక రిస్తూ మాట్లాడింది. సెక్సునిగురించి ఆమె ఫ్రీగా మాట్లాడుతూవుంటే కుర్రవాళ్ళంతా కిక్కురుమనకుండా విన్నారు. అవునూ, కాదూ అంటానికూడా వాళ్ళకు ధైర్యం లేకపోయింది. ఊకొట్టటానికే వాళ్ళకు సిగ్గువేసింది, "నేను స్త్రీని; అనే భావం ఆమెకు వచ్చినా గుర్తుకురాలేదు. నాకు చాలా సంతోషం వేసింది. కాని "పూర్వం సంతానానికి స్త్రీ పురుష సంపర్కం అవ సరం లేనట్టు కనుపిస్తుంది. ఇప్పుడు అవసరం; కొన్ని సంవత్సరాలకు మళ్లీ అవసరం లేకుండా పోవొచ్చు" అని ఆమె చెపుతూవుంటే నా మనస్సుకూడా చివుక్కుమంది.

కొంచెంసేపు అయింతర్వాత మేము కాఫీహోటలుకి బయల్దేరాం. ఆమెకూడా మాతో వొచ్చింది. చూస్తే యెవ్వరు ఏమనుకుంటారో అని నాకు అమిత కంగారుగా వుంది, కాని ఆమెకు ఏమని చెప్పటం?

మేము దారినే వెళ్తుంటే జనం గుంపులు గుంపులు పడి విచిత్రంగా చూస్తూ హేళనచెయ్యటం నేను గమ నించాను. ఆమెనుగురించి ఒకటి రెండు మాటలు నా చెవిని పడినై. హోటలు నుంచి బయటపడి కొంపకి జేరదామని

అంతా త్వరగా కాఫీ ముగించారు. ఆమె మాత్రం తొందరపడలేదు.

"ఏదీ ఆ హల్వా యిట్లా ఉంచండి" అని సుబ్బారావు ప్లేట్లోవున్న హల్వాలో సగం తీసుకుంది. "ఈ బూంది కొంచెం తీసుకోండి" అని శాస్త్రి ప్లేటులోకి తన బూందిని చెంచాతో సగం నెట్టింది.

ఇక మిగతా టేబిల్సు చుట్టూవున్న జనం గుసగుసలు చెప్పాలి!

సాయంకాలం పార్కుకి వెళ్ళాం. అక్కడా యింతే. అక్కడివాళ్ళంతా మమ్మల్ని మ్యూజియంలో జంతువుల్ని చూచినట్టు చూట్టం మొదలుపెట్టారు. ఏం జరుగుతున్నా ఆమెలోమాత్రం యేమీ మార్పు కనపట్టంలేదు. కాని నేను కని పెట్టినవాటిల్లో మరీ విచిత్రం అయిన విషయం ఏమిటంటే ఆడవాళ్ళతో మాట్లా ట్టానికి ఆమె నాకంటే సిగ్గుపడేది. లక్ష్మణశాస్త్రి భార్యతో తలవంచుకొని మాట్లాడేది. ఆమె వేసే ప్రశ్నలకు జవా బులు చెప్పటానికి అమిత సిగ్గుపడేది.

"మీకు పిల్లలు ఎంతమందండీ?"

"............"

"మీ పెద్దపిల్ల పెళ్ళి యీడుకు వొచ్చిందా?"

"............"

"మీరిట్లా తిరుగుతూవుంటే మీ పిల్ల లకు అలనా పాలనా యెట్లా జరుగు తుంది!"

"..........."

"ఈ చీరె యెక్కడ కొన్నారు? దీని రంగు నిలవదండీ?"

"..........."

"ఈ జాకెట్టుకి కుట్టుకూలీ యేం యిచ్చారు?"

ఇటువంటి ప్రశ్నలకు జవాబులు చెప్ప లేక ఆమె తబ్బిబ్బు పడేది. మర్యాదగా జవాబులు చెప్పాలని ప్రయత్నించేది గాని జవాబులు దొరక్కో, అలవాటు లేకో ఉక్కిరిబిక్కిరి అయ్యేది. ఇంతేకాదు, పసిపిల్లల్ని చూసినా అంతే! మేం అంతా మాట్లాడుకునే సమయంలో శాస్త్రి పిల్ల వాడు "అమ్మా" అంటూ ఆమె వొళ్ళో దూరితే ఆమె పడిన భయం నే నెప్పుడూ మరచిపోలేను. ఒళ్ళో తేలుపడ్డట్టు ఉలిక్కి పడ్డది. శాస్త్రి భార్య, "తిరగమోత మాడుతూవుంది. కొంచెం పిల్లవాణ్ని చంక వేసుకోండి, చూసివస్తాను" అని చెప్పి ఆమెకు పిల్లవాణ్ణి అందించినప్పుడు ఆమె పడ్డ యాతన ఆ పరమాత్ముడికే తెలియాలి. పిల్లవాణ్ణి చంకన వేసుకోవటం చాతకాక శాస్త్రి భార్య పొయ్యిమీద చట్టిని పట్టుకున్నట్లు పట్టుకుంది, కాని యెంత బాధ అయినా ఆమె మరుక్షణమే మరచి పోయేది. ఇవతలికి వొచ్చి ఏమీ జరగ నట్టుగానే యధాప్రకారం మా అందరి తోనూ కులాసాగా కబుర్లు చెప్పేది. ఆ సంగతే ఎత్తేది కాదు.

భోజనంచేసి ఆమెను గురించి ఆలో చిస్తూ పడుకున్నాను. ఇంతలో ఆమె




కూడా శాస్త్రి యింట్లో భోజనం పూర్తి చేసుకొని వొచ్చి సినిమాకి వెళ్దాం రండి'' అని అడిగింది.

''నేను కొంచెం తటపటాయించి ''శాస్త్రి యేడి?'' అన్నాను.

''శాస్త్రి లేకపోతే మీరు రారా?''

''ఎందుకు రాను?''

''ఇంకేం? రండి.''

''బండి పిలిపిస్తాను.''

''నడిచిపోదాం.''

ఇద్దరం బయల్దేరాం. రోడ్డుమీద యెవ్వరూ నడవటంలేదు. మునిసిపల్ లాంతరుస్థంభాలు మిణుకుమిణుకుమంటూ కాపలా కాస్తున్నై. దూరంగా అప్పుడప్పుడూ గుర్రపుబిళ్ళ వోటిమోత వినిపిస్తూంది. మేమిద్దరం పక్కపక్కనే నడుస్తున్నాం. చలికి ఆమె శాలువా కప్పుకుంది. అందుకని నాకు ఆమె స్త్రీగా కనపట్టం మానేసింది. కొంచెం సేపయింతర్వాత ఆమె ఒక్క నిట్టూర్పు విడిచి యిలా అంది: ''మీ వూరు చాలా వెనకబడి ఉందండీ!''

నాకేమీ తోచక, ''శాస్త్రికూడా వొస్తే బాగుండేది'' అన్నాను.

ఆమె ఒక్క క్షణం ఆగి, ''చాలా వెనకబడివుంది'' అని తనలో తాను అనుకుంటున్నట్లు అన్నది.

''లేకపోతే బొంబాయి ఉన్నట్లు ఉండమంటే యెట్లా వుంటుంది!'' అన్నాను.

''ఊరు సంగతికాదు — మనుషుల సంగతి. నేను వొచ్చినప్పటినుంచీ చూస్తున్నాను. మీరు మాంధాత కాలంలో ఉన్నారు. అబ్బా, మీ రీ ఊళ్ళో యెలా బ్రతుకుతున్నారో! ఒకరితో మాట్లాడితే యింకొకరికి కోపం. అందరితో మాట్లాడితే అందరికీ కోపమే! దీన్నే యీర్ష్య

అంటారు కాబోలు శాస్త్రి యింట్లో మీ అందరి సంగతి గమనించాను కాఫీ హోటల్‌కి వెళ్లేటప్పుడు వూళ్ళోవాళ్ళ సంగతి చూచాను ఏం అన్యాయం? అన్నీ ప్రిమిటివ్ లక్షణాలే! ఆడవాళ్ళ పని మరీ అన్యాయంగా ఉంది. ప్రతి భార్యా తన భర్తని యితర స్త్రీలనుంచి కాపాట్టమే తన ధర్మంగా నటిస్తుంది. తన భర్తతో మాట్లాడే ప్రతి స్త్రీ తన భర్తను కాజెయ్యటానికే ప్రయత్నిస్తూవుంది అనుకుంటుంది. ఎంత ప్రిమిటివ్! మీరంతా మాంధాత యుగంలో వున్నారు."

నేనేమీ మాట్లాడలేదు. ఆమె మాటలు యదార్థం అని నాకు తెలుసు. ఆమె వొచ్చిందగ్గర నుంచీ మా జీవితంలోని అమానుషత్వం నాకు స్పష్టంగా కనిపిస్తూనే వుంది.

"మీరు తెలివిగలవాళ్లు. చాలామంది కంటే తెలివికలవాళ్లు. అందుకని మిమ్మల్ని చూస్తూ వుంటే నాకు ముచ్చటగా వుంటుంది. కాని ఏం లాభం? మీ చుట్టూ వున్న సంఘంలో మీరూ ఒకరు అవటం వల్ల మీలోకూడా ప్రిమిటివ్ ఇన్‌స్టింక్ట్స్ చాలా వున్నాయ్. మొదటనుంచీ నేను మిమ్మల్ని గమనిస్తూనే వున్నాను. మీ రిక్కడవుండి చెడిపోతున్నారు. మీ కొక్క సలహా చెపుతాను. మీ రిక్కడ స్త్రీల క్లబ్బు ఒకదాన్ని ఆర్గనైజు చెయ్యండి. ఆడవాళ్ళని కొంచెం కలిసి మెలిసి తిరిగేటట్టు చేస్తే తప్ప యీ పటుత్వం పోదు నామాట వినండి."

ఈమాటలు మేం బ్రతుకుతున్న బ్రతుకునంతా ఒక్కసారి జ్ఞాపకానికి తెచ్చినయ్. భార్యల్ని ఇళ్ళల్లో పెట్టటం—బజార్ల వెంట తుకిడీలు తుకిడీలుగా తిరగడం—ఏ స్త్రీ అయినా కనిపిస్తే కోతి చేష్టలు చెయ్యటం—ఆడవాళ్ళ సంగతే సదా మాట్లాడుకోవటం — అంతా అసహ్యంగా కనిపించింది. ఈ మధ్య మా వూళ్ళో ఆడవాళ్ళకోసం జరిగిన హత్యలు జ్ఞాపకం వొచ్చినై. వీటన్నిటికీ కారణం ఆమె చెప్పిందేనా? ఆమె మాటలకు సమాధానం చెప్పకుండా ఆలోచనలో పడ్డాను. ఆమెకూడా గ్రహించినట్లు వుంది. మళ్ళీ ఆ సంగతి ఎత్తలేదు.

హాల్లో ప్రవేశించిం తర్వాత మొత్తం రెండు మూడుసార్లు మాట్లాడించింది. ఒకసారి "నాకు చెర్లెస్ బోయర్ అంటే యిష్టం. కామేశ్వరుడికి గ్రేటాగార్బో అంటే యిష్టం" అంది.

"చార్లెస్ బోయర్ అంటే యెవరికి యిష్టం వుంటుందో నాకు తెలుసు. కాని మీకు యిష్టం అవటం నాకు చాలా ఆశ్చర్యంగా వుంది" అన్నాను.

"ఎందుకని?"

"అతడు చాలా మాస్క్యులైన్‌గా వుంటాడు. అతడు ముద్దు పెట్టుకుంటూ వుంటే తెర చిరుగుతుందేమో నని భయం వేస్తుంది నాకు."

ఆమె చిరునవ్వు నవ్వుతూ, "చిరిగితే



యువ

విరిగిందిలే; అనిపిస్తుంది నాకు'' అంది, కొంచెంసేపు వుండి, ''విరుద్ధ స్వభావాలు ఆకర్షించుకుంటాయి అనుకోవటం పాత సిద్ధాంతం'' అని నెమ్మదిగా చెప్పింది.

ఇంకా కొంచెంసేపు వుండి, ''మీరన్న మాటకి నా కొక్క విషయం జ్ఞాపకం వొస్తూవుంది. మీతో చెప్పక పోవటం యెందుకు; మా ఊళ్ళో ఒక మహిళా సంఘంలో సభ్యురాలిగా జేర్చుకోమని అప్లికేషన్ పెట్టుకున్నాను. వాళ్ళు నా అప్లికేషన్ తిరగగొడుతూ, 'ఈ సంఘం స్త్రీలకు మాత్రమే' అని రాసి పంపారు'' అని బిగ్గరగా నవ్వటం మొదలు పెట్టింది. నాకుమాత్రం ఆమెను చూస్తే జాలివేసింది.

మళ్ళీ సినిమా చూస్తూ కూర్చున్నాం—

మొదటి రాత్రి తెల్లవారగానే కథానాయకుడూ, కథానాయకి అత్యుత్సాహంగా చెట్టుకొమ్మ పట్టుకొని వొకళ్ళు పువ్వు వాసన చూస్తూ, ఒకళ్ళు డూయట్‌సాంగ్ పాడుతూవుంటే ''ఈసీను ఎట్లావుంది?'. అని అడిగింది.

''బాగోలేదు. ఆమె కాసేపు సిగ్గు అభినయిస్తే బాగుండేది?'' అన్నాను.

''ఎందుకని?''

''గతరాత్రి అనుభవం ఆమెకు ప్రథమం. చూడండీ, అందుకని అతని మొహం చూసీ చూట్టంతోనే సిగ్గు జనించటం సహజం'' అన్నాను.

''ఆమెకు ఆ అనుభవం ప్రథమం అని మీ కెట్లా తెలుసు?'' అని నవ్వింది. నవ్వుతూ తన చేతిలోవున్న సంపెంగ పువ్వు నా చేతిలో పెట్టింది. నాకు పువ్వులంటే యిష్టంలేకపోయినా వాసనచూస్తూ కూచున్నాను.

''గ్రేటా గార్బో క్వీన్ క్రిస్టినా చూశారా?''

''ఆఁ''

''ఆ సీను ఎట్లావుంది?''

ఆమె యే సీనుకి రిఫర్ చేస్తూవుందో నాకు తెలిసింది. ఆ సీన్లో గ్రేటాగార్బో పక్కన పడుకునేవరకూ ఆమె కుర్రవాడు అనుకుంటాడు హీరో. అకస్మాత్తుగా తెలుస్తుంది. ఆమె కుర్రదనీ ఆ సీను ఎట్లావుందని ఆమె నన్ను అడుగుతూ వుంది.

''బాగుంది.''

''....ఆ షాట్ ఎట్లా వుంది?''

ఆమె ఏ షాట్నిగురించి అడుగుతూ వుందో నాకు తెలిసింది. కాని ఆమె ఆ షాట్ అందం అడగటంలేదు. ఆ షాట్లో వున్న గ్రేటాగార్బో సంగతి అడుగుతూ వుంది. గార్బో వొదులొదులుగావున్న చొక్కాతో నిలబడివుంది. లోపల మరేమీ లేదు. అది ఎట్లావుంది? అని అడుగుతూంది నన్ను.

''అసలు గార్బో చిత్రాలు చూస్తుంటే నాకు ఊపిరి సలపక ఒకరకంగా వుంటుంది, అట్లా అవటం నా కిష్టం వుండదు.''

ఆమె మాట్లాడలేదు.

సినిమాహాల్లోనుంచి బయటికి రాగానే ఆమె యిట్లా అన్నది: "ఇక యీ వూళ్ళో నేను బతకలేను. మీరంతా ప్రిమిటివ్ పీపుల్స్. నాలుగువందల సంవత్సరాల కిందటి జీవితాన్ని ప్రస్తుతం మీరు గడుపుతున్నారు. మిమ్మల్ని చూస్తూవుంటే బారువా చిత్రాలలోని కోయవాళ్ళ జ్ఞాపకం వొస్తున్నారు. బారువా నవనాగరిక కుటుంబాలను చూపించి, చూపించి అకస్మాత్తుగా కోయగూడెంలో ప్రేక్షకుల్ని పడేస్తాడు. ఇతరచోట్లు చూచి మీవూరు వొచ్చిన నాపని యిప్పుడట్లావుంది. ఇక యిక్కడ నేను బతకలేను. రేపే వెళ్ళిపోతాను."

ఆమె యింకా కొన్నాళ్ళు ఈ వూళ్లో వుండాలని నాకు వుంది. ఆమె వుంటే మా జీవితాలు కొద్దిగానైనా మారవొచ్చు అనే ఆశకూడా వుంది. కాని నా ఉద్దేశాలన్నీ ఆమెతో చెప్పుకోలేక "రేపు ఒక్క రోజు ఉండగూడదూ?" అన్నాను.

"ఉండను. నేను నిజంగా చెబుతున్నాను. ఈ వాతావరణంలో ఒక్క క్షణంకూడా బతకలేను. టార్జాన్ చూశారుగా! ఆ మృగాలమధ్య, ఆ మహారణ్యంలో; ఆ టార్జాన్ పక్కనవున్న పిల్లని చూస్తే నాకు అమిత భయంవేసేది. ఇప్పుడు మీవూళ్ళో మీమధ్య నాపని ఆ పిల్ల పనిలాగేవుంది. ఎలా వుండగలను! వుండను."

మర్నాడు పొద్దున్న నేనూ, లక్ష్మణశాస్త్రీ, మరికొంతమంది స్నేహితులం కలిసి ఆమెను బొంబాయి రైలు ఎక్కించి వొచ్చాం. ఎక్కించివొచ్చాం అంటే ఆమె ఎక్కింది, మేం చూస్తూ నుంచున్నాం.

ఆమె నా జీవితాన్ని మార్చివేసింది. నా దృష్టి పూర్తిగా మారిపోయింది. ఇంతకుముందు యే పని చెయ్యబోయినా ఇన్‌సెంటివ్ వుండేదికాదు. ఇప్పుడా తత్వం పోయింది. హుషారు ఎక్కువైంది. ఇదివరకు ఎవ్వరయినా ఉపన్యాసానికి పిలిస్తే వెళ్ళ బుద్ధిఅయ్యేదికాదు. ఇప్పుడలాకాదు—కథలు రాయాలనీ, ఉపన్యాసా లివ్వాలనీ, పదిమందిచేత మెప్పులు పొందాలనీ అపేక్ష కలిగింది. అన్నిటికంటే పెద్దమార్పు చేతులూ, కాళ్ళూ, మొహం రోజూ వీలు చిక్కినప్పుడల్లా శుభ్రంగా తోముకోవటం. నాలో కలిగిన మార్పుకి యివి ఉదాహరణలు మాత్రమే! ఏ పని చెయ్యబోయినా, ఎవరితో మాట్లాడబోయినా, ఏదో జీవిత రహస్యం తెలుసుకున్నట్టు, తారక మంత్రోపదేశం పొందినట్టు సంతోషంగా వుండేది. ఆమె మాటలూ—ఆ చనువుగా వుండీ ఉండకుండా ఉంటం—చనువుగా ఉంటూనే లొల్లిగా ఉండకుండా ఉంటం—నిర్భయంగా అన్ని విషయాలూ చర్చించటం — ఆమెని తలచుకొన్నప్పుడల్లా హృదయం ఉప్పొంగేది. స్త్రీ మొగవాడితో

# ఇంగ్లీషు లిటరేచర్ కూడా తెలుగుమాధ్యమంలో బోధిస్తారా!




తిరిగితే పొద్దై పోతుంది అంటారే యెంత పొరపాటు మాట!

ఆనాటి సాయంకాలం లక్ష్మణశాస్త్రి ఇంటికి వెళ్లాను. అతనితో ఆమెను గురించి కాసేపు ముచ్చటిద్దామనే ఉద్దేశంతో వెళ్లాను. ఆమెనుగురించి తలుచుకున్నా, ఆమెనుగురించి మాట్లాడినా, ఆమె పక్కన కూర్చుని నవ్వుతున్నట్లు వుండేది నాకు. నేను వెళ్ళేటప్పటికి లక్ష్మణశాస్త్రి యింట్లో సుబ్బారావూ, కృష్ణారావూ, వెంకటేశ్వరరావూ వున్నారు, లక్ష్మణశాస్త్రి వాళ్ళకేదో చెపుతున్నాడు. వాళ్ళు గూడా ఆమెనుగురించే మాట్లాడుతున్నారని నేను కనిపెట్టాను. పాపం వాళ్ళని చూస్తే నాకు జాలివేసింది. వాళ్ళు దిగులుగా కూర్చున్నారు. ఆమె వెళ్ళిపోగానే వాళ్ళ జీవితాలన్నీ ఒక్కసారి అయోమయం అయిపోయినై. చెట్టు ఆశ్రయం పోయిన పక్షుల్లా అయిపోయారు. తల్లి ప్రేమను పోగొట్టుకొన్న పిల్లల్లాగా కూర్చున్నారు. "నేను మీ తల్లిని" అని ఆమె చెప్పినమాట నా చెవుల్లో గింగురుమంది.

నేను వెళ్ళి కూర్చోగానే లక్ష్మణశాస్త్రి "ఏమోయ్, మన కృష్ణారావు ఏమంటున్నాడో విన్నావా? ఆమెను మళ్ళీ పిలిపించి మహిళా సంఘాలు ఆర్గనైజ్ చేయించాలంటున్నాడు."

"మంచిదేగా! తగిన సన్నాహాలు చేసి పిలిపించండి" అన్నాను. నాక్కూడా ఆ

కోర్కె వుందని చెప్పటం నాకు యిష్టంలేక అలా అన్నాను.

"పిలిపించండి అంటేకాదు. మేము రాస్తే వొస్తుందో లేదో, నువ్వు రాయాలి" అన్నాడు కృష్ణారావు.

"మనకోసం వొస్తుందా! ఎవ్వరు రాసినా ఒకటే" అన్నాను.

"అదేమిటి? స్నేహం, మంచీ చెడ్డా వుండవ్! నువ్వంటే ఆవిడకు గురి...." అన్నాడు సుబ్బారావు. సుబ్బారావు చూపులూ, వైఖరీ నాకేమీ నచ్చలేదు. అసలు మొత్తం అంతా విచిత్రంగా వుంది. వాళ్ళ స్వభావమే విచిత్రంగా మారినట్లు వుంది. వాళ్ళధోరణి చూస్తే నాకు కోపం వచ్చింది.

"అందరం స్నేహితులమే! ఇందులో కాందెవరు?' అన్నాను.

"మా స్నేహాల దేముందిలే? మావన్నీ ఉత్తుత్తి స్నేహాలు. మాతో స్నేహం చెయ్యటానికి, మేమేమన్నా కథలు రాస్తామా? హ్యూమరస్‌గా మాట్లాడి నవ్విస్తామా? సినిమాలకు వెంటబెట్టుకు పోతామా?" అన్నాడు సుబ్బారావు.

ఆఖరిమాటకు అంతా విషపు నవ్వు నవ్వారు. కృష్ణారావుకి ఎన్నడూ ఆరోగ్యం సరిగ్గా ఉండకపోవటంవల్ల యేమొచ్చినా ఆపుకోలేడు, విరగబడి నవ్వటం మొదలు పెట్టాడు. వాళ్ళ సంభాషణమాట అటుంచి, వాళ్ళ నవ్వుకూడా నాకు సహజంగా కనబడలేదు. క్షణక్షణానికి నాకు కోపం ఎక్కువ అవుతూవుంది,

నేను సుబ్బారావు వంక తీక్షణంగా చూచి, "నీ తెలివికి సంతోషించాను ఇకనైనా ఆపు?" అన్నాను

లక్ష్మణశాస్త్రి చిలిపినవ్వు నవ్వుతూ, "ఎందుకోయ్, అంత ఉనుకూ? వాళ్ళన్న మాటలో తప్పేముంది? మీరు సినిమాకి తిరిగినమాట నిజమేనాయె, మా అందర్లోకీ ఆమెకు నువ్వంటే మనస్సన్నమాట అందరికి తెలిసిన విషయమే! మొగా ఆడ అన్న తర్వాత, కలిసి తిరగటం మొదలు పెట్టిం తర్వాత—"

"శాస్త్రీ....!' అని గద్దించాను.

అతడు నామాట లెక్క చేయలేదు. వింత ధోరణిలో మాట్లాడుతూ వున్నాడు — 'తప్పేముందోయ్! ఆమె నంగనాచా?"

అంతా గొల్లున నవ్వారు.

నాకు తపనపుట్టింది. "ఆమెను ఒక్క మాట అన్నావా నేను ఊరుకోను' అని గట్టిగా అరుస్తూ లేచి నుంచున్నాను.

నాకు కోపం ఎక్కువ అవుతున్నకొద్దీ శాస్త్రికి చిలిపితనం ఎక్కువ అవుతూంది, కొంటెనవ్వుతో అతని మొహం నిండి పోయింది—"చూశారా, ఆవిడమాటంటే అతనికి ఎంత కోపమో! మనం ఆమెని ఒక్కమాటకూడా అనగూడదట! మీరు శ్రద్ధగా వినండి. ఒక్కమాటకాదు వెయ్యి మాటలంటా—ఆమె మహాపతివ్రత. ఈ మధ్య సినిమాలో ఆమె పాతివ్రత్యం

కాపాట్టానికి ఇతగాడు ప్రయత్నించాడు. ఆమె....''

ఇంతవరకే అన్నాడు, కాని ఆమెని అతడు అనబోయే మాటలన్నీ నాకు ముందే వినబడినై. ఆ మాటలు నా చెవిని పట్టం నాకు యిష్టం లేదు. క్షణం క్షణం పెరుగుతూ వచ్చిన కోపాన్ని తట్టుకోలేక పోయాను. ఇంతలో శాస్త్రి ''పుష్పం మకరందం భ్రమరం'' అంటున్నాడు.

ఇంకేముంది? అమాంతరంగా శాస్త్రి మీదకు వెళ్ళాను. అతన్ని నేను ఎన్ని దెబ్బలు వేశానో, తర్వాత ఏమయిందో నాకు తెలియలేదు. కాసేపటికి నేను నుంచున్నాను. సుబ్బారావూ, కృష్ణారావూ, వెంకటేశ్వరరావూ కిందపడి వున్న శాస్త్రిని నెమ్మదిగా లేపుతున్నారు. అతని చూపులుచూస్తే నాకు జాలివేసింది. నేను యిటువంటిపనికి పూనుకుంటానని అతడు ఎప్పుడూ అనుకొని వుండడు. నన్ను జాలిగా చూస్తూ అతడు ''నీకు పిచ్చెత్తిం'' దన్నాడు.

* *

నేను చేసిన పనికి నాకు యే మాత్రం పశ్చాత్తాపం కలుగలేదు. ఎందుక్కలుగుతుంది? మంచీ చెడూ తెలియకుండా అనే మాటా, అనని మాటా తెలియకుండా నోరు పారేసుకుంటే యెట్లా వోర్చుకోవటం? వాళ్ళునాకు స్నేహితులే కావొచ్చు. అయితే మాత్రం? అందులో ఆమెని గురించా?

ఆమె అటువంటి మనిషేనా? ఆ మాత్రం వాళ్ళు తెలుసుకోవద్దూ! ఆమె పక్కన కూర్చున్నా, ఆమెతో కలపి మాట్లాడినా, ఆమెతో కలపి నవ్వినా, అటువంటి చెడు ఆలోచనే రాదే! ఏదో లోకంలో, మబ్బుల్లో, శరీరాలే జ్ఞాపకానికి రాని భావనలో సంచారం చేస్తున్నట్టు వుంటుందే! అటువంటి ఆమెకా యిటువంటి నీచ స్వభావం అంటగట్టడం? వీళ్లు కూడా అందరికిమల్లే 'స్త్రీ పురుషుడితో తిరిగితే చాలు, చెడిపోయి తీరాలి' అనే అభిప్రాయంలోనే వున్నారు. ఇక స్నేహితులైతే మాత్రం వీళ్ళని నేను యెందుకు సహించాలి?

నిజంగా నేను చేసినపనికి నాకు చాలా సంతోషం వేసింది. వాళ్ళకు తగినట్టు బుద్ధి చెప్పాననే తృప్తి కలిగింది.

ఒక్కొక్కప్పుడు, జరిగింది జరిగినట్టు ఆమెకు రాద్దా మనిపించేది. మళ్లీ ఆమె మనస్సుని కష్టపెట్టినవాళ్ళం అవుతామేమోనని పస్తాయించి వూరుకునేవాణ్ని. అటువంటి ఆమె కొంతమందిని తనని గురించి ఇట్లా అనుకుంటున్నారని తెలిసినా, కొంతమంది మనుషులు ఎంత నీచంగా ఆలోచిస్తారో తెలిసినా, ఎంత బాధపడుతుందో. ఆమె పవిత్రహృదయం యెంత కొట్టుకుంటుందో నాకు తెలుసు. అందుకని ఇక్కడ జరిగిన సంగతులు ఆమెకు ఏమీ రాయకుండా వూరుకున్నాను.

కాని అయిదోరోజు ఆమె దగ్గరనుంచి

నాకు ఉత్తరం వొచ్చింది. నాకు యెంత ఆశ్చర్యం వేసిందని? ఇక నా ఆనందానికి అంతేలేదు. గబగబా ఉత్తరం చించి చదివాను. ఆ ఉత్తరం రావటం నాకు ఆశ్చర్యం కలిగిస్తే, ఇక అఉత్తరంలోని సంగతులు చదివేటప్పటికి నా హృదయం ఆగిపోయినట్లయింది. ఆమె ఉత్తరం ఇది ...

"నేను బాగానే వున్నాను. ఇంటికి నలగని పువ్వల్లే జేరాను. వొచ్చినప్పటి నుంచీ మీకు ఉత్తరం రాద్దా మను కుంటు న్నాను. కాని మీకు ఉత్తరం ఎలా రాయాలో బోధపట్టంలేదు. ఏం రాస్తే ఏమనుకుంటారో, నేను రాయదలచింది మీకు అర్థం అయ్యేట్టు రాయగలనో లేనో అని భయంవేసి మెదలకుండా వూరు కున్నాను. నేను నిజం చెపుతున్నాను. మీకు అర్థం అయ్యే భాష నాకురాదు— ఒకవేళ వొచ్చినా మరచిపోయి వుంటాను.

"ఇవ్వాళ లక్ష్మణశాస్త్రి దగ్గరనుంచి ఉత్తరం వొచ్చింది. మీరేమీ ఆశ్చర్య పడవద్దు. మే మిద్దరం స్నేహితులం అనే విషయం మీకు తెలిసిందే గదా? ఆ వుత్త రంలో అతడు సంగతులన్నీ విపులంగా రాశాడు. అతనికీ మీకు జరిగిన పోట్లాట అంతా రాశాడు. అతదేమీ అబద్ధాలు రాయ లేదు. తన తప్పుని కప్పి పుచ్చుకోటానికి ఏమాత్రం ప్రయత్నించ లేదు. అక్షరాలా జరిగింది, జరిగినట్టుగానే రాశాడు. ఆ వుత్తరం చదువుతూవుంటే నాకు అప రాధపరిశోధక నవల చదువుతూ వున్నట్లు ఉంది. స్టంటు పిక్చరు చూస్తూ ఉన్నట్లు ఉంది.

"ఏమండీ, మీరు నా ఆనర్ డిఫెండు చెయ్యటానికేనా శాస్త్రితో పోట్లాడింది? అతన్ని కొట్టడం కూడా నాకోసమేనా? నిజంగా ఆదృశ్యం ఊహించుకుంటూ ఉంటే మీ రేగిన వుంగరాల జుట్టూ, ఎర్ర బడ్డ కళ్ళూ, ఆవేశంతో చేతులూ కాళ్ళూ ఒణకటం, లక్ష్మణశాస్త్రి కిందపట్టం, మీరు మీదకు దూకటం, జుట్టు పీకటం, మొహం రక్కటం - ఇవన్నీ ఊహించుకుంటూ వుంటే నాడియామీద నాకు అభిమానం హెచ్చుతూ వుంది. మాటవరసకు అంటం కాదు. నాడియా అంటే నాకు పూర్తి అభి మానం. జనాన్ని గుంపులు గుంపులుగా పడేసి హంటర్‌తో ఏం కొడుతుందండీ!

"మీరు చూపిన షివల్రీ నన్ను ఆక ర్షిస్తూ వుంది. గాలిపటం మీద ప్రయాణం చేసి, మీ ముందు నా కృతజ్ఞతను చెప్పు కోవా లనిపిస్తూవుంది. మీ ముందు కూర్చొని మీకు నా కృతజ్ఞతను తెలుపు కుంటూ నమస్కరిస్తే మీరు నా చేతులు పట్టుకొని లేపి, "దీనికి మీరింత పొగ డాలా? నా ధర్మం నేను నెరవేర్చాను" అంటారు కదూ? ఇటువంటి సీను ఏదో సినిమాలో చూచినట్టు జ్ఞాపకం. ఇటువంటి సీన్లు నాకు బాగుంటాయికూడాను.

కాని ముందు మిమ్మల్ని ఒక్కమాట




అడగాలని ఉంది. దానికి మీరు సవ్యంగా జవాబు చెప్పితే రెక్కలు కట్టుకొచ్చి మీ ముందు వాలి, ఆ సీను యాక్టుచేసి పోతాను. ఆమాట ఏమిటంటే అసలు నేను, నంగనాచినని మీకెట్లా తెలిసింది? మీరు నన్నుగురించి అలా అనుకోటానికి ఆధారా లేమిటి? నా మాటలుగానీ, నా చేష్టలుగానీ అటువంటి అవకాశం కలిగించినయ్యా. అలా కలిగించి ఉండవు. ఎందుకంటే నేను నిజంగా నంగనాచినని కాదు. లక్ష్మణశాస్త్రి మీకు యధార్థమే చెప్పాడు. నాకు నంగనాచిని కావాలనే అపేక్షకూడా లేదు.

“మీరు నన్ను అపార్థం చేసుకోవద్దు. ఉన్నసంగతి వున్నట్టుగా చెపుతున్నాను. మీరు చూపిన షివల్రీ విషయంకూడా నాకు ఒక అనుమానం వుంది. “ఆడ వాళ్ళని రక్షించవలసిన బాధ్యత పురుషుల మీద వుంది” అనే అభిప్రాయమే యీ షివల్రీకి కారణం అనిపిస్తూవుంది నాకు. ఈ అభిప్రాయానికీ స్త్రీ పురుషుడి ఆస్తి అనే అభిప్రాయానికీ చాలా దగ్గర సంబంధం వుంది. ఆ ఆస్తి అనుకున్నప్పుడూ, తన్ను తాను కాపాడుకోలేని స్థితిలో వుంది. అనుకున్నప్పుడేగా రక్షించవలసిన అవసరం కలిగేది. నేను వాక

రోజు మీతో తిరిగి, వొక రాత్రి కలిసి సినిమా చూచినంతమాత్రాన నన్నుగురించి మీరిట్లా అనుకోటం—నా ఆనర్సి కాపాడ వలసిన బాధ్యత మీమీద వుందనుకోటం చాలా అన్యాయం. లక్ష్మణశాస్త్రి మొద లయినవాళ్ళకీ మీకూ భేదం యేముంది? నేను ఇంకొకళ్ళ ఆస్తినయ్యాననే అసూ యతో వాళ్ళు మీ దగ్గర నోటికి వొచ్చి నట్లు మాట్లాడారు. మీ ఆస్తిని హేళన చేస్తూన్నారనే భావంతో బాధపడి అవమాన పడి మీరు వాళ్ళతో దెబ్బలాడారు. ఇక భేదం యెక్కడ? మీరు నాకోసం పోట్లా ట్టం ఖాళీకోటని రక్షించటానికి ప్రాణాలు వొడ్డి రసపుత్రవీరుని శౌర్యం, ధైర్యం, సాహసం జ్ఞాపకానికి తెస్తున్నది.

"మీకూ, మీ కథలకూ ఎంత భేదం వుందండీ! మీ ప్రవర్తన వేరు, మీ రచ నలు వేరు. ఒకటి వెనక్కు లాగుతూ వుంటూ ఒకటి ముందుకు లాగుతూ వుంటుంది. ఆలోచించుకొన్నకొద్దీ ఆ కథలు రాసింది మీరేనా అనిపిస్తూవుంది నాకు. నేను చాలామంది రచయితల్ని ఎరుగుదును. ఎక్కువమంది ఇంతే! వాళ్ళ రచనల్లో వెలిబుచ్చే అభిప్రాయాలు ఎంత అభివృద్ధిదాయకంగా వుంటై! ప్రవర్తన మామూలు మనిషి ప్రవర్తనకంటే అధ్వా న్నంగా వుంటుంది. దీనికి భావాలను, ఆలోచనలను, ఆచరణలోకి, అనుభవం లోకి తీసుకురావాలనే ప్రయత్నం లేక పోవటమే కారణం అనుకుంటాను. మీ విషయంలో ఇట్లా వుండదని కుతూహలం పడ్డాను. కాని మీరూ అంతే! సాధార ణంగా రచయితల్లో వుండే బలాలు, బల హీనతలూ, ఉద్రేకాలూ, ఆవేశాలూ అన్నీ మీలోనూ ఉన్నాయ్.

"మీరు మారాలి—దయచేసి మారాలి. ఈ మాట నేను మీకు మీ వూళ్ళో వున్న ప్పుడే చెప్పాను. మళ్ళీ చెపుతున్నాను. నేను ఇంతగా ఎందుకు చెపుతున్నానంటే, మీలో యిన్ని బలహీనతలు వున్నా మీరంటే నాకు యిష్టం. అందుకని మిమ్మల్ని బాగుచెయ్యాలనే గాఢంగా వుంది. దీనికి నాకు ఒక్కటే దారి కని పిస్తూవుంది. మీరు లేడీస్ క్లబ్బు ఒక్కటి ఆర్గనైజ్ చెయ్యండి. ఆ క్లబ్బుకి మీరే సెక్రటరీగా వుంటే మరీ మంచిది. నేను చాలా సంతోషిస్తాను. అశ్రద్ధ వొద్దు. జాడ్యం ముదరనిస్తే తరువాత ఎంత ప్రయత్నించినా లాభం వుండదు.

"లేడీస్ క్లబ్బుకి సెక్రటరీగా వుంటే నాకు ఊపిరి సలపదు. నాకు అట్లా అవటం ఇష్టం వుండదు" అని మహా పతివ్రత పోజు పెట్టకండి. ఊరికే అట్లా అంటారుగాని ఊపిరి సలపక ఏమవు తుంది? ఎంతసేపు నేను 'అందంగా' తెలివిగా మాట్లాడుదాం అనిగానీ, యదా ర్థం మాట్లాడుదాం అనిగానీ మీకు ఎందుకు వుండదు? సంఘానికి జడిసి బానిసఅయి చిటపటలాడుతూ, రుసరుసమంటూ కాలం గడిపే పతివ్రతగా మీరు వుంటం నాకు



ఇష్టంలేదు.

"ఇక సెలవు. నేను మనసిచ్చి, రాయదలచుకుందంతా రాశాను. మీరు కూడా అట్లాగే ప్రవర్తించాలని కోర్కె. తప్పకుండా జవాబు రాయండి.

"అయితే, ఏమండీ, అడగటం మరచి పోయాను. సినిమాలో సంపెంగపువ్వు చేతికి యిస్తే, సినిమా అయ్యేదాకా వాసన చూస్తూ కూర్చుంటారా? వాసన చూట్టానికేనా సంపెంగపువ్వు లిచ్చేది? పువ్వులు యెందుకు పుట్టినయ్? వాసన చూట్టానికి. సెలయేరు యెందుకు ప్రవహిస్తూవుంది? గానం చెయ్యటానికి. మంచిగంధం చెట్టు యెందుకు పుట్టింది? పాములకు ఆశ్రయం ఇవ్వటానికి. ఇంతేగాని వీటన్నిటికీ మానవుడు పరిస్థితుల్నిబట్టి కొత్తకొత్త అర్థాలు సృష్టించుకుంటాడని గాని మాటలతో చెప్పుకోటానికి వీల్లేని భావాలను వీటి ద్వారా చెప్పుకుంటాడని గానీ, మీకు తెలియదు. మీరంతా ఎంత ప్రిమిటివ్‌గా వున్నారండీ! పైగా నేను నంగనాచినని ప్రచారం! నేనుకూడా ప్రి[illegible] వున్నాననేనా మీ వుద్దేశం!—[illegible] అపేక్ష కామాలు.

పి. యస్.

లక్ష్మణశాస్త్రి రాసిన ఉత్త[illegible] శ్వరుడు చూశాడు. చూడగా[illegible] పట్టి నవ్వుకున్నాడు. ఇప్పటి[illegible] వొచ్చినప్పుడల్లా, ఒంటరిగా [illegible] అలా నిలబడిపోయి [illegible] వుంటాడు. ఒక్కమాట చెప్ప[illegible] పోయాను. ఆ ఉత్తరం చూచి[illegible] కామేశ్వరుడికి మీమీద చా[illegible] కుదిరింది.

ఇదీ ఉత్తరం. ఆమె దగ్గరనుండి వొచ్చిన ఉత్తరం. ఈ ఉత్తరం చదువు[illegible] కాని నేను ఏమయ్యానో మీకు తెలుసు[illegible] కోవాలని వుంటుంది — నెలరోజు[illegible] ఖాయిదా పడ్డాను.

నవంబరు నెల

# భావపరిచయ పోటీ



బహుమతి పొందిన వ్యాఖ్య

చెవిటివానికేల భువి శంఖనాదంబు
పందికేల మంచి పానకంబు
విరసుడైనవాడు వినునటే గానంబు
విరుగదా ఫిడేలు వీపు మిగిలె.

—ఎ. సీతారత్నం, హైదరాబాద్.




# తప్పటడుగు

సోమేశ్వర

(గత సంచిక తరువాయి)

డాక్టర్ రవీంద్రను మామూలు పరిస్థితులలో చూసినట్లయితే అతను మెహరున్నిసాను అంతగా ప్రభావితం చెయ్యగలిగేవాడు కాడేమో! కాని తన ప్రియమైన బాబా చావుబ్రతుకుల్లో ఉన్నాడన్న ఆందోళనతో, కలవరంతో మతి స్థిరం లేకుండా ఉన్న సమయంలో, అర్ధరాత్రి కొత్త ప్రదేశంలో, డాక్టర్ రవీంద్రను చూడటం ఆమెకొక చిత్రమైన అనుభూతిని కలిగించింది.

పచ్చగా దబ్బపండు రంగు శరీరంతో, ఆరడుగుల ఎత్తుగల అతని విగ్రహం, రిమ్‌లెస్ కళ్ళజోడులోనుండి అల్లరిగా తొంగిచూసే అతని చిన్న కళ్ళు, పురుషత్వాన్ని పరిపూర్ణంగా నింపుకున్న అతని పెదవులు, వాటిమీద శృంగారంగాలాస్యం చేసే నవ్వు....అన్నీ ఆమె మనసులో గాఢంగా నిల్చిపోయినయ్. మెహరున్నిసా మరీ పురుషుడి నీడ ఎరగని కన్నెపిల్ల కాకపోయినా పరపురుషుడితో చనువుగా మాట్లాడే అవకాశాలు ఆమెకెన్నడూ రాలేదు. శ్రీమంతులైన మహమ్మదీయుల యింట్లో పుట్టి పెరగటంవలన పరదా వేసుకోకపోయినా పరపురుషులకుమాత్రం దూరంగానే ఉండేది. చిన్నతనంనుండి ఆడపిల్లల పాఠశాలలలోను, కళాశాలలలోను చదవటంవల్ల తన వయసు బాలురతో ఆమెకు పరిచయంకూడా లేదు.

డాక్టర్ రవీంద్ర రూపం, అతను తన వంక నిశితంగా చూడటం తనతో చనువుగా మాట్లాడటం, చిలిపిగా నవ్వటం యివన్నీ ఆమె మనసును కలవర పరచి

నయ్. అంత కలవరపాటులోకూడా ఆమె కేదో తెలియని ఆనందం కలిగింది. అత నితో యింకా మాట్లాడాలని, అతనివంకనే చూస్తూ గంటలతరబడి కూర్చోవాలనీ ఆమెలో తీవ్రమైన కోరిక కలిగింది. ఐతే యీ ఆలోచనలన్నీ ఆమెలో స్పష్టంగా లేవు. ఆమె అంతరాంతరాల్లో ఎక్కడో కదలాడుతున్నయ్ ఆ ఊహలన్నీను.

తెల్లవారురూమున ఏ రెండుమూడు గంటలసేపో కునుకుతీసింది మెహర్. అంతసేపూ నవ్వుతూ నిలబడిన డాక్టర్ రవీంద్రరూపమే ఆమె మనోనేత్రం ముందు నిల్చింది. తెల్లవారేసరికి ఆమెకు పూర్తిగా మెలకువ వచ్చింది. మెలకువ వచ్చినాకకూడా రవీంద్రరూపమే ఆమెను వెంటాడసాగింది.

రాత్రి జరిగినదంతా ఒక కలలాగా కనిపించింది మెహర్‌కి. తను నిద్ర పోయిన కాసేపూ తన కలల్లో కదలాడిన రవీంద్ర, అంతకుముందు తన బాబాను ప్రాణం పోసి బ్రతికించిన డాక్టరు వేర్వేరు వ్యక్తులనిపించిం దామెకు.

ఆమె కళ్లు తెరిచేసరికి చుట్టూఉన్న పరిసరాలన్నీ కొత్తగా ఉన్నయ్. రోజూ లాగా తన గదిలోని టేబులు, దానిమీద పుస్తకాలు, టేబుల్ లైటు, ఫ్లవర్‌వేజు, కుర్చీ, అలమర అవేమీలేవు. హాస్పిటల్ గది, ఎదురుగా మంచంమీద బాబా, ఫినాయిల్ వాసన, నర్సుల బూట్లచప్పుడు, ఆయాల కేకలు, అందరినీ చూస్తూనే మొదట ఆశ్చర్యపోయింది మెహర్. వాటిని చూస్తూనే మరల రవీంద్ర జ్ఞప్తికి వచ్చేడు. ఆమెకు జ్ఞాపకం వచ్చింది మొట్టమొదట డాక్టర్. తరువాత తన కలల్లో వేధించిన రవీంద్రరూపం గుర్తుకు వచ్చింది.

డాక్టరు, రవీంద్ర—రవీంద్ర డాక్టరు... కాదు కాదు .అతను డాక్టర్ రవీంద్ర.

అహమ్మద్ ఒక్కడే ఉన్నాడు. రజ్వీని యింటికి పంపించేడు యింకా బాగా తెల్లవారకముందే.

మెహర్ నిద్ర లేవటం చూసి గఫర్ ఖాన్ "బేటీ!" అన్నాడు. అప్పటికి పూర్తిగా తెలివివచ్చింది మెహర్‌కి.

"బాబా! ఎలాగుంది యిప్పుడు?" అనడిగింది తండ్రి ఛాతీమీద చెయ్యివేసి నిమురుతూ.

"బాగానే ఉందమ్మా! కొంచెం నీర సంగా ఉంది. అంతే!"

"ఆ నీరసంకూడా పోతుంది బాబా! నిన్ను చూసే డాక్టర్ సాబ్ చాలా మంచి వాడు. ఆయనవల్లనే మేము ముగ్గురం అంత ధైర్యంగా ఉండగలిగినాము" అన్నది.

"ఎవరమ్మా ఆ డాక్టరు? పేరేమిటి?" అనడిగేడు తండ్రి

"రవీంద్ర" ఎందుకో తన కంఠం తనకే కొత్తగా వినిపించింది ఆ సమయంలో.

"రవీంద్రా! ఆ పేరు విన్నదేనమ్మా!



యువ

చాలా తెలివిగల డాక్టరని. జనం చెప్పు కుంటుంటే విన్నాను."

"మీరు అతిగా మాట్లాడకండి. విశ్రాంతి తీసుకోమని డాక్టర్ సాబ్ చెప్పేరు. మెహర్! బాబాను పడుకో నివ్వు" అన్నాడు అహమ్మద్.

"ఔను బాబా! నువ్వు మాట్లాడకుండా పడుకో" అంటూ మెహర్ మంచంమీద నుండి లేచింది.

'నాకు చాయ్ త్రాగాలని ఉంది" అన్నతో అన్నది మెహర్.

"రజీ్వ ఇంటికి వెళ్లేడుగా. ఫ్లాస్కులో చాయ్ పోసుకురమ్మని చెప్పేను" అన్నాడు అహమ్మద్.

"బట్టలవీకూడా తెమ్మనకపోయేవా! రాత్రి యింట్లో కట్టుకునే బట్టలు—యివి ఎవరన్నా చూస్తే ఏం బాగుంటుంది?" అన్నది తన బట్టలవంక చూసుకుంటూ మెహర్.

"అవికూడా తెస్తాళ్లే రజీ్వ."

"ఏమో! వాడు వట్టి అడవి మనిషి. ఇలాటి విషయాలేం తెలియవు" అన్నది మెహర్ దిగులుగా.

"వాడికి తెలియకపోయినా అమ్మకాని, వదినకాని యిచ్చి పంపిస్తార్లే. ఆ బట్టలను గూర్చి యిప్పటినుండె బెంగ పెట్టుకోకు, అంతగా ఒకవేళ వాడు లేకపోతే, తీసుకు రమ్మని మళ్లీ పంపుతాను సరేనా?" అన్నాడు అహమ్మద్ చెల్లెలిని ఓదారుస్తూ.

దాంతో కొంత ధైర్యం వచ్చింది మెహర్‌కి.

డాక్టర్ రవీంద్ర వచ్చేటప్పటికల్లా కొత్త దుస్తుల్లో అతని కంటికి ఫ్రెష్‌గా కనపడాలని ఆమె మనసులో యెందుకో కోరికగా ఉంది.

ఐతే డాక్టర్ రాకకీ, తన దుస్తుల అందానికీ సంబంధమేమిటో ఆమెకే తెలియదు సరిగ్గా.

మనసు అడవిగుర్రం లాంటిది. తన యిష్టమొచ్చిన దిక్కుగా స్వేచ్ఛగా పరు గెడుతూంటుంది. దాని పరుగును ఆపి, సవ్యమైన మార్గంలోకి మళ్లించాలంటే ఎంతో నిగ్రహం, జన్మ సహజమైన సంస్కారం ఉండాలి.

విచ్చలవిడిగా పరుగెడుతున్న తన మనసును అదుపులో పెట్టుకొనటానికి కావలసిన వివేకం మెహరున్నిసాలో లేదు. సరికదా, అసలు తన మనసు అలా పరుగిడుతోందన్న ధ్యాసకూడా లేక పోయిందామెకు.

లేచిన దగ్గరనుండి రజీ్వ యెప్పుడు వస్తాడా అని కళ్ళు కాయలు కాచేలా యెదురుచూసింది మెహర్. ఆమె ఎదురు చూసింది. నిజానికి ఒక్క గంటసేపే అయినా, ఎన్నో గంటలు ఎదురుచూసిన ట్లనిపించింది ఆమెకు.

ఓవరకు రజీ్వ రాగానే అతని చేతిలోని ఫ్లాస్కును, ప్లాస్టిక్ బాగును తీసుకని "యిప్పుడా రావటం!" అంది కోపంగా.

"ఇప్పుడా! అంటే నీ ఉద్దేశ్యం

ఏమిటి? ఎంతసేపయింది నేను వెళ్ళి? పట్టుమని గంటన్నరన్నాకాలేదు. ఇప్పుడు ఎనిమిదేగా అయింది?'' అన్నాడు రజీవ్ కూడా కోపంగా.

''రోజూ యింటిదగ్గర నేను చాయ్ తాగేది ఎనిమిదింటికేనా.'' అసహనంగా అరచింది మెహర్. నిజానికి ఆమె ఎదురు చూస్తున్నది బట్టలకోసమే అయినా, ఆ మాట పైకి చెప్పే ధైర్యం లేక, 'చాయ్' వంకపెట్టి తమ్ముడిముందు తన కోపాన్ని ప్రదర్శించింది.

''ఇంటి దగ్గరవుంటే రోజూలానే ఈ రోజు కూడా ఏడింటికే చాయ్ త్రాగే దానివి. ఇప్పుడు హాస్పిటల్లో ఉన్నావు కనుక ఎనిమిదింటికి త్రాగు. సరేనా?'' అన్నాడు నిర్లక్ష్యంగా రజీవ్.

''నోరు మూసుకో. తెలివితేట లెక్కువవుతున్నాయ్ రోజురోజుకీ'' అంటూ బాగ్ తీసుకుని గబగబా బాత్‌రూమ్‌లోకి వెళ్ళింది మెహర్.

వెంటనే బట్టలు మార్చుకుని బయటకు వచ్చింది.

ఎర్రటి నైలాన్ పైజామా ఆమె కాళ్ళకు బిగువుగా అంటిపెట్టుకుని కాలి ఒంపులలోని అందాన్ని ప్రస్ఫుటంగా చూపిస్తుంటే, దానిమీద ఎర్రటి పూలున్న బిగువైన జెరీకాట్ కుర్తా ఆమె శరీరం లోని తొలి యౌవనపు పొంగును సగర్వంగా ఎత్తి చూపెడుతోంది. ఇంచు మించు కంఠానికి చుట్టుపున్నట్లున్న ఎర్రటి నైలాన్ ఓణీమీదగల జరీపువ్వులు ఆనందోద్రేకంతో విరగబడి నవ్వుతున్నట్లు తళతళ మెరిసిపోతున్నయ్. దాని క్రింద రహస్యమైన అనుభూతులతో, అవి కలిగించే కలవరంతో జలదరించిపోతున్న వక్షోజాలు రెండూ నిండుగా, చూపరులను కవ్వించేలా వున్నయ్.

మెహర్‌కి ముదురు రంగుల దుస్తులంటే చాలా యిష్టం. అందునా ఎరుపు రంగు మరీ యిష్టం. ఆ రంగు దుస్తులు వేసుకున్నపుడల్లా మామూలుగా కన్న ఆమె రక్తం మరింత చిక్కగా, యెర్రగా వేడిగా ఉన్నట్లు, వేగంగా ప్రవహిస్తున్నట్లు ఆమె కనిపిస్తుంది. ప్రస్తుతం ఆమెఉన్న మానసిక స్థితికి ఆ యెరుపు రంగు బాగా సరిపోయినట్లనిపించింది.

రజీవ్ బట్టలు, సబ్బు తీసుకు వచ్చేడు కాని, పౌడరు, దువ్వెన, లిప్‌స్టిక్ తీసుకురాలేదు. అతని దృష్టిలో ఆమూడూ అంత అవసరమైనవికావు. అవి మెహర్‌కి ప్రాణ సమానమని అతనికి తెలియదు. ముఖ్యంగా యీ సమయంలో ఆమెకు వాటి అవసరం యెంత ఉన్నదో అతనికి అసలు తెలియదు. కాని మెహర్‌కి మాత్రం పిచ్చికోపం వచ్చింది. ''వట్టి అడవిగొడ్డు ఏమీ తెలిసి చావదు.'' అని కసిదీరా తమ్ముణ్ణి మనసులోనే తిట్టుకుంది.

కాని అవి లేనందుకు తమ్ముణ్ణి తిట్టేందుకు పరిస్థితులు, సమయం అనుకూలంగా

లేనందున అతి ప్రయత్నం మీద కోపాన్ని దిగమింగుకుంది.

చేసేదేంలేక, సబ్బుతోనే ముఖాన్ని మూడుసార్లు రుద్దుకుని పౌడరు లేని లోపాన్ని కప్పి పుచ్చింది.

దువ్వెన లేక పోవటంవల్ల జుట్టు నున్నగా లేకపోయినా, యెటుపడీ జుట్టు చెదిరింది కనుక దానిని మరింత అందంగా చెరిపేసుకుని ముఖంమీద వాలే ముంగు రులను గుండ్రంగా వేలికిచుట్టి త్రిప్పి అవి సహజంగా ఏర్పడినట్లు కనపడటానికి చాలా శ్రమపడింది. గులాబి రంగులో ఉన్న తన పెదవులను చూసి "యిప్పుడు నేను ధరించిన దుస్తులకు తగ్గట్టు యెర్ర రంగు లిప్‌స్టిక్కు రాసుకున్నట్లయితే చక్కగా మాచ్ అయి ఉండేది" అను కుంది నిట్టూరుస్తూ.

కనీసం పదిసార్లయినా అద్దంలో ముఖం చూసుకుని తృప్తిపడింది మెహర్.

డాక్టర్ రానే వచ్చేడు. క్రీమ్ కలర్ సూటులోవున్న డాక్టర్ రవీంద్ర అందంగా నవ్వుతూ "హల్లో! గుడ్ మార్నింగ్ టూ యూ ఆల్!" అన్నాడు.

అతని వాక్యాలు అందరినీ ఉద్దేశించి అన్నా అతని చూపులు మాత్రం మెహరున్నిసా మీదనే నిల్చివున్నయ్.

అది గమనించిన మెహర్ కలవర పాటుతో కళ్ళు దించేసుకుంది.

డాక్టర్ రవీంద్ర తండ్రిని పరీక్ష చేస్తుంటే ఆ లోపల ఫ్లాస్కులోని విటీ కప్పులో పోసింది మెహర్.

డాక్టర్ పరీక్ష చెయ్యటం అయిన తరువాత పక్కనే ఉన్న కుర్చీలో కూర్చు న్నాడు.

మెహర్ 'టీ' అందించింది.

"ఓ థాంక్యూ వెరీమచ్" అంటూ టీ కప్పును అందుకున్నాడు రవీంద్ర.

మెహర్ మౌనంగా నిలబడి టీ త్రాగు తున్న డాక్టర్ వంకనే రెప్పవాల్చకుండా చూడసాగింది.

"టీ చాలా రుచిగా ఉంది. మీరే చేసేరా?" అన్నాడు రవీంద్ర మెహర్ వంక చూస్తూ.

"ఉహుం. రాత్రి నుండి నే నిక్కడే ఉన్నానుగా. ఇంటిదగ్గర నుండి తీసుకు వచ్చేడు మా తమ్ముడు" అన్నది మెహర్.

"ఇంతకీ మీకు టీ చెయ్యటం వచ్చా?" చిలిపిగా నవ్వుతూ అడిగేడు రవీంద్ర.

మెహర్ సిగ్గుపడింది. "ఏదో కొంచెం వచ్చు" అన్నది.

అహమ్మద్ "ఒక్కగా నొక్క ఆడ పిల్ల అని యింట్లో అందరూ ఆమెను గారాబంగా చూస్తారు. అందుకే ఆమెకు యే పనీరాదు" అన్నాడు.

"అలాగంటే యెలా? ఆడపిల్లకు అన్ని పనులూ వస్తేనే అందం. ఎంతైనా స్త్రీ స్త్రీయేగా! ఎన్ని చదువులు చదివినా

చివరకు ప్రతి స్త్రీ గృహిణి కావలసిందే!'' అన్నాడు రవీంద్ర.

మెహర్ తన యిరవై సంవత్సరాల జీవితంలోనూ ఒక విద్యాధికుడైన పురుషుడి నోటినుండి అలాటి వాక్యాలను యెప్పుడూ వినియుండలేదు. అందువల్ల రవీంద్ర మాటలు ఆమెకు వింతగా తోచినయ్.

విస్ఫారిత నేత్రాలతో అతనివంక చూస్తూ నిలబడింది.

''ఏం, యిలా అన్నానని మీకు కోపంగా ఉందా?'' అన్నాడు రవీంద్ర.

''లేదు'' అంటూ తల అడ్డంగా ఊపింది మెహర్.

''ఇంక వస్తాను. చూడవలసిన పేషెంట్లు చాలామంది ఉన్నారు. డ్యూటీ మొదలౌటంతోనే మీ దగ్గరకే వచ్చేను'' అంటూ లేచి నిలబడ్డాడు.

అతనలా వెళ్ళిపోవటం మెహర్‌కి యేమాత్రం నచ్చలేదు. ఆమె మనసులో యెందుకో ఆరాటంగా ఉంది. ఆ ఆరాటం యెందుకో ఆమెకే అంతుపట్టలేదు.

''మళ్ళీ యెప్పుడొస్తారు?'' అని డాక్టర్‌ని అడగాలనుకుంది. కాని రాత్రి కూడా అదే ప్రశ్న అడిగిన సంగతి జ్ఞప్తికివచ్చి మళ్లా అడగటం బాగుండదని ఊరుకుంది.

తండ్రివంక తిరిగి ''బాబా! డాక్టర్ సాబ్ వెళ్ళిపోతున్నారు. చెప్పవలసిన దేమైనా ఉన్నదా?'' అన్నది.

''డాక్టర్‌సాబ్! మధ్యాహ్నం ఓసారి వచ్చి చూడండి. నాకు ఎందుకో భయంగా ఉంది. పిల్లలు నా గురించి అనవసరంగా దిగులుపడ్తారు.'' అన్నాడు గఫర్‌ఖాన్.

''అలాగే బాబా! తప్పకుండా వచ్చి చూస్తాను. ఒంటిగంటకు నా డ్యూటీ అయిపోతుంది. ఇంటికి వెళ్లేముందు ఓసారి వచ్చి చూస్తాను. మీరు దిగులుపడవద్దు'' అన్నాడు రవీంద్ర.

గఫర్‌ఖాన్ డాక్టర్‌వంక కృతజ్ఞతగా చూసేడు.

డాక్టర్ వెళ్ళిపోయేడు.

''ఈ డాక్టర్ చూస్తుంటే మంచి విలాస పురుషుడిలా ఉన్నాడే!'' అన్నాడు

''ఎందుకలా గంటావు?'' అనడిగింది కోపంగా మెహర్.

''ఆ నడకా, ఆ బట్టలు, ఆ మాట తీరూ అవీ చూస్తూంటే కనపట్టంలా?'' అన్నాడు రజీ.

''డాక్టర్ ప్రొఫెషన్‌లో ఉన్నవాళ్ళు అలా ఉండటంలో తప్పేంలేదు. పైగా అలా ఉండటం అవసరం కూడా. ఎప్పుడూ నీటుగా ముస్తాబై, చిరునవ్వుతో పేషంట్లను పలకరిస్తుంటే రోగులకు కూడా డాక్టర్‌మీద నమ్మకం, అభిమానం కలుగుతయ్. మానసికంగా వాళ్ళు స్వస్థులౌతారు. అప్పుడు శరీర రుగ్మతను నయం చెయ్యటం చాలా సులభమవుతుంది'' అన్నాడు అహమ్మద్.

అన్న డాక్టర్‌ని వెనకేసుకు రావటం

ఆ చక్కని,
పరిశుభ్రమైన
తెల్లదనానికి

# ఓ ఓ బి
# నీలి

ఓ ఓ బి నీలి నీటిలో అతి సులభంగా, పూర్తిగా కరుగుతుంది. తెల్లటి దుస్తులకి సమమైన మంచులాంటి తెల్లదనాన్నిస్తుంది. మీ చొక్కాలకు, చీరలకు, దుప్పట్లకు మరియు ఇతర బట్టలకు అధికతరమైన తెల్లదనాన్నివ్వడానికి ఇదే అతి పొదుపైన పద్ధతి. నీలపు మరకలుండవు. పసుపు రంగుగా మారదు. ఓ ఓ బి నీలి భారతదేశంలోకెల్లా పెద్దదైన, ఆధునికమైన ఫ్యాక్టరీలో పశ్చిమ జర్మనీవారి సహకారంతో తయారుచేయబడుతున్నది.




తయారుచేయువారు:
**అల్ట్రామెరైన్ అండ్ పిగ్మెంట్స్**
**లిమిటెడ్,** అంబత్తూరు, మద్రాసు-53



UPL-6548

మెహర్‌కి చాలా ఆనందాన్ని కలుగ జేసింది.

"ఔనన్నయ్యా! వాడికలాగే బుద్ధి చెప్పు. అందరూ తనలాగే వీపింగ్ ఫిలాసఫర్స్‌లా ఏడుపుమొహం పెట్టుకుని మూల కూర్చోవాలనుకుంటాడు రజ్వీ. కలకల నవ్వుతూ ఉండేవాళ్ళంటే వాడికి గిట్టదు'' అన్నది మెహర్.

"నోర్ముయ్ '' అన్నాడు రజ్వీ

"నువ్వే నోర్ముయ్'' అన్నది మెహర్.

"ఇదిగో మీ రిద్దరూ యిలా పోట్లాడు తున్నారంటే అసలు మిమ్మల్ని యీ హాస్పిటల్‌లోనే ఉండనివ్వను. ఇంటికి పంపేస్తాను'' అన్నాడు అహమ్మద్.

"అసలు రజ్వీని యింటికి పంపేయ్ భయ్యా! నే నొక్కదాన్నే బాబా దగ్గ రుంటాను అవసర మొచ్చినప్పుడల్లా నువ్వు వచ్చి, చూసిపోదువుగాని ' అంది మెహర్. ఆ సూచన అన్నదమ్ము లిద్దరికీ కూడా నచ్చింది.

అహమ్మద్ షాపు మూసివేయటం యిష్టంలేదు ఒక్కరోజు షాపు మూసేసి నట్లయితే కొన్నివేల వ్యాపారం ఆగి పోతుంది.

"నేనీ మధ్యాహ్నమేషాపుకు వెళ్తాను. నువ్వు రోజూ ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం—మూడు సార్లువచ్చి వీళ్ళకు కావలసినవి ఇస్తూండు. మెహర్ ఇక్కడే ఉంటుంది యీ పది రోజులూ'' అన్నాడు అహమ్మద్ రజ్వీతో

రజ్వీకికూడా యీ హాస్పిటల్ వాతా వరణం బొత్తిగా రుచించలేదు అతని స్వభావానికి కొత్త పరిసరాలు, కొత్త మనుషులు సరిపడరు. ఆఖరికి తమ యింట్లోకూడా తన గదిలో, తనకు చిన్న నాటినుండి పరిచయమైన, వస్తువుల మధ్యనే రోజులో ఎక్కువభాగాన్ని గడుపు తాడు ఇల్లు, కాలేజీ తప్ప మరోలోకం తెలియదు తెలుసుకోవాలన్న ఆసక్తి కూడా అతనికి లేదు అతనికి స్నేహితులుకూడా అట్టేమంది లేరు. వాళ్ళని వ్రేళ్ళమీద లెక్కపెట్టవచ్చు అతని స్నేహితులలో చాలామంది పేదవారు, కష్టపడి చదివి మంచి మార్కులు తెచ్చుకునేవారూను.

ఈ విషయంమీద మెహర్ తమ్ము డితో కొన్నిసార్లు పోట్లాడిందికూడా. "ఈ ముష్టి వెధవలతో యేమిటి నీకు స్నేహం?' అంటూ.

"వాళ్ళు మనలా ఖరీదైన బట్టలు వేసుకోనంతమాత్రాన వాళ్ళను హీనంగా చూడకు. వాళ్ళకున్న తెలివితేటలకు, సంస్కారానికి ముందు నువ్వు, నేనూ యెందుకు పనికిరాము'' అనేవాడు రజ్వీ.

అతని స్నేహితులుకూడా అతని లాగానే ముభావంగా మాట్లాడతారు వాళ్ళ మదుకుదనమంతా వాళ్ళ మాటలలోకన్న యెక్కువవాళ్ళు చేసే పనులలోనే కని పిస్తుంది. వాళ్ళ యీడు పిల్లలందరిలాగా సినిమాలు, జల్సాలు అంటే వాళ్ళకి



యేవ

గట్టవు. ఎడాదికి ఏ నాలుగైదు సినిమాలో తప్ప చూడరు. "పాన్" నమలరు సిగరెట్లు త్రాగరు.

అలాటి మనుషులను చూస్తే మెహర్‌కి చాలా అసహ్యం. జీవితం ఒక ఆటస్థలం. మనుషులందరూ అందులో అవిరామంగా నవ్వుతూ, ఆడుతూంటేనే అందం అని ఆమె అభిప్రాయం ఆమె స్నేహితురాండ్రంతా కలవారి పిల్లలు. కలుపుగోరు స్వభావం గలవారు

రజీవ్ వెంటనే యింటికి వెళ్ళిపోయేడు. అహమ్మద్ కూడా కొంతసేపుండి, తరువాత షాపుకు వెళ్ళిపోయేడు.

మెహర్ ఒక్కతే తండ్రి దగ్గర మిగిలింది

పన్నెండు గంటలకు నౌకరు టిఫిన్ కారియర్‌లో భోజనం తీసుకువచ్చేడు భోజనంచేసి, తండ్రికి పళ్ళరసం త్రాగించి, మందువేసి తరువాత శ్రద్ధగా అలంకరించుకుంది మెహర్.

అప్పటికి పన్నెండున్నర అయింది. డాక్టర్ వచ్చేందుకు యింకా అరగంట టైము ఉంది.

బాబా నిద్ర పోతున్నాడు, మెహర్‌కి ఏమీ తోచక గది బయటకువచ్చి నిల్చుంది వార్డు నిండా వరుసగా ఎట్టిటి శాలువలు కప్పుకుని రోగులు పడుకునిఉన్నారు.

రాత్రి వాళ్ళను చూసి భయపడింది మెహర్, కాని యిప్పుడెందుకో భయంగా లేదు.

రాత్రిళ్లు ఎంతో భయంకరంగా కనపడే దృశ్యాలు తెల్లవారేక పట్టపగలు సూర్యకాంతిలో చూస్తే యెంతో సామాన్యంగా కనపడతయ్.

పైగా అయా పరిసరాలు పరిచయమై, అలవాటైపోయేక అవి సాధారణంగా కనిపిస్తయ్

మెహర్ అందుకే నిర్భయంగా చూస్తూ నిలబడింది, అక్కడ జనరల్ వార్డులో ఉన్న రోగులంతా పేదవారు, మధ్యతరగతివారే। అది బయటివాళ్లను హాస్పిటలులోకి రానిచ్చే సమయం అవటంవల్ల రోగులతాలూకు బంధువులు భోజనం, కాఫీ, రొట్టి మొదలైనవి తీసుకువచ్చి, రోగులప్రక్కనే కూర్చుని తినిపిస్తున్నారు.

వాళ్ళ దుస్తులు, వాళ్ళ ముఖాలలో తాండపిస్తున్న దైన్యభావం. విచారం అన్నీ చూస్తుంటే మెహర్‌కి అసహ్యం వేసింది. ఐనా కాలక్షేపంకోసం అక్కడే నిలబడింది వాళ్ళను చూసుకుంటూ

ఒంటిగంట అయేసరికి గణగణమంటూ బెల్లు మ్రోగింది ఆ బెల్లు రోగుల తాలూకు మనుషులను వెళ్లిపొమ్మనటానికి సూచన కాబోలు —— అందరూ ఆదరాబాదరా లేచి, మూటలు సర్దుకుని వెళ్ళిపోతున్నారు. ఇంకా వెళ్ళకుండా కూర్చున్నవాళ్ళని హాస్పిటల్‌లో పనిచేసే నౌకర్లు, గూర్ఖాలు తరిమి తరిమి పంపుతున్నారు.

విటమిన్లు మరియు ఖనిజములు మీ కుటుంబముయొక్క
ఆరోగ్యమునకు ఎంతో అవసరము

# వారికి తగినన్ని లభిస్తున్నాయా?



విటమిన్లు మరియు ఖనిజముల లోపముతో మీ కుటుంబపు ఆరోగ్యము పాడవవచ్చును. ఆలసట, బడలు, ఆకలిలేకపోవడము, నిరుత్సాహము, చర్మము మరియు పళ్ల బాధలు మొదలైనవన్నీ అవసరమైన విటమిన్లు మరియు ఖనిజముల లోపమువల్ల మామూలుగా కలుగుతాయి. అయినా విటమిను మరియు ఖనిజములను గురించి అశ్రద్ధ చేయబడుతుంది. ఎంతో జాగ్రత్తగా ఆలోచించి తయారుచేసిన ఆహారములో కూడ. సమృద్ధియైన ఆహారము సరియైన ఆహారము అనుటకు వీలులేదు. ఎన్నో రకముల ఆహారములలో కూడ విటమిన్లు మరియు ఖనిజములు లోపించవచ్చును. కనుక, మీ కుటుంబమునకు ఎంతో అవసరమైన విటమిన్లు మరియు ఖనిజములు తగు పరిమాణములలో లభిస్తున్నాయని ఎలా నిశ్చయము చేసుకోగలరు?

మీ కుటుంబములో ప్రతి ఒక్కరికి నిశ్చయముగా అవసరమైన పోషక పదార్థములు వారికి కావలసిన పరిమాణములలో లభించుటకు, వారికి విమ్‌గ్రాన్ — స్క్విబ్ వారి వివిధ విటమిన్లు మరియు ఖనిజములుగల బిళ్లలు యివ్వండి. రోజూ ఒక బిళ్ల చాలును. ఈ ఆరోగ్య సూత్రమును నేడే ఎందుకు అలవాటుచేసుకోకూడదు?

విమ్‌గ్రాన్‌లో పదకొండు ముఖ్యమైన విటమిన్లు మరియు ఎనిమిది ఖనిజములు ఉన్నాయి. పుష్కలమైన పరిమాణములో ఇనుము ఎర్ర రక్త కణములను వృద్ధిపొందిస్తుంది మరియు శక్తిని తిరిగి కలిగించుటలో సహకరించును. కేల్షియమ్ ఎముకలను మరియు పళ్లను బలిష్టముగా ఉంచుతుంది. విటమిను సి జలుబు రాకుండా ఆపుతుంది. విటమిను ఎ దృష్టిని బాగుగా మరియు చర్మమును ఆరోగ్యవంతముగా ఉంచుతుంది. విటమిను B-12 ఆకలిని అధికము చేస్తుంది మరియు సహనశక్తిని కలిగిస్తుంది.— ఇంకా, మీ కుటుంబముయొక్క ఆరోగ్యమునకు ఎంతో అవసరమైన యితర ముఖ్యమైన పోషక పదార్థములు ఉన్నాయి.

# విమ్‌గ్రాన్®

వివిధ విటమిన్లు మరియు ఖనిజములుగల బిళ్లలు

## 11 విటమిన్లు మరియు 8 ఖనిజములు కలది.

## ఒకే ఒక విమ్‌గ్రాన్ మిమ్మల్ని రోజంతా శక్తివంతముగా ఉంచుతుంది.

SQUIBB SARABHAI CHEMICALS

Shilpi HPMA-25A/11 Tel

వాళ్ల సద్దు మణుగుతుండగానే అల్లంత దూరంలో డాక్టర్ రవీంద్ర ఆకారం కన పడింది మెహర్‌కి

అతనిని చూస్తూనే ఆమె గుండె దడ దడలాడింది

తడబడే అడుగులతో లోపలికి వెళ్లి బాబా మంచంమీద కూర్చుంది

కొద్ది క్షణాలలో మెత్తగా బూట్లు చప్పుడు చేసుకుంటూ డాక్టర్ రవీంద్ర వచ్చేడు.

మెహర్ చటుక్కున లేచి నిలబడింది.

"హలో!" అన్నాడు డాక్టర్

మెహర్ బిడియంగా నవ్వింది

"బాబా నిద్రపోతున్నారా?"

"ఔను " అన్నట్లు తలూపింది

"మీరొక్కరే ఉన్నట్టున్నారు "

మెహర్ తలవంచుకుంది,

"ఏమిటలా మౌనంగా నిల్చున్నారు? మీకు మాటలు రావా?' చక్కిలిగింతలు పెట్టినట్లు అతని మాటలు ఆమెని పకపక నవ్వించినయ్

"మీరు నవ్వుతుంటే మీ అందం భరించలేనంత గొప్పగా ఉంది" అన్నాడు రవీంద్ర

మెహర్ ముఖంనిండా రక్తం చిమ్మింది ఎఱ్ఱగన్నేరు మొగ్గలా సిగ్గుతో ముడుచుకుపోతూంది ఆమె శరీరం

"సరే! మీకు మాట్లాడటానికి బిడి యంగా ఉన్నట్లుంది నేను వెళ్తాను" అంటూ లేచేడు రవీంద్ర

మెహర్ గుండె దడదడలాడింది.

పొడుగాటి కనురెప్పల వెంట్రుకలు అల్లల్లాడినయ్

"బై బై! మళ్ళీ రేపు ఉదయమే రావటం" అంటూ గుమ్మంవైపుకు నడచేడు డాక్టర్ రవీంద్ర!

మెహర్ కంఠం పెగలిరాలేదు

నిస్సహాయంగా అతనివైపే చూస్తూ నిల్చుంది

గుమ్మంవరకు వెళ్ళి ఒకసారి వెను దిరిగి చూసేడు రవీంద్ర

"మీరేమి అనుకోనంటే ఒకమాట చెప్పనా?" అన్నాడు

మెహర్ కళ్ళు ప్రశ్నార్థకంగా అతని వంక చూసేయి

"నామీద కోపం తెచ్చుకోకూడదు. నన్ను అపార్థం చేసుకోకూడదు సరేనా?"

"సరే" నన్నట్లు తలూపి, కుతూ హలంగా అతనివంక చూసింది

ఆమె ముఖంలోకి తదేకంగా కొద్ది క్షణాలపాటు చూసి తొణకకుండా అన్నాడు రవీంద్ర, "మీ అంత అందమైన అమ్మా యిని నా జీవితంలో ఎప్పుడూ చూడ లేదు" అలా అని వెంటనే వడివడిగా అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయేడు డాక్టర్

మెహర్ పాలరాతి శిల్పంలా నిలబడి పోయింది

# 4

డాక్టర్ రవీంద్ర వెళ్ళిన తరువాత ఆ వాక్యమే పదే పదే ఆమె గుండెలో ప్రతిధ్వనించసాగింది. "మీ అంత అందమైన అమ్మాయిని నా జీవితంలో చూడ లేదు."

నిజంగా తానంత అందంగా వుందా? తను అందంగా వుంటుందని తనకి తెలుసు. కాని ఆ విషయాన్ని ఒక పురుషుడి నోటివెంబడి వినటం అదే ప్రథమం. అందుకే ఆ వాక్యం సూటిగా ఆమె గుండెలో ప్రవేశించి, కలవరం రేప సాగింది.

బాబా నిద్రపోతుంటే మెహర్ గదిలో అసహనంగా అటూ ఇటూ పచార్లు చెయ్య సాగింది.

మాటిమాటికీ అద్దంముందు నిలబడి, తన ప్రతిబింబాన్ని చూసుకోవటం మొదలెట్టింది. ఎన్నడూ కనపడని అందమేదో ఆ రోజు కొత్తగా తన ముఖంలో కనపడింది మెహర్‌కి.

తనలో అంతటి అద్భుతమైన సౌందర్యం ఉన్నదా అని తానే ఆశ్చర్యపోయింది.

బయట జనరల్ వార్డులో రోగులు దాయాలు రణగొణ ధ్వనిచేస్తూ మాట్లాడుకుంటున్నారు మధ్య మధ్య నర్సుల బూట్ల చప్పుళ్ళు స్ట్రెచర్‌మీద యెవరో పేషెంటును తీసుకువెళ్తున్న చప్పుడు మొదలైన ధ్వనులు వినపడుతున్నాయి. ఆ ధ్వనులన్నిటికీ మధ్య స్పెషల్ రూములో నిశ్శబ్దంగా ఉన్న పరిసరాలలో అసహనంగా తిరుగుతోంది మెహర్.

ఎందుకో అంతకుముందు జీవితంలో యెన్నడూ కలగని అలజడి యీ రోజు ఆమెలో కలుగుతోంది. ఈ డాక్టర్ రవీంద్రకూ తనకూ యేనాటి అనుబంధమో కాని తొలిచూపులోనే అతని రూపం తన హృదయ ఫలకంమీద గాఢంగా ముద్రించుకు పోయింది. ఎంతగా ప్రయత్నించినా ఆ ముద్రను చెరపలేక పోతోంది.

తమ యిద్దరి పరిచయం కొన్నిగంటల కాలంది. తాము మాట్లాడుకున్న మాటలు, తాము ఒకచోట కలిసివున్న క్షణాలు వేళ్ళమీద లెక్కపెట్టవచ్చు. ఐనా తామిద్దరూ యెంతోకాలంగా ఒకరి నొకరు ఎరుగుదురనీ, తామిద్దరి పరిచయం అతి సహజంగా అనివార్యంగా జరిగిపోయిందనీ ఆమె కనిపించింది. కాసేపటికి గఫర్‌ఖాన్ మేల్కొన్నాడు.

"బేటీ! ఎందుకలా తిరుగుతావు? కాసేపు పడుకోరాదూ?" అతని వాక్యాలు ఆమె హృదయాన్ని స్పృశింపజేసినయ్.

"బాబా!" అంటూ మంచం మీద కూర్చుని అతని ఛాతీమీద తలావించింది మెహర్

"ఏమిటిబేటీ! ఎందుకలా ఉన్నావు?" ఆమె వెంట్రుకలను లాలనగా నిమురుతూ అన్నాడు తండ్రి



టానిక్ ఏదైనా ఆకలిని మాత్రమే పెంచగలిగితే
అది సగం పనిని మాత్రమే చేసినట్లు అవుతుంది




*
ఇన్‌క్రిమిన్ దానితో చేర్చండి...
పెరుగుదల నిమ్ము ఆకలి పొందండి!
పెద్ద పిల్లలకు (ఐరన్‌తో కూడిన)
ఇన్‌క్రిమిన్ సిరప్— 175 మి.లీ 57 మి. లీ.
ఇన్‌క్రిమిన్ డ్రాప్స్ పసి బిడ్డలకు 10 మి. లీ.




# *ఇన్‌క్రిమిన్

టానిక్

*అమెరికన్ సయానమిడ్ కంపెనీ వారి రిజిష్టర్డ్ ట్రేడ్ మార్కు

Lederle

అన్ని మందుల షాపుల్లో లభించుచున్నది

లింటాస్-INC. 21-500 TL

"బాబా! నా కెందుకో భయంగా ఉంది" అంటూ ఏడ్చేసింది మెహర్.

"పిచ్చితల్లి యెందుకలా ఏడుస్తావు? నా కిప్పుడేమయింది? నా ఆరోగ్యం బాగానే ఉంది. మరో పది రోజులు గడవనీ....నీ బాబా నీతో కలిసి రోజూ ఉదయం 'వాకింగ్'కి వస్తాడు సరేనా?"

ఐనా ఆమె యింకా ఏడుస్తూనే ఉంది.

"ఏడవకు బేటీ! ఏడవకు. నేను చచ్చిపోతానని దిగులుపడకు నే నంత త్వరగా చచ్చిపోనులే! నా చిట్టి తల్లి ఒకయింటి యిల్లాలై. దాని కడుపున ఒకకాయ కాసే దాకా నే నెక్కడికి పోతాను? నా మనవణ్ణి ఎత్తుకోకుండా నేను స్వర్గానికి కూడా పోలేను తెలుసా?" అన్నాడు.

మెహర్ తనకి తెలియకుండానే చాలా సేపు వెక్కి వెక్కి యేడ్చింది తానెందుకు ఏడుస్తున్నదో ఆమెకే తెలియదు. ఆ ఏడుపును నిగ్రహించుకునే శక్తికూడా ఆమెకు లేదు. అందుకే తనివితీరా ఏడ్చి, అలసిపోయి, బాబా పక్కలో నేప డుకుని నిద్రపోయింది మెహర్.

సాయంత్రం నాలుగు గంటలకు రజీవ్ వచ్చి నిద్ర లేపేవరకు ఆమెకు మెలకువ రానేలేదు.

రాత్రల్లా నిద్రలేకపోవటం వల్ల రెండు గంటలసేపు వళ్లు మరచి నిద్రపోయింది మెహర్. హఠాత్తుగా తమ్ముడు నిద్ర లేపటంతో ఆమెకు త నెక్కడ ఉన్నది కూడా మొదట తెలిసిరాలేదు.

ఎదురుగా మంచంమీద పడుకుని ఉన్న బాబా, రజీవ్ చేతిలోని ఫ్లాస్కు, కారియర్, ఆ రూములోని వస్తువులూ, మందులవాసన అన్నీ ఆమెకు తానున్న పరిసరాలను గురించి జ్ఞప్తికి చేసినయ్.

నిద్రపోయింది కాసేపే అయినా గాఢంగా నిద్రించటం వల్ల మెదడిప్పుడు ప్రశాంతంగా ఉంది.

రజీవ్ ఆమెకోసం తెచ్చిన ఫలహారం, చాయ్, బాబాకోసం తెచ్చిన పళ్ళు ఆమెకిచ్చి, "అన్నయ్యా, అమ్మ రాత్రికి వస్తారు" అని చెప్పి వెళ్ళిపోయేడు.

ఫలహారాన్ని చూసేసరికి ఆమెకు అప్పు రావురుమంటూ ఆకలి వేసింది. వెంటనే తినటం పూర్తి చేసి, వేడివేడి టీ త్రాగింది.

బాబాకి పళ్ళరసం పట్టింది.

తరువాత ముఖం సబ్బుతో కడుక్కుంది.

ఆమె మనసిప్పుడు చాలా తేలికగా ఉంది. రాత్రినుండి ఆమె మెదడును ఆవరించిన గజిబిజి ఆలోచనలు యిప్పుడామెలో లేవు.

రాత్రి బాబా ప్రాణాపాయంలో ఉన్నాడన్న భయాందోళనలు, ఎన్నడూ అడుగు పెట్టని జనరల్ హాస్పిటల్‌లో అడుగు పెట్టటం, రాత్రల్లా తండ్రి దగ్గర, కొత్త వ్యక్తుల మధ్య కూర్చోవటం యివన్నీ ఆమె మెదడు తన సహజ స్వభావాన్ని కోల్పోయేటట్లు చేసినయ్ ఇంతసేపూ

తా నొక అయోమయావస్థలో ఉంది. అందుకే ఆ సమయంలో డాక్టర్ రవీంద్ర రూపం అద్భుతంగా కనిపించింది తనకి. అతని ప్రవర్తన తనని సమ్మోహితురాలిని చేసింది.

కాని యిప్పుడు గాఢంగా నిద్రపోయి, ఫ్రెష్‌గా లేచేసరికి తాను మామూలు 'మెహర్'గా మారిపోయింది. డాక్టర్ రవీంద్రకు అనవసరమైన ప్రాముఖ్యతను కలిపించి తానే మనసు పాడు చేసుకుంది.

అదంతా తల్చుకుంటే కొంచెం సిగ్గనిపించింది మెహర్‌కి. "బాబా! ఇప్పుడే అలా వెళ్ళివస్తాను" అని తండ్రికి చెప్పి బయటకు నడచింది మెహర్.

వరుసగా పడుకుని ఉన్న రోగుల మంచాల మధ్యగా నడుచుకుంటూ ఆవార్డు పొడుగునా తిరిగింది. కళ్ళు మిరుమిట్లు గొలిపే సౌందర్యంతో, ఆ సౌందర్యానికి మెరుగులు దిద్దుతున్న ఖరీదైన దుస్తులతో ఉన్న ఆ మహమ్మదీయ బాలిక ఎవరా అని రోగులు, నర్సులు అంతా ఆమె వంక విస్మయంగా చూడసాగేరు.

వాళ్ళ చూపులను గమనించిన మెహర్ మనసులో గర్వరేఖలు కదలాడినయ్. వెంటనే "మీ అంత అందమైన అమ్మాయిని నా జీవితంలో చూడలేదు." అన్న రవీంద్ర వాక్యం గుర్తుకు వచ్చింది ఆమెకు.

ఆ వాక్యం గుర్తుకు రాగానే మళ్ళీ ఆమె మనసు కలవరపడింది

"ఛీ! నా మనసెందుకిలా వశం తప్పుతోంది? డాక్టర్ ఎవరు? తనెవరు? బాబాకి నయం కాగానే యీ హాస్పిటల్ నుండి తానువెళ్ళిపోతుంది. మళ్ళీ జన్మలో డాక్టరును చూస్తుందో లేదో! ఈ కొద్ది రోజుల అనుబంధంకోసం తన మనసెందుకిలా చలించిపోతోంది?" అనుకుంది.

మళ్ళీ వెంటనే ఆమె మనసంతా చికాగ్గా అయిపోయింది. అంతకు క్రితం కొద్ది గంటలపాటున్న ప్రశాంతత కాస్తా చెదరిపోయింది. వార్డు చివరన పిట్టగోడ దగ్గర నిలబడింది మెహర్.

ఎదురుగా మూసీనది. మూసీనదిని అనుకుని అందమైన పార్కు. నదికి అవలి గట్టున హుందాగా నిలబడిన హైకోర్టు, సిటీ కాలేజీ భవనం, చిరుచీకట్లో ఎంతో గొప్పగా కనపడుతున్నయ్. మూసీనది మీదుగా వస్తున్న చల్లని గాలులు ఆమె ముఖాన్ని మృదువుగా స్పృశిస్తున్నయ్. ఆమె 'పల్లూ'తో దాగుడుమూత లాడుతూ, దానిక్రింద ఉన్న ఆమె హృదయంలోని నులివెచ్చని కోర్కెలను తట్టి లేపుతున్నయ్ ఆ శీతల వాయువులు.

అలా ఎంతసేపు అక్కడ నిలబడిందో ఆమెకే తెలియదు. "హల్లో!" అన్న మాట విని ఉలికిపడి చూసింది మెహర్.

ఆమె ప్రక్కనే అరడుగు దూరంలో డాక్టర్ రవీంద్ర నిలబడ్డాడు. 'మీరా!' అన్నది ఆశ్చర్యానందాలు మిశ్రితమైన

స్వరంతో "చీకట్లో యిక్కడ ఒంటరిగా నిలబడి యేం చేస్తున్నారు?" ఆ చీకటిలో ఆమె కళ్ళలోని భావాలను చదవటానికి ప్రయత్నం చేస్తూ ఆమెవైపుకు కొంచెం వంగి అడిగేడు.

అతని దుస్తులకున్న సెంటు వాసనలతోపాటు కలసివచ్చిన 'మగవాసన' ఆమెనుక్కిరి బిక్కిరి చేసింది.

అతనిముందు నిల్చున్నప్పుడల్లా తను నూటికి నూరుపాళ్ళ స్త్రీ అన్న ఫీలింగు కలుగుతోంది మెహర్‌కి.

మాస్క్యులిన్‌గా అందంగా ఉన్న అతని రూపాన్ని చూస్తూనే తన మనసు వెన్నముద్దలా మారిపోతోంది.

"ఏమిటి మాట్లాడరు? సారీ! మీ ఏకాంతతను భగ్నం చేసినట్లున్నాను." చిలిపిగా నవ్వేడు డాక్టర్.

డాక్టర్ నవ్వు ఎంత అందంగా ఉంది! అనుకుంది మెహర్.

"సరే! మీరు చూస్తుంటే ఏదో స్వప్నలోకంలో ఉన్నట్లున్నారు. ఇంక నేను వెళ్తాను. ఇంత కష్టపడి మిమ్మల్ని చూట్టానికని, డ్యూటీ లేకపోయినా వస్తే, మీరు నోరన్నా విప్పటం లేదు. నేను పోతాను, మీరు నిల్చుని చక్కగా కలలు కంటూ ఉండండి." అని వెను దిరిగేడు రవీంద్ర.

"ఆగండి" స్వచ్ఛమైన తెలుగులో ఆమె అన్నమాటకు ఆగిపోయి, ఆమె వంక ఆశ్చర్యంగా చూసేడు. "ఏమిటి, మీకు తెలుగు వచ్చా?" అన్నాడు.

"ఓ! మీకెంత వచ్చో, నాకూ అంత తెలుగు వచ్చు." ఆ మహమ్మదీయ బాలిక తెలుగులో మాట్లాడుతుంటే విన టానికి ముద్దుగా ఉంది.

"ఎంత చక్కగా మాట్లాడుతున్నారు! మీ నోటివెంబడి వింటుంటే తెలుగులో యింత మాధుర్యం ఉందా అని నాకే ఆశ్చర్యంగా ఉంది" అన్నాడు రవీంద్ర.

"ఒక్క తెలుగే కాదు. అన్నిభాషలూ మధురంగానే ఉంటయ్. ఐతే పొరుగింటి పుల్లకూర సామెతలా మనం ఎంతసేపూ యితర భాషలలోని అందాన్ని వెతుకుతామే తప్ప మాతృభాషను గురించి ఎన్నడూ ఆలోచించనే ఆలోచించము" అన్నది మెహర్.

"అమ్మో! పైకి చూస్తుంటే మీ రెంతో అమాయకంగా కనిపిస్తారు. కాని లోపల యిన్ని ఆలోచనలుంటాయని యెవరూ అనుకోరు."

"నేను ఇంటిలో గారాబంగా పెరగటంవల్ల యిప్పటికీ నా ముఖంలో, చేష్టలలో పసితనం తొంగిచూస్తూంటుంది. కాని అంతరంగంలో నేను పరిపూర్ణ యువతిని. నా వయసుకు తగ్గ ఆలోచనలు నాకూ వస్తుంటయ్...." అని చప్పున ఆగిపోయినది,

"నేను పరిపూర్ణ యువతిని...." అన్న వాక్యం ఆమె నోటినుండి వెలువడగానే ఏదో అద్భుతమైన సత్యాన్ని

యువ

గ్రహించినవాడిలా ముఖం పెట్టేడు రవీంద్ర. అతని ముఖంలోని భావాలను చదవగలిగిన మెహర్, "నేను నోరు జారలేదు గదా!" అని కంగారుపడింది.

ఆమె అలా కంగారు పడుతుంటే అతనికి యింకా చూడ బుద్ధి అయింది.

"ఆఁ....యింతకీ మీరు డ్యూటీ లేక పోయినా ఎందుకు వచ్చేరో చెప్పనే లేదు!" అంది మెహర్.

వాళ్ళ సంభాషణంతా తెలుగులోనే సాగుతోంది.

"ఇంతకీ మీకు యింత చక్కని తెలుగు ఎలా వచ్చిందో చెప్పనేలేదు" యెదురుప్రశ్న వేసేడు డాక్టర్.

"నేను సమాధానం చెపితేగాని మీరు చెప్పరన్నమాట!"

"అన్నమాటే!"

"ఐతే మొత్తానికి గడుసువారే!"

"కాక?"

"సరే. చెప్తాను, వినండి. మేము చాలా తరాలుగా ఆంధ్రదేశంలో స్థిరపడి పోయినవాళ్ళం. మాది తూర్పుగోదావరి జిల్లా. మేమున్నది చిన్నపట్టణం. అక్కడ ఏ పది, పదిహేను కుటుంబాలో మహమ్మ దీయులవి. మిగతావాళ్ళందరూ తెలుగు వాళ్ళే అవటంవల్ల మా యింట్లో అందరికీ తెలుగు బాగా వచ్చు. నేను ఎనిమిదవ క్లాసు చదువుతున్నపుడు మేము హైద్రా బాద్ వచ్చేసేం. ఇక్కడకు వచ్చేక మా నాన్న వ్యాపారంలో బాగా డబ్బుగడించి. జంటనగరాల్లోని శ్రీమంతులలో ఒక డైనాడు. చిన్నతనంనుండి తెలుగువాళ్ళ మధ్య పెరగటంవల్ల నాకు ఉర్దూకన్న యెక్కువగా తెలుగే వచ్చేది. నిజానికి మంచి ఉర్దూ మాట్లాడటం నాకు వచ్చింది యీ హైద్రాబాద్ వచ్చిన తరువాతనే! ఇప్పుడు కాలేజీలో నా స్నేహితురాళ్ళలో చాలామంది తెలుగువారే."

"చాలా చిత్రంగా ఉందే!" ఐతే యికనుండి నేను మీతో తెలుగులోనే మాట్లాడతాను. మరి మీ అన్నయ్యావా ళ్ళందరికీకూడా తెలుగు వచ్చా?"

"ఆఁ బాగానే వచ్చు. కాని యీ హైద్రాబాద్ వచ్చేక తెలుగు మాట్లాడటం పూర్తిగా మానివేసేరు. తెలుగువాళ్ళతో కూడా వాళ్లు ఉర్దూలోనే మాట్లాడతారు. పైగా తమకి తెలుగు వచ్చునని యితరు లెవరికైనా తెలిస్తే అది చాలా నామోషీ విషయం అన్నట్లు ప్రవర్తిస్తారు మా యింట్లోనివాళ్లంతా. ఎందుకో నాకే అర్థం కాదు" అన్నది మెహర్.

"ఈ హైద్రాబాద్‌లో మహమ్మ దీయులే కాదు, చాలామంది తెలుగువాళ్లు కూడా తెలుగు మాట్లాడరు ఉర్దూ మాట్లా డ్డమే ఫాషన్ అనుకుంటారు. తమ మాతృభాషమీద వారికే అభిమానం లేనపుడు యితర జాతివారికి ఆ భాషమీద గౌరవం యెందుకుంటుంది?" అన్నాడు డాక్టర్ రవీంద్ర.

"దీనికి కారణమేమంటారు?" అనడి

గింది మెహర్.

"అంత నిగూఢమైన కారణాలేవీ కావు. హైద్రాబాద్ కొన్ని వందల సంవత్సరాలుగా మహమ్మదీయుల పాలనలో ఉండటంవల్ల. ఉర్దూ రాజభాషగా వ్యవహరింపబడటంవల్ల తెలుగువాళ్లందరూకూడా ఉర్దూభాషను నేర్చుకోవటం, మాట్లాడటం ఒక గొప్ప విషయంలా భావించేవారు. నవాబుల పరిపాలన అంతమొందినా, యింకా ఉర్దూ ప్రభావం మాత్రం పూర్తిగా పోలేదు. రాజకీయ స్వాతంత్ర్యం వచ్చినా, తెలంగాణాలోని తెలుగుజాతిని యింకా భాషాదాస్యం, భావదాస్యం మాత్రం వదలలేదు."

"ఐతే మాతృభాషను కాక యితర భాషలను నేర్చుకొన్నంతమాత్రం అది దాస్యభావాన్ని సూచిస్తుందంటారా?" మెహర్ అతని ముఖంలోకి తదేకంగా చూస్తూ అడిగింది.

"పరభాషలను నేర్చుకోవటం, అందులో ప్రావీణ్యతను సంపాదించటం, తప్పని నే ననను. కాని మాతృభాషను మరచిపోయి, పరభాషను స్వంతం చేసుకొనటంలో అర్థంలేదు. తనభాషను, తన జాతిని తీర్చి దిద్దుకొన్న తరువాతనే యితర భాషలను గురించి ఆలోచించాలి ఎవరైనాను. ఇలా అంటున్నందుకు మీకేమీ కోపం రాదనుకుంటాను" అన్నాడు డాక్టర్.

"నాకు మీ మాటలు వింటుంటే ఆనందంగా ఉంది. ఐతే ఒక్కమాట. నేను మహమ్మదీయురాలినైనా తెలుగుదేశంలో పుట్టి పెరగటంవల్ల ఉర్దూకన్న ఎక్కువగా తెలుగుభాష బాగా వస్తుంది, నాలో ఎంతో తెలుగుదనం ఉన్నదని నా కనిపిస్తుంది. అసలా గోదావరి సీటిలోనే ఉందేమో ఆ తెలుగుదనం. అందుకే కాబోలు నాకలా తోస్తోంది ఐతే మీ సిద్ధాంతం ప్రకారం నేను నా మాతృభాషకు ద్రోహం చేస్తున్నట్లేగా?"

"మీరు చాలా గడుసువారిలా ఉన్నారే!" నవ్వేడు రవీంద్ర.

"నిజాన్ని నిక్కచ్చిగా చెప్పేవాళ్ళందరూ గడుసుగానే కనిపిస్తారు. ఇంతకీ నా ఉద్దేశ్యమేమిటంటే యీ భాషలు, మతాలు యివేవీ మనుషులను సంకుచితపరచకూడదు. ఒక వ్యక్తి మాట్లాడే భాషమీద రాజకీయ, సాంఘిక, భౌగోళిక కారణాలెన్నో ప్రభావాన్ని కలిగిఉంటయ్. ఒకప్పుడు భారతదేశం ఆంగ్లేయుల పరిపాలనక్రింద ఉన్నపుడు ఇంగ్లీషు మాట్లాడటం ఎంతో ఫ్యాషన్‌గా భావించేవాళ్ళు. ఇప్పటికీ మనదేశంలోని ఏ రాష్ట్రం వారైనా ఇంగ్లీషు మాట్లాడటం గొప్ప విషయంగా భావిస్తున్నారు. అలాగే నవాబుల పాలనలో ఉన్న తెలంగాణా ప్రజలు ఉర్దూభాషను గౌరవించటంలో ఆశ్చర్యం లేదు. విద్యాధికులైన మీరంతా బయటి సొసైటీలోకి వచ్చినపుడు ఇంగ్లీషుభాషను ఎలా మాట్లాడుతున్నారో అలాగే కొందరు

ఉర్దూలో మాట్లాడుతున్నారు అన్నది మెహర్.

"ఇలా ఎవరికి వారు తమని సమర్ధించుకుంటూ పోతుంటే తెలుగుభాష ఎప్పుడో ఒకప్పుడు పతనమై పోతుందేమోనని నాకు భయంగాఉంది. అందుకే పరభాషా వ్యామోహంనుండి తెలుగువారికి విముక్తి కలిగితే తప్ప తెలుగు భాష, తెలుగు సంస్కృతి స్థిరత్వాన్ని పొందలేవు "

"అందుకే ప్రాంతీయభాషను రాష్ట్రభాషగా మార్చి, బోధనావిధానం ప్రాంతీయ భాషలలోనే జరిగేటట్లు ప్రభుత్వంవారు కృషిచేస్తున్నారు కదా! మాతృభాషతోపాటు ప్రతి భారతీయుడు, మరొక భారతీయ భాషను, ఆంగ్లభాషనుకూడా తప్పని సరిగా నేర్చుకున్నట్లయితే అతని మానసిక పరిధులు విశాలమయేందుకు అవకాశం కలుగుతుంది."

"మీలో యిన్ని తెలివితేట లున్నా యనుకుంటే వింటూకూడా నేను నమ్మలేక పోతున్నాను" అన్నాడు రవీంద్ర.

"ఏం? నేనంత 'బుద్దూ' (చవట) లా కనపడుతున్నానా?" చిరుకోపం నటిస్తూ అన్నది మెహర్.

"అబ్బే! అదేం కాదు. మిమ్మల్ని, మీ బ్రదర్స్‌ని, మీ బాబాని అందరినీ చూస్తే ఎంతో సాంప్రదాయ కుటుంబం నుండి వచ్చినవారిలా, యిలాటి విషయాలేమీ పట్టించుకోనివారిలా కనపడ్డారు. ముఖ్యంగా మీరెంతో అమాయకంగా, నెమ్మదిగా కనబడ్డారు" అన్నాడు రవీంద్ర.

"నాలో నెమ్మదితనం అనేది ఏ కోశానా లేదు. చాలా దుడుకుస్వభావం నాది. ఆ సంగతి నాకు తెలుసు. ఇకపోతే నా తెలివితేటల సంగతి అంటారా? ఒక రకంగా నేను చాలా తెలివైనదానినే! కాని నేను నా తెలివితేటలను ప్రదర్శించుకోవటానికి అనుకూలమైన వాతావరణం మా యింట్లో కాని, నా స్నేహితులమధ్య కాని నాకు లభించదు. మా నాన్న, అమ్మ వృద్ధులు. పూర్వకాలం మనుషులు. మా అన్నయ్య కెప్పుడూ వ్యాపారం గొడవ తప్ప మరోధ్యాస లేదు. మా వదినకు తన అలంకరణలు, పిల్లడి పోషణ, సినిమాలు, పార్టీలు తప్ప మరో లోకంతో పనిలేదు, ఇక మా తమ్ముడు రజ్వీ నేను చేసిన ప్రతి పనినీ, నా నోటినుండి వచ్చిన ప్రతి మాటనీ ఖండించటమే తన జీవితలక్ష్యం అన్నట్లు ప్రవర్తిస్తుంటాడు. నాతో చదివే కాలేజీ అమ్మాయిలకు సినిమా హీరోల అందాన్నిగురించి, హీరోయిన్ దుస్తులను గురించి తప్ప మాట్లాడటానికి మరో టాపిక్ దొరకదు. అందుకే నా మనసులోని భావాలను చెప్పుకునేందుకు నాకెవ్వరూ కనపడరు. ఈ రోజు మీముందు మొదటిసారిగా మాట్లాడుతున్నాను" అంది. అలా అంటుంటే ఆమె ముఖం యెంతో దిగులుగా ఉంది.

ఆమెని నవ్వించాలనే ఉద్దేశ్యంతో

"ఇంతకీ నా ప్రశ్నకు సమాధానంగా చేట భారతం చెప్పుకుంటూ పోయేరు కాని మీ రడిగిన ప్రశ్ననే మర్చిపోయేరు' రవీంద్ర.

"ఓ! నిజమే! అన్నట్టు డ్యూటీ లేక పోయినా మీరీ సమయంలో హాస్పిటల్‌కి ఎందుకు వచ్చినట్లు?"

"ఈ దేవిగారికోసం' ఆమె కళ్ళలోకి చిలిపిగా చూస్తూ అన్నాడు డాక్టర్.

అతని చొరవకు విస్తుపోయింది మెహర్.

పట్టుమని ఇరవై నాలుగు గంటల పరిచయమన్నాలేని స్త్రీతో ఒక విద్యాధికు డలా మాట్లాడుతుంటే ఏమనుకోవాలి? అది తెలివితక్కువ తనమా? తలబిరుసా?

ముడివడిన ఆమె కనుబొమలను చూసి కొద్దిగా జంకేడు రవీంద్ర.

వెంటనే సర్దుకుని "దేవిగారు క్షమించాలి. కోపం తెప్పించినట్లున్నాను!" అన్నాడు.

'కోపంకన్న ఎక్కువగా మీ ప్రవర్తన నా కెంతో ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది" అన్నది మెహర్.

"అందాన్ని ఆరాధించటం నాకు జన్మతో అబ్బిన లక్షణం. నేను డాక్టర్‌నే కాదు. కళాకారణ్ణి కూడా. సృష్టిలోని అందమైన ఏ వస్తువును చూసినా నా మనసు పరవశించి పోతుంది. నిన్న అర్ధ రాత్రి భయాందోళనలతో విహ్వలమైన మీ ముఖం నా హృదయంలో చెరగని ముద్రవేసింది. ఈ రోజు ఉదయం మంచి దుస్తులలో, ఫ్రెష్‌గా చూసేను మిమ్మల్ని. ఐనా రాత్రి మొదటిసారి చూసిన ముఖమే నా మనసులో స్థిరంగా ఉండిపోయింది.

ఈ రోజు ఇంటికి వెళ్ళిన తరువాత భోజనం చేస్తున్నపుడు మధ్యాహ్నం విశ్రాంతి తీసుకున్నపుడు, సాయంత్రం షికారుకు వెళ్ళినపుడు ప్రతిక్షణం ఆరూపే నా కళ్ళముందు కదలసాగింది. మీ ముఖం లోని ఫీచర్సు ఎంత అందంగా ఉంటాయో ఆ ముఖంలోని భావముద్ర కూడా అంత ఆర్టిస్టిక్‌గా ఉంటుంది. నిజంగా అదొక గిఫ్ట్ అనే అనాలి ఇక నిగ్రహించుకో లేక మీ దగ్గరకు పరుగెత్తుకు వచ్చాను. మీరీ హాస్పిటల్‌లో వారం పది రోజుల కంటే యెక్కువగా ఉండరు. ఈ సమయాన్ని వృధాపోనీయటం నా కిష్టంలేదు ప్రతిరోజూ సాయంత్రం పూట మీకు సన్నిహితంగా ఉండి మీ ముఖాన్ని, మీ ఫిగర్‌ని నిశితంగా పరిశీలించి, యింటికి వెళ్ళేక మీ బొమ్మను గీయాలని నే ననుకుంటున్నాను. దయచేసి నా ఈ కోరికను మీరు మన్నిస్తారనుకుంటాను. ఒక డాక్టర్‌గా, ఒక అపరిచిత పురుషుడిలా కాదు — ఒక కళాకారుడిగా, చిత్రకారుడిగా మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను ”

అతని మాటలు వింటుంటే యేదో స్వప్నలోకంలో ఉన్నట్లుగా అనుభూతి కలగసాగింది మెహర్‌కి.

తల ప్రక్కకు తిప్పి బయటకు దృష్టి సారించింది. ఎదురుగా ప్రశాంతంగా ప్రవహిస్తున్న మూసీ నది ఆ వెనుక

ఎత్తైన భవనాలు....ఒకపక్క మస్లిం జంగు పూల్, మరొక పక్క నయా పూల్....ఆ రెండు వంతెనలమీద ప్రవాహంలా కదలిపోతున్న జనసందోహం... వీటన్నిటిపైన నిశ్చలంగా, నిర్వికారంగా నిల్చిన ఆకాశం...వీటిముందు తన ఉనికి, తన జీవితకాలం యెంతో అస్థిరంగా, క్షణికంగా అనిపించింది మెహర్‌కి.

తన ఎదురుగా ప్రకృతితో చేతులు కలిపి, మానవుడు నిర్మించిన ఒక మహా ప్రపంచం. ఇవతల తనూ, డాక్టర్ రవీంద్ర. ఏమిటి తమ యిద్దరి అనుబంధం?

నిన్న యీ సమయంవరకు డాక్టర్ రవీంద్ర అనే వ్యక్తి యీ ప్రపంచంలో ఉన్నాడన్న విషయమే తనకి తెలియదు. కాని యీరోజు తన దగ్గరగా నిలబడి తన మనసులోకి అంతకన్న సన్నిహితంగా చొరబడి తన అస్తిత్వాన్ని పూర్తిగా వశపరచుకోవటానికి ప్రయత్నిస్తున్నాడు. ఎందుకు తన మనసిలా బలహీనమై పోతోంది? తను అతని మాటను కాదనలేక పోతోందెందుకు? ఎందుకు? ఎందుకు?

"మిస్....ఏమిటి ఆలోచిస్తున్నారు? మీకు నామీద కోపం వచ్చినట్లుంది. క్షమించండి. ఇంక ఎప్పుడూ మీముందు అలా మాట్లాడను. నేను వెళ్ళిపోతాను..."

అని రెండడుగులు వెనక్కి వేసేడు రవీంద్ర.

"డాక్టర్... ప్లీజ్.... వెళ్ళకండి—" ఆమె చేతిని ముందుకు చాపి అతనిని వారిస్తున్నట్లుగా అంది.

"మీకు కోపం రాలేదని చెప్తేగాని నేనుండను."

"నాకు కోపంరాలేదు. సరేనా?"

'థాంక్స్. ఐతే యీ రాత్రికే మీ బొమ్మ గీయటం ప్రారంభిస్తాను. ఇంత చక్కని మోడల్ దొరికినందుకు నాకు చాలా ఆనందంగా ఉంది" అన్నాడు రవీంద్ర.

ఆ మాటలు మరల ఆమెలోని స్త్రీత్వాన్ని మేల్కొలిపినయ్. ఆమెలోని అహంభావానికి సమిధలు వేసినయ్. ఎంతటి సౌందర్యవతియైన స్త్రీకైనా, ఆ సౌందర్యం ఒక పురుషుడి ప్రశంసకు పాత్రమైనప్పుడే తన సౌందర్యం సార్థకమైనది అన్న సంతృప్తి కలుగుతుంది.

మెహర్ చాలా అందమైన పిల్ల అని బంధువులు, స్నేహితులు అనుకోగా ఆమె చాలాసార్లు అన్నది.

కాని యిలా ఒక పురుషుడు, అందగాడు, విద్యాధికుడు, చిత్రకారుడు తన ఎదురుగా నిలబడి తన ముఖంమీదనే తనని స్తుతిస్తుంటే ఆ అనుభవం ఎంతో తియ్యగా ఉంది ఆమెకు.

మీరు నన్ను మోడల్‌గా తీసుకుని చిత్రాన్ని గీస్తున్నారంటే నాకెంతో ఆనందంగా ఉంది. అంతకన్న నాకేం కావాలి?" అన్నది చెమ్మగిలిన నేత్రాలతో మెహర్.

"గుడ్ గర్ల్! యూ ఆర్ సింప్లీ గుడ్...." "మళ్ళీ రేపు ఉదయం కలుసుకుందాం. టా టా! గుడ్‌నైట్!" అని ఆమె సమాధానంకోసం కూడా ఎదురు చూడకుండా హుషారుగా నడచి వెళ్ళిపోయేడు డాక్టర్.

మెహర్ మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ తమ గదిలోకి వెళ్ళింది. ఆమె వెళ్ళేసరికి రజ్వీ, ఆమె తల్లి తాహెరాబేగమ్; వదిన వహీదా ముగ్గురూ ఉన్నారు.

వాళ్ళను చూస్తూనే తొట్రుపడింది మెహర్.

"ఇంతరాత్రిపూట బాబాని వంటరిగా విడిచి ఎక్కడకు పోయేవే?" అన్నది తల్లి.

"ఏం లేదమ్మా! అలా వార్డంతా చూద్దామని వెళ్తే యింతలో డాక్టర్‌సాబ్ కనపడ్డారు. ఆయన ఏదో మాట్లాడుతుంటే ఆలస్యమైపోయింది." అన్నది మెహర్.

(ఇంకా వుంది)

**Published by A. Thirupathi Rayudu at No. 1, Arcot Road, Madras-26 and Printed by G. Veera Brahmam at his Anuradha Acchagam, 146, T. H. Road, Madras-21**
Controlling Editor: **"CHAKRAPANI"**



Kleertone

# క్లీర్‌టోన్ ఆటోమేటిక్ ఇస్త్రీపెట్టె వాడి విద్యుత్తుపై ఖర్చు తగ్గించుకోండి

ఇంపీరియల్ ఆటోమేటిక్ ఇస్త్రీ

- 230 / 250 వోల్టులు ఎ సి గాని లేక ఎ.సి/డి.సి ల పై గాని పనిచేస్తుంది,
- 800 వాట్లు కలది
- 2.7 కిలోగ్రాముల బరువుగలది.
- ఇస్త్రీ పెట్టె అంతా సమానంగా వేడెక్కుతుంది.

Kleertone క్లీర్‌టోన్ — సాటి లేని విద్యుత్ ఉపకరణాలు

నేషనల్ రేడియో & ఎలక్ట్రానిక్స్ కం లిమిటెడ్

(జనరల్ రేడియో & అప్లయన్సెస్ డివిజన్)

బొంబాయి • కలకత్తా • ఢిల్లీ • మద్రాసు

UIKA KLI

